## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120032442

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

గ్రంథకర్త:



చర్ల గణపతిశాస్త్రి
(ఆర్ష విజ్ఞాన పరిషత్తు)

ఓం

సరస్వత్యైనమః

# గాంధర్వ వేదము

సంగీతరత్నాకరము

శార్ఙ్గదేవుడు




## చర్ల గణపతిశాస్త్రి

: రూ 25-00

# తత్త్వమథనము

సదాశివుడు పార్వతి మొదలైన దేవతలును, మతంగుడు కశ్యపుడు మొదలైన మునులును నారదుడు తుంబురుడు ఆంజనేయుడు మొదలైన భక్తులును నాదము నుపాసించి తన్మయులై ఆనందమున మునిగి అర్థమును భావనచేసి, సంగీతముద్వారా భగవంతుని ఉపాసించిరి. శ్రవణములు మొదలైన బాహ్యేంద్రియముల ద్వారా విని హృదయమున భావనచేసి పరమాత్మలో లీనమైరి.

వనమున గడ్డిని తిను లేడి బోయవాడు పాడు పాట విని ఒడలు మరచి బోయ తన్ను చంపునను ధ్యాసకూడ లేకుండ తన్మయమై తాను ఆహుతి యగుచున్నది. సంగీత మాధురికి పాములు బాలురు ఒడలు మరచిపోవు చున్నారు.

ఆ నాదము వ్యక్తము అవ్యక్తము అని రెండు విధములు. అర్థము సాహిత్య భావములతోఁ గూడిన కీర్తనలోనిది వ్యక్తము. అర్థములేక కేవల నాద పరమైనది అవ్యక్తము. వీనినే సగుణము నిర్గుణము అనవచ్చును. బ్రహ్మ విష్ణు మాహేశ్వర సరస్వతీ లక్ష్మీ పార్వత్యాద్యుపాసనలు సగుణము వ్యక్తము. వీనికి మూలమైన పరబ్రహ్మోపాసన సాహిత్యభావన లేని నాదము ఉదాహరణకు రాగాదులు నిర్గుణము అవ్యక్తము.

ప్రపంచములో అన్నివిద్యలు, అన్ని కర్మలు, అన్ని కళలు భగవంతు డెవరో తానెవరో తెలిసికొని వానిద్వారా తన్మయత్వమును, ధ్యాన సమాధిని పొందుట జీవిత లక్ష్యము. ఆ లక్ష్యమునకు విద్యలు సంగీతాది కళలు సాధనములు. వేదమునకు స్వరము ముఖ్యమైనట్లు సంగీతమునకు నాదము ముఖ్యము. నాదమునకు సాహిత్యము ప్రాణము. సాహిత్యమునకు నాదము మూలము. పువ్వులోని అందము ముందు మనల ఆకర్షించును. దానిలోని పరిమళము మన హృదయమునకు ఆనందము గూర్చును. నాదము ముందు ఆకర్షించును. సాహిత్యమును భావించిన కొలది హృదయానందమును కలిగించును. పరిమళములేని పువ్వు ఆహ్లాదకరము కానట్లు సాహిత్య భావనలేని నాదము హృదయమునకు ఆనందమిడదు. ఔషధమునకు తేనె అనుపానమైనట్లు ఉత్తమ భక్తిజ్ఞానములకు నాదము అనుపానము,

స్వాదుకావ్య రసోన్మిశ్రం శాస్త్ర మప్యుపయుంజతే
ప్రథమాలీఢ మధవః పిబంతి కటు భేషజమ్

రుచికరముగా నుండిన కావ్యచిత్ర కళాదులతో గూడిన శాస్త్రమునుగూడ ఉపయోగింతురు. మొదట రుచి చూచినతేనెనుబట్టి పైకి కటువుగానున్న మందును గూడ త్రాగుదురని పెద్దల సూక్తి. మందు పుచ్చుకొనుటకు తేనె సహాయపడినట్లు మధుర నాదము భక్తిజ్ఞానములకు సహాయపడును.

సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః పదాంబుజే

ఏకమాపాత మధురం, మన్యదాలోచనామృతమ్

సంగీతము సాహిత్యము అనునవి సరస్వతి పాదపద్మములు. సంగీతమను పాదపద్మము పైకి పైకి మధురముగా నుండును. సాహిత్య మనెడి పాదపద్మము ఆలోచించిన కొలది, భావించిన కొలది అమృతముగా నుండును అను సూక్తి యీ భావమునె సూచించుచున్నది. సరస్వతి నారాధించ వలెనను ప్రవృత్తి సంగీత నాదమును బట్టి కలుగగా సాహిత్య భావము అమృతమై యానందతన్మయత్వములను కలిగించును. అంజనేయాది భక్తులు అట్లె తన్మయత్వము పొందిరి. సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము గలదే అని త్యాగయ్య కూడ చెప్పెను. సుఖ దుఃఖాదులను సగుణ భక్తిని దాటిన వారు నిర్గుణ బ్రహ్మమును పొందురు. మొదట సగుణ భక్తిని ఉపాసించినగాని నిర్గుణ తత్త్వము అందదు: అసలు సగుణభక్తిని సాహిత్య భావములను మననము చేయనివారికి నిర్గుణ భక్తి అందనే అందదు. అందుచే ముందు త్యాగయ్య మొదలగు వారివలె సగుణభక్తిని ఉపాసింప వలెనన్నచో సాహిత్య భావముతో ఐక్యమును పొందవలయును. తుంబుర నారదాంజనేయ త్యాగరాజాదులు మొదట సగుణ భక్తులే. సగుణ భక్తిని ఉపాసించి ఉపాసించి పిదప నిర్గుణ భక్తిలో ఓలలాడిరి.

అందుచే సాహిత్యమును మననము చేయవలయును. సాహిత్యమును భావనను చేయవలయును. సాహిత్యమున దృష్టిలేక కీర్తన భావమునే పరము చేసికొనక లౌకిక వ్యామోహములో భోగములలో పడినవారు భక్తులెట్లు అగుదురు. వారు కేవల సంగీతజ్ఞులు మాత్రమే అగుదురు.

నేటి సంగీత గాయకులు వృత్తిగాయకులుగా నున్నారు. వారికి తన్మయత్వమే దొరకదు. ఇంక పాండిత్యమును మాత్రమె చూపు గాయకులు గూడ వృత్తి గాయకులుగను సంగీతజ్ఞులుగను మాత్రమె అవుదురు. వారు సరియైన భక్తులుగానేకారు. త్యాగయ్యగారు చెప్పినట్లు పరలోక భయము

శేక భవ పాశమునబడి కరివాటి శృంగారారామ శబకలు మాత్రమున్నవని కులుకుదురు. వారు భక్తిమార్గమును తెలియలేరు. స్నానముచేసి విభూది పూసికొన్న వారువలె ఆ పాత మధుర సంగీతమునే ఆలపింతురు. పాండితీ ప్రకర్ష చూపువారు భక్తులు గానేరారు. సరిగదా పైగా వారికి తన్మయత ఆనందములు అందనే అందవు.

యోగసాధన చేయువారు సమాధి పొందుటకు ఆసనములు ప్రాణాయామాదులు చేయవలయును.

వేదవిదులు బ్రహ్మవేత్తలు కాగోరువారు ముందు శబ్దముల క్రియల వేదములు సంతవేయుట మొదలగునవి చేయవలెను. సాహిత్యోపాసకులు మొదట శబ్దముల క్రియల సమాసాదుల జ్ఞానము పొందవలయును.

సంగీత సాధనచేయువారు స్వరములు జంటలు త్రికాలములు అలంకారములు గీతములు స్వరజతులు వర్ణములు సాధనచేయవలయును ఆ వర్ణములలోని శృంగారమయ సాహిత్యమును మార్చుకొనవలెను. దేవునికి తమ సర్వస్వము అర్పించుకొను దేవదాసీలు క్రమముగా ధనదాసీలు భోగదాసీలుగా మారిరి. భోగకత్తెలు పాడుటకు జావళీలు పదములు మొదలుగునవి ఏర్పడినవి. భక్తులు పాడవలసినవికావు. శిష్యులకు శిష్యురాండ్రకును చెప్పవలసినవి కూడకావు. అర్థము తెలియకపోవుటచే బాధ లేపోవుచున్నది.

కాశివెళ్ళి వేదములు చెప్పుకొను విద్యార్థికి వేదము వఠన పాఠములు చెప్పిన గురువు "అబ్బాయీ నీకు ఇనపపెట్టె ఇస్తున్నాను" సంస్కృతము నేర్చుకొని అర్థము తెలిసికొన్నపుడు నీవా ఇనపపెట్టె తీసికొని దానిలోనిధన రాసులను పొందుటకు తాళంచెవి కొరకును అనెనట. జ్ఞానమునకు శ్రవణ మనన నిదిధ్యాసములు క్రమముగా సాధనములైనట్లు సంగీత నాదలయ తన్మయతకు పఠన పునః పునరావృత్తి సాధనలు ఉపయోగించును.

శరీరారోగ్యము ద్వారా మానసికారోగ్యము రెండింటి ద్వారా జ్ఞానము మోక్షము సిద్ధించును. కాని శరీరారోగ్యమునకని మొదలు పెట్టి కుస్తీలు దండెములు, సర్కసు ఫీటులు చేసి టికెట్ల ద్వారా ధనసంపాదన చేసికొనుచున్నట్లు కవులు వ్యక్తులమీద పద్యాలల్లి ధనికులకు అంకితాలిచ్చి సొమ్ము చేసికొనుచున్నట్లు నేడు గాయకులు స్వర కల్పనల ఫీట్లువేసి టికెట్లు పెట్టించి సంగీత

విరాగులైన మహర్షులు తపస్సుచేసి సహజ సమాధినిపొంది భగవంతునితో ఐక్యము పొందుచున్నారు. బైరాగులు మత్తు కలిగించు గంజాయి మొదలగు మత్తుపదార్థములు సేవించి వికృత సమాధినిపొంది అజ్ఞానులగుచున్నారు. కవులు గాయకులు నటకులు కొందరు మద్యాది వ్యసనాలకు లోబడి ఆమైకములో గాని మాకు సరియైన కవిత్వాదులు కలుగవని చెప్పస్థితికి వచ్చుచున్నారు. వైదికులు వేదముల అర్థము తెలిసికొనక వాటి గొప్పతనము పొందలేకున్నారు. కాని యింత కాలము వేదము నశించి పోకుండ వేదరక్షచేసినందుకు వారిని కొంతవఱకు అభినందింపవలెను. అట్లే అర్థము కాకున్నను మిగుల శ్రావ్యముగా హాయిగా పాడుచున్నందుకు గాయకుల నభినందింపక తప్పదు.

ముందుకీర్తలకు, అవి తెలుగులో ఉన్నను సంస్కృతములో ఉన్నను వానికి అర్థము తెలిసికొని శిష్యులకుచెప్పి వాని యర్థము చెడనట్లు పాడవలెను. పల్లవిలోగాని అనుపల్లవిలోగాని చరణములోగాని అర్థము ముగియువరకు పాడవలయును. అర్థము సగముదాక వచ్చినపుడు పల్లవి అనుపల్లవి వరకు గాని చరణము వరకుగాని పాడి పిదప పల్లవిలోగాని అనుపవిల్లలోగాని సాహిత్యములోని వివిధ సంగతులు భావము బాగుగా అనేకపర్యాయములు భక్తిరసస్ఫోరకముగా పాడి శ్రోతల తన్మయుల చేయవచ్చును.

శ్రీ శార్‌జ్ఞదేవుని కీర్తనలకు స్వరము వ్రాయబడి యున్నది కనుక వానిని గూడ పాడుట నేటివారు అలవాటు చేసికొనవలయును. వాది వివాది సంవాది స్వరములపద్ధతిని అనుసరింపవలయును. వానిలో ఆలాపము, ఆక్షిప్తిక, వర్తని కరణము మొదలగు ప్రబంధ పద్ధతులు వ్రాయబడి యున్నవి వానిని గూడ అభ్యసింతుముగాక.

నాటకాలు సినీమాలలోని పాత్రలు వేషధారులైనను ఆ పాత్రల భావములను కృత్రిమముగానైన అనుకరించుటవలన సామాజికులు ఆయా రస భావములుకలిగి రసనిమగ్నులౌదురు. త్యాగరాజాదులు వారి భావములకు అనుగుణముగా పాడినవైనను మనము త్యాగరాజాదుల భావములను భావించి ఆయారసములకు భావములకు అనుగుణముగా పాడినచో శ్రోతలు తన్మయులై ఆయా భక్తి భావములు గలవారగుదురు. కాన అట్లైనను తత్తద్భావానుగుణముగా అర్థము తెలిసికొనిపాడి యాగ యోగ త్యాగభోగ ఫలమొసంగ్గే రాగ సుధా రసపానముచేసి రాజిల్లి ధన్యులు గావలెనని కోరుచున్నాను.

మహాభక్తుడైన
రామదాసుకును

ఎవరిని ఆశ్రయింపక
కృషి కర్మచే జీవించుచు
పరమ భాగవతమును రచించిన
పోతన్నకును

అయాచితముగా వచ్చిన
నిధిని కూడ కాలందోచి రాముని సన్నిధిని తన్మయుండై
యుంఛ వృత్తిని అవలంబించి
భక్తిని సంగీతముతో మేళవించి
రాగ సుధామయ కీర్తనలలో
రాముని ముంచెత్తి
తాను మునిగి తన్మయుడై
తరించిన
త్యాగయ్యకును

రాజభోగాలు
మూలకు త్రోసివైచిన
భక్తురాలు
మీరాకును

# నాదోపాసకులు

| వాగ్గేయకారకులు | కృతులు | కాలము |
|---|---|---|
| భరతుఁడు | నాట్యశాస్త్రము | తెలియదు |
| నారదుడు | నారదీయశిక్ష స్వరార్ణవము | |
| మతంగుడు | బృహద్దేశి | |
| ప్రతాప శైలపుడు | సంగీత చూడామణి | 200-00 |
| మమ్మటాచార్యుడు | సంగీత రత్నమాల | 1050-1150 |
| జయదేవుడు | అష్టపదులు | 1090-1100 |
| పార్శ్వదేవుఁడు | సంగీత సమయసారము | 1165- |
| చాళుక్య సోమేశ్వరుడు | సంగీత రత్నావళి. మొ. | 1174- |
| సోమనార్యుడు | స్వరరాగ సుధాకరము | 1160-1260 |
| జాయపసేనాని | నృత్త రత్నావళి | 1262- |
| శార్ఙ్గదేవుడు | సంగీతరత్నాకరము దౌలతాబాదు | 1247- |
| సింహభూపాలుడు | సంగీతరత్నాకర వ్యాఖ్య | 1330-1420 |
| గోపాలనాయకుఁడు | ధ్రువాగాననిపుణుఁడు | 1315- |
| హరిపాలదేవుడు | సంగీత సుధాకరము | 1309-1312 |
| విద్యారణ్యుడు | సంగీతసారము | |
| | కర్ణాటక సంగీతనామకారకుడు | 1320-1380 |
| కుమారగిరి వసంతరాజు | వసంత రాజీయము | 1380-1400 |
| పెదకోమటి వేమారెడ్డి | సంగీత చింతామణి | 1402-1420 |
| గోపేంద్ర తిప్పభూపాలుడు | తాళదీపిక | |
| చతురకల్లినాథుడు | సంగీతరత్నాకర వ్యాఖ్య కళానిధి | 1423-1446 |
| అన్నమాచార్యుడు | అన్నమాచార్య కీర్తనలు (వేలు) | 1408-1460 |
| పెదతిరుమలాచార్యులు | వేంకటేశ్వరస్వామిమీది కీర్తనలు | 1473- |
| పురందరదాసు | సరళి అలంకార పిళ్లారి గీతములు | 1484-1564 |
| | కీర్తనలు-సూళాది విభాగము | |
| మీరాబాయి | పదావళి | 1500-1600 |
| భండారు లక్ష్మీనారాయణ | సంగీత సూర్యోదయము | 1503-1520 |
| చెరుకూరి లక్ష్మీధరుడు | గీతగోవిందవ్యాఖ్య-శ్రుతిరంజని | |

| | | |
|---|---|---|
| రామామాత్యుడు | స్వరమేళకళానిధి | 155 |
| నారాయణ తీర్థులు | శ్రీకృష్ణలీలా తరంగిణి | 158 |
| సిద్ధేంద్రయోగి | భామా కలాపము | 160 |
| చతురదామోదరుడు | సంగీత దర్పణము | 157 |
| పుండరీక విఠలుడు | సద్రాగ చంద్రోదయము | 159 |
| మాధవభట్టు | సంగీత చంద్రిక | 1614 |
| తానప్పాచార్యుడు | సంగీత శాస్త్రము | 160 |
| భావభట్టు | సంగీత లక్షణం 20 జనకరాగాలు | |
| గోవింద దీక్షితుడు | సంగీత సుధానిధి | 154 |
| వెంకటమఖి | చతుర్దండి ప్రకాశిక<br>72 మేళకర్తల దర్శకుడు | 1620 |
| గోవిందామాత్యుడు | సంగీతశాస్త్ర సంక్షేపః | 157 |
| క్షేత్రయ్య | క్షేత్రయ్య పదములు | 161 |
| రామదాసు | కీర్తనలు దాశరథీ శతకము | 165 |
| తూము నరసింహదాసు | కొన్ని రామదాసు కీర్తనలు | 170 |
| తాళ్ళపాకము చిన్నయ | మంగళము-హెచ్చరిక<br>కీర్తనలు, దివ్యనామ కీర్తనలు మొ. | |
| సహజీ మహారాజు | పల్లకీ నాటకము | 163 |
| రామస్వామి దీక్షితులు | కీర్తనలు | 177 |
| శ్యామశాస్త్రి | స్వరజాతులు తానవర్ణాలు<br>కీర్తనలు | 176 |
| త్యాగయ్య, | వేలకొలది కీర్తనలు<br>ప్రహ్లాద విజయము, నౌకాచరిత్ర. మొ. | 176 |
| ముత్తుస్వామి దీక్షితులు | సంస్కృత కీర్తనలు | 177 |
| ఎట్టయ్యప్ప మహారాజు | కీర్తనలు | 176 |
| సుబ్బరామ దీక్షితులు | సంగీతసంప్రదాయ ప్రదర్శిని<br>సంగీతలక్షణ సంగ్రహము | 190 |
| మునిపల్లె సుబ్రహ్మణ్యకవి | అధ్యాత్మరామాయణ కీర్తనలు | 173 |
| స్వాతితిరునాళ్ మహారాజు | పదాలు తిల్లానాలు కృతులు | 182 |

# గాంధర్వ వేదము

విషయసూచిక

# గాంధర్వవేదము

## (సంగీత రత్నాకరము)

తొలినారాయణుఁ డాత్మరూపమున నెందున్ క్షీరమట్లొప్పి. లీ
లలకై ఆపయి పాలమీఁగడయటుల్ వ్యక్తాకృతిన్‌జెందె. ని
ర్మలమాకాశము, నందుగాలి, జ్వలనంబాపై నటన్‌నీరు, నం
దిల, యన్నింబయి జీవియై వెలుఁగు, నాయీశున్ సదా మ్రొక్కెదన్.

బ్రహ్మముఖంబునం దమృతవాహినియై విశదంబునొంది ఆ
బ్రహ్మఋషి ప్రశాంత విమలాశ్రమవాటి మెలంగి సత్కవి
బ్రహ్మల మోముఁదమ్ముల సరస్సులలో రసకేళిఁదేలు నా
బ్రాహ్మి మదార్యసూక్తి రసపావనియై విహరించుఁ గావుతన్.

పదముల్ చేతులు నాట్యభంగిముల భావస్ఫూర్తి కావింపగన్
వదనంబెంతయు శ్రావ్య హృద్యగతులన్ బల్కింప, వాగర్థముల్
హృదయంబున్ మఱపింప దేహమిటు లెందే నింద్రియాతీతస
త్పదమానందము పొందఁగొల్పునగు నావాగ్దేవికిన్ మ్రొక్కెదన్

జీవి పుట్టఁగనే కాళ్ళు చేతులు కదిపి యాడి యానందించి కేరింతలు కొట్టును. మధురనాదమును విని కిలకిలనవ్వి యానందించును. పెద్దయైన కొలది మధురభావ సహితమైన సాహిత్యమును గ్రహించి పరమానందమున లీనమగును. సంగీతము వినగా ముందు చెవులద్వారా విని మనస్సు ఆనందించును. అది పైకి మధురిమఁ జిమ్మును. సాహిత్యము ఆలోచించినకొలది యమృతమగును.

సంగీత మపిసాహిత్యం, సరస్వత్యాః పదద్వయం
ఏక మాపాత మధుర మన్యమాలోచనాఽమృతం

సంగీతము సాహిత్యమనునవి సరస్వతిపాదపద్మములు. ఒకటిచెవులలోఁ బడఁగానే మధురముగా నుండును. రెండవదైన సాహిత్యమను పాదపద్మము ఆలోచించినకొలది యమృతమువంటిది. ఈ రెండు పాదపద్మములను ఉపా

సించినవాఁడుసరస్వతిని సగముసగముగాఁ గాక పూర్ణముగా ఉపాసించినవాఁడగును. ఇదివఱలో సాహిత్య సౌందర్య దర్శనాదులద్వారా ఒకపాదపద్మము ఉపాసన చేయఁబడినది. ఇప్పుడీసంగీతోపాసన ద్వారా సరస్వతీదేవి రెండవ పాదపద్మము ఉపాసన పూర్ణముగా చేయఁబడుచున్నది. సంగీతసాహిత్యముల ద్వారా సరస్వతిని ఉపాసించి బ్రహ్మానందైక్యమును మనసు పొందవలసి యున్నది. అపుడే జీవితము పూర్ణముసార్థకమునగును.

శ్లో. సదాశివః శివా బ్రహ్మ భరతః కశ్యపో మునిః
మతంగో యాష్టికో దుర్గాశక్తిః శార్దూలకోహలౌ
విశాఖిలో దంతిలశ్చ కంబళోఽశ్వతరస్తథా

వాయుర్విశ్వావసూ రంభార్జునౌ నారద తుంబురౌ
ఆంజనేయో మాతృగుప్తో రావణోనందికేశ్వరః

స్వాతిర్గుణో బిందురాజః క్షేత్ర రాజశ్చరాహులః
రుద్రసేనశ్చ భూపాలో భోజ భూవల్లభస్తథా

పరమర్ది చ సోమేశో జగదేక మహీపతిః
వ్యాఖ్యాతారో భారతీయే లోల్లటోద్భట శంకుకాః

భట్టాభినవగుప్తశ్చ శ్రీమత్కీర్తిధరోఽపరః
అన్యేచ బహవః పూర్వేయే సంగీత విశారదాః

అగాధ బోధమన్త్యేన తేషాం మతపయోనిధిం
నిర్మథ్య శ్రీ శార్ఙ్గదేవః సారోద్ధారమిమం వ్యథాత్

సదాశివుడు పార్వతి బ్రహ్మ భరతుడు కశ్యపముని మతంగుడు యాష్టికుడు దుర్గాశక్తి శార్దూలుడు కోహలుడు విశాఖిలుడు దంతిలుడు కంబలుడు అశ్వతరుడు వాయువు విశ్వావసువు రంభ అర్జునుడు నారదుడు, తుంబురుడు, ఆంజనేయుడు, మాతృగుప్తుడు, రావణుడు నందికేశ్వరుడు, స్వాతిర్గుణుడు బిందురాజు క్షేత్రరాజు రాహులుడు రుద్రసేనుడు భోజరాజు, పరమర్ది, జగదేక మహీపతియగు సోమేశుడు, ఈభారతీయసంగీతశాస్త్ర విశారదుల లోల్లటోద్భట

శంకుకులు భట్టాభినవగుప్తుడు కీర్తిధరుడు మొదలైన సంగీత శాస్త్రవిశారదుల పూర్వాచార్యుల మతములను సముద్రములను బోధరూపమైన మందర పర్వతముచే మథించి వాటిసారభూతమైనదానిని మందరపర్వతముచే మథించి శ్రీ శార్ఙ్గదేవుడు వానిసారభూతమైన యమృతముద్ధరించెను.

శ్లో. గీతం వాద్యం తథానృత్యం త్రయం సంగీతముచ్యతే
మార్గోదేశీతి తద్ద్వేధా తత్ర మార్గ ఉచ్యతే

గీతము వాద్యము నృత్యము ఈ మూఁడును సంగీతమనబడును. అది మార్గము దేశి అని రెండువిధములు అందు మార్గము చెప్పబడుచున్నది.

యోమార్గితో విరించాద్యైః ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురతశ్శంభోర్నియతా భ్యుదయ ప్రదః

బ్రహ్మ మొదలగు వారిచేతను భరతాదుల చేతతను మార్గము చూపఁబడి శంభుదేవుని యెదుట ప్రయోగింపబడి నియతముగా అభ్యుదయము నిచ్చునది మార్గము అని చెప్పబడుచున్నది.

దేశేదేశే జనానాం యద్రుచ్యా హృదయ రంజనం
గానంచ వాదనం నృత్యం తద్దేశీత్యభిధీయతే

దేశదేశ జనుల రుచినిబట్టి చేయబడిన హృదయరంజకమైన గానము వాదనము నృత్యముదేశి అనబడును.

గీతేన ప్రీయతే దేవః సర్వజ్ఞః పార్వతీ పతిః
నృత్యం వాద్యానుగం ప్రోక్తం వాద్యం గీతానువృత్తి చ
అతోగీతం ప్రధానత్వా దత్రాదావభిధీయతే,

నృత్యము వాద్యముల ననుసరించును వాద్యములు గీతమువనుసరించును. అందుచే గీతము ప్రధానము. అందుచే అదే ముందు చెప్పబడుచున్నది.

సామ వేదా దిదం గీతం సంజగ్రాహ ప్రజాపతిః

సామవేదమునుండి ఈగీతమును ప్రజాపతి సంగ్రహించెను. గీతముచే సర్వజ్ఞుడైన దేవుడు శివుడు సంతోషించును.

గోపీపతి రనంతోపి వంశధ్వని వశం గతః
సామగీతి రతో బ్రహ్మ వీణా సక్తా సరస్వతీ॥

అనంతుడైన గోపాలుడు మురళీ ధ్వనికి వశమయిన బ్రహ్మసాహిత్య ప్రియుడు సరస్వతి వీణ యందాసక్తురాలు.

కిమన్యే యక్షగంధర్వ దేవదానవ మానవాః
అజ్ఞాత విషయాస్వాదో బాలః పర్యంకికాగతః
రుదన్ గీతామృతం పీత్వా హర్షోత్కర్షం ప్రపద్యతే

ఇంక యక్షులు గంధర్వులు దేవతలు దానవులు మనుష్యులసంగతి చెప్పవలసినదేమున్నది. విషయరుచి తెలియనిబాలుడును ఉయ్యాలయం దుండిఏడ్చుచు గీతామృతము గ్రోలి ఆనందించును.

వనే చర స్తృణాహారశ్చిత్రం మృగశిశుః పశుః
లుబ్ధో లుబ్ధక సంగీతే గీతే త్యజతి జీవితం.

వనమున తిరుగుచు గడ్డితిను లేడిపిల్ల పశువు; బోయవాడు పాడుపాటకు వశమై తనజీవితమునే విడుచుచున్నది.

తస్య గీతస్య మాహాత్మ్యంకే ప్రశంసితు మీహతే
ధర్మార్థ కామమోక్షాణా మిదమేకైక సాధనం

ఆగీత మాహాత్మ్యమును ఎవరు ప్రశంసింపగలరు. ధర్మార్థ కామమోక్ష ములకిది యొక్కటే సాధనము.

వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతివిశారదః
తాళజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గంచ గచ్ఛతి

పాటల తత్త్వమును దెలిసి శ్రుతిజాతులందు నేర్పు గలిగి తాళము తెలిసినవాడు సులువుగా మోక్షమార్గమును పొందును.

గీతం నాదాత్మకం వాద్యం వాదవ్యక్త్యా ప్రశస్యతే
తద్ద్వయానుగతం నృత్తం నాదాధీన మతత్త్రయం

గీతము నాదరూపమైనది. నాదము వ్యక్తమగుటచే వాద్యము ప్రశంసింపబడును. నృత్యము ఆరెండింటిననుసరించును. కనుక అమూడును నాదమున కధీనమైయుండును.

నాదేనవ్యజ్యతే వర్ణః పదం వర్ణాత్పదాద్వచః
వచసో వ్యవహారోఽయం నాదాధీన మతోజగత్

నాదముచే వర్ణము, వర్ణముచే పదము పదముచే వాక్కు వాక్కుచే ఈ వ్యవహారము కలుగును కనుక జగత్తు నాదాధీనము.

సోఽయం ప్రకాశతే పిండే తస్మాత్పిండోఽభిధీయతే
గుదలింగాంతరే చక్రమాధారాఖ్యం చతుర్దళం
పరమః సహజ స్తద్వదానందో జీవపూర్వకః

నాదము శరీర మనుమాంసముద్దయందు ప్రకాశించును. కనుక దానిని పిండమందురు. మలమూత్ర ద్వారముల మధ్య ఆధారము నాలుగుదళముల చక్రముగలదు. అది గొప్పది. సహజము. దానియానందము జీవపూర్వకమైనది.

యోగానందశ్చ తత్రాస్త్యై దైశానాది దళే ఫలం
అస్తికుండలినీ బ్రహ్మ శక్తి రాధారపంకజే.

అందు ఐశానాది పద్మమందు బ్రహ్మశక్తిగల కుండలిని గలదు. అది ఆధార పద్మమందున్నది.

ఆబ్రహ్మరంధ్ర మృజుతాం నీతేఽయమమృతప్రదా
స్వాధిష్ఠానంతతో లింగమూలేషడ్దళం చక్రమస్తిచ.

బ్రహ్మరంధ్రమువఱకు అమృతమునిచ్చు నీకుండలిని ఋజువై యున్నది. లింగమూలమున ఈ ఆరుదళముల స్వాధిష్ఠాన చక్రమున్నది.

నాభౌ దశదళం చక్రం మణిపూరక సంజ్ఞకం
హృదయేఽనాహతం చక్రం, శివస్య ప్రణవాకృతేః
పూజాస్థానం తదిచ్ఛంతి దళై ర్ద్వాదశభి ర్యుతం
కంఠే భారతీ స్థానం విశుద్ధిః షోడశచ్ఛదం,

నాభియందు దశదళములుగల మణిపూరకమను చక్రముగలదు. హృదయమందు అనాహత మనుచక్రముగలదు. అది ప్రణవాకృతిగల శివుని పూజకు స్థానము. అది పన్నెండు డళములతో కూడినది. కంఠమందు భారతికి స్థానమైన విశుద్ధిచక్రమున్నది. అది పదునాఱు దళములుగలది.

భ్రూమధ్యే ద్విదళం చక్రమాజ్ఞా సంజ్ఞాం లభేత్సదా
చక్రం సహస్రపత్రంతు బ్రహ్మరంధ్రే సుధాధరం

కనుబొమ్మలమధ్య సదా రెండు దళముల ఆజ్ఞాచక్రమున్నది. బ్రహ్మరంధ్రమందు సహస్రదళములుగల చక్రమున్నది. అది సుధను ధరించి యున్నది.

బ్రహ్మరంధ్రే స్థితో జీవః సుధయా సంప్లుతో యదా
తుష్టో గీతాది కార్యాణి సప్రకర్షాణి కారయేత్

బ్రహ్మరంధ్రమందున్న జీవుడు ఎప్పుడు సుధతోఁదడపబడునో అపుడు తుష్టుడై గీతాదికార్యములెక్కువగా చేయించును.

ఆధారాద్ద్వ్యంగులా దూర్ధ్వం మేహనాద్ద్వ్యంగులా దధః
ఏకాంగుళం దేహం తప్త జాంబూనద ప్రభం.

ఆధారచక్రముకంటె రెండు అంగుళములపైని మేహనముకంటె రెండు అంగుళముల క్రింద ఒక యంగుళముగల దేహము పుటముపేసిన బంగారము కాంతి కలదై యుండును.

తత్రాస్తేఽగ్ని శిఖా తన్వీ చక్రాత్తస్మాన్నవాంగుళే
బ్రహ్మగ్రంధిరితి ప్రోక్తం తస్యనామ పురాతనైః

అక్కడ దేహమధ్యగం చక్రముకంటె తొమ్మిది అంగుళములుగల దేహమందు సన్నని అగ్నిశిఖగలదు. దానిని పూర్వులు బ్రహ్మగ్రంధి అనిరి.

తన్మధ్యే నాభి చక్రంతు ద్వాదశారమవస్థితం
లూతేవ తంతు జాలస్థా తత్ర జీవో భ్రమత్యయం.

దానిమధ్య 12 ఆకులుగలనాభి చక్రముగలదు. దారములందు సాలె పురుగువలె ఈ జీవుడు తిరుగుచుండును.

సుషుమ్నాయా బ్రహ్మరంధ్ర మారోహ త్యవరోహతి
జీవః ప్రాణ సమారూఢో రజ్జ్వాం కోలాహలో యథా

సుషుమ్నానాడిద్వారా జీవుడు ప్రాణముతోగూడి ఉయ్యాలత్రాడు పైని క్రిందుకు పైకి నూగువానివలె ఎక్కుచు దిగుచు నుండును.

ఏవం విధేతు దేహేఽస్మిన్ మల సంచయ సంయుతే
ప్రసాదయంతి ధీమంతో భుక్తిం ముక్తిముపాయతః

ఇటువంటి మలసంచయముతోఁ గూడిన దేహమందు ధీమంతులు ఉపాయముచే భుక్తిని ముక్తిని సాధించుచున్నారు.

తత్రతస్యాత్సగుణ ధ్యానాద్భుక్తిర్ముక్తిస్తునిర్గుణాత్
ధ్యానమేకాగ్రచిత్తైకసాధ్యంన సుకరం నృణాం

అందు సగుణధ్యానమువల్ల భుక్తియు నిర్గుణధ్యానమువల్ల ముక్తియు కలుగును. ధ్యానము ఏకాగ్రచిత్తమువల్లనే సిద్ధించును. అదినరులకు సులభముకాదు.

తస్మాదత్ర సుఖోపాయం శ్రీమన్నాద మనాహతం
గురూపదిష్ట మార్గేణ మునయః సముపాసతే

అందువల్ల ఇక్కడ సుఖోపాయమైన సుభమైన అనాహతనాదమును గురూపదేశముద్వారా మునులు ఉపాసించుచున్నారు.

సోఽపిరక్తి హీనత్వా న్న మనోరంజకో నృణాం
తస్మాదాహ తనాదస్య శ్రుత్యాది ద్వారతోఽఖిలం

అదియు రక్తి లేకపోవుటవల్ల నరులకు మనోరంజకముకాదు. కనుక ఆహతనాదమును శ్రుత్యాద్యులదారా పూర్తిగా సాధింపవలెను.

గేయుం వితన్వతో లోకరంజకం భవభంజనం
ఉత్పత్తి మభిధాస్యామ స్తథా శ్రుత్యాది హేతుతాం

గేయమును విస్తరింపఁ జేయుటవల్ల లోకరంజనమును భవభంజనమును జరుగును. మేము దానిపుట్టుకను శ్రుత్యాదులకు హేతుత్వమును చెప్పుదుము.

చైతన్యం సర్వభూతానాం వివృతం జగదాత్మనా
నాదబ్రహ్మ తదానంద మద్వితీయ ముపాస్మహే

సర్వభూతములకు చైతన్యమై జగదాత్మయై ప్రకటితమైన నాదబ్రహ్మమైన ఆ యద్వితీయానందము నుపాసింతుము,

నాదోపాసనయా దేవా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః
భవంత్యుపాసితా మూనం యస్మాదేతే తదాత్మకాః

ఈ దేవులయిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నాదస్వరూపులుగాన నాదోపాసనచే తప్పక ఉపాసింపబడిన వారగుదురు.

ఆత్మా వివక్ష మాణో౽యంమనః ప్రేరయతే, మనః
దేహస్థం వహ్ని మాహంతి సప్రేరయతి మారుతం

ఆత్మ మాటాడగోరి మనస్సును ప్రేరేపించును. మనస్సు దేహమం దున్న జఠరాగ్నిని కొట్టును. అది గాలిని ప్రేరేపును.

బ్రహ్మగ్రంధి స్థితః సో౽థ క్రమాదూర్ధ్వ పథేచరన్
నాభిహృత్కంఠ మూర్ధ స్వేప్వా విర్భావ యతిధ్వనిం

అది బ్రహ్మగ్రంధియందు ఉండి క్రమముగా పైకి చరించుచు ఈనాభి హృదయము, కంఠము తలలందు ధ్వని నావిర్భవింపఁ జేయును.

నాదో౽తిసూక్ష్మః సూక్ష్మశ్చ పుష్టో౽ పుష్టశ్చ కృత్రిమః
ఇతి పంచాభిధాం ధత్తే పంచస్థాన స్థితః క్రమాత్

ఈనాదము అయిదు స్థానములందు ఉండి క్రమముగా అతిసూక్ష్మము సూక్ష్మము పుష్టము అపుష్టము కృత్రిమము అను అయిదు పేర్లను ధరించును

నకారం ప్రాణనామానం దకారమనలం విదుః
జాతః ప్రాణాగ్ని సంయోగాత్తేన నాదో౽భిధీయతే

నకారమును ప్రాణమని దకారమును అగ్నియని అందురు. ఈప్రాణా గ్నుల కలయికవలన (నాద) నాదము అభివ్యక్తమగుచున్నది.

వ్యవహారే౽వ్య సౌత్రేధా, హృదిమంద్రో౽భిధీయతే
కంఠేమధ్యో మూర్ధ్ని తారో ద్విగుణశ్చోత్త రోత్తరం

ఈనాదము వ్యవహారములో మూడువిధములుగా నున్నది. హృదయ మున మెల్లగా మంద్రము. కంఠమున మధ్యగా మధ్యమము తలయందు హెచ్చుగా పలుకబడినది తారమనబడును

తస్యద్వావింశతి ర్భేదాః శ్రవణాచ్ఛ్రు తయోమతాః
హృద్యూర్ధ్వనాడీ సంలగ్నా నాడ్యో ద్వావింశతిర్మతాః

అవి ఇరవైరెండు భేదములుగలది. వినబడుటవలన అవి శ్రుతులన బడెను. హృదయమున పైనాడులందున్న నాడులు ఇరవైరెండు.

తరశ్చోస్తాసుతావత్యః శ్రుతయో మారుతా హతా
ఉచ్చోత్త రతాయుక్తాః ప్రభవంత్యుత్తరోత్తరం

ఆశ్రుతులు ఆఇరవైరెండు నాడులందు అడ్డముగా గాలిచే కొట్టబడి శ్రుతులు అన్నియేయగును. అవి హెచ్చుగా నున్నవైపైకిపుట్టును.

ఏవం కంఠే తథాశీర్షేశ్రుతిర్ద్వా వింశతిర్మతాః

ఇట్లు కంఠమునందు తలయందు పుట్టిన శ్రుతులు ఇరవైరెండు.

# సప్తస్వరములు

| | | షడ్జగ్రామము | మధ్యమగ్రామము | గాంధారగ్రామము | శ్రుతులు | జాతులు |
|---|---|---|---|---|---|---|
| 1 | 1 | | | ని | తీవ్ర | దీప్త |
| 2 | 2 | | | | కుముద్వతి | ఆయత |
| 3 | 3 | | | | మంద | మృదు |
| 4 | 4 | స | స | స | ఛందోవతి | మధ్య |
| 5 | 1 | | | | దయావతి | కరుణ |
| 6 | 2 | | | | రంజని | మధ్య |
| 7 | 3 | రి | రి | రి | రతిక | మృదు |
| 8 | 1 | | | | రౌద్రి | దీప్త |
| 9 | 2 | గ | గ | | క్రోధ | ఆయత |
| 10 | 1 | | | గ | వజ్రిక | దీప్త |
| 11 | 2 | | | | ప్రసారిణి | ఆయత |
| 12 | 3 | | | | ప్రీతి | మృదు |
| 13 | 4 | మ | మా | మ | మార్జని | మధ్య |
| 14 | 1 | | | | క్షితి(క్ష్మా) | మృదు |
| 15 | 2 | | | | రక్త | మధ్య |
| 16 | 3 | | ప | ప | సందీపిని | ఆయత |
| 17 | 4 | ప | | | ఆలాపిని | కరుణ |
| 18 | 1 | | ధ | ధ | మదంతి | కరుణ |
| 19 | 2 | | | | రోహిణి | ఆయత |
| 20 | 3 | ధ | | | రమ్య | మధ్య |
| 21 | 1 | | | | ఉగ్ర | దీప్త |
| 22 | 2 | ని | ని | | క్షోభిణి | మధ్య |

**జాతి వివరణ**

జాతులు5. 1 దీప్త 2 ఆయత 3 కరుణ 4మృదు 5మధ్య-షడ్జాదిగ్రామములనుండి పుట్టినవి గాన జాతులనివ్యుత్పత్తి. శ్రుతిభేదములు నాల్గు జాతులలో ఉన్నవి. 1 మంద్రము 2 మధ్యము 3 తారము.

**జాతులు**

దీప్తలో 1 తీవ్ర 2 రౌద్రి 3 వజ్రిక 4 ఉగ్ర

ఆయతలో 1 కుముద్వతి 2 క్రోధ 3ప్రసారి 4 సందీపిని

కరుణలో- దయావతి 2 ఆలాపిని 3 మదంతిక

మృదులో- 1 మంద 2 రతిక 3 ప్రీతి 4క్షితి

మధ్యలో-1 ఛందోవతి 2 రంజని 3 మార్జని 4 రక్తి 5 రమ్య 6 క్షోభణి.

అందు షడ్జము (స నాలుగు శ్రుతులు, ఋషభము (రి మూడుశ్రుతులు గలది, గాంధారము. (గ రెండు శ్రుతులు, మధ్యమము. (మ నాలుగుశ్రుతులు పంచమము (ప నాలుగుశ్రుతులు. ధైవతము [ధ మూడుశ్రుతులు నిషాదము [ని రెండుశ్రుతులు గలది. ఒకస్వరమునుండి యింకొక స్వరమువఱకు తన్ను అభివ్యక్త పఱచుటచే నాలుగు, మూడు, రెండు శ్రుతులుగలది యగును. ప్రతి శ్రుతియు పలుకుటలో స్పష్టముగా వ్యక్తముగాదు. సప్తస్వర శ్రుతులె వ్యక్తమగును.

శ్రుతిభ్యః స్యుః స్వరాః షడ్జర్షభ గాంధార మధ్యమాః
పంచమో ధైవతశ్చాధ నిషాద ఇతి సప్తతే.

'అ' మొదలు 'క్ష' వఱకు స్వతః రంజకములు గాన [స్వతః రంజకః స్వయం రాజంతే కనుక] స్వరములు. వ్యక్తములు వ్యంజనములు. సంగీతములో షడ్జాదులు స్వరములనబడెను. శ్రుతులనుండి షడ్జము స. ఋషభము రి గాంధారము గ మధ్యమము మ పంచమము ప ధైవతము ధ నిషాదము ని అని స రి గ మ ప ద ని ఏడు బయులుదేఱినవి. షడ్జాదిస్వర పదములలోని మొదటి వర్ణములు కొన్ని ప్రకృతిగను కొన్ని వికారయుక్తము గను అయినవి. ష వికృతి స, ఋషభమునకు రి వికృతి, గాంధారాదులు ప్రకృతులు. మొదటవర్ణములు షడ్జాదులకు ప్రతీకలుగా పలుకబడినవి.

షణ్ణాం స్వరాణాంజనకః షడ్భిర్వా జన్యతేస్వరైః
షడ్జోవాజాయతేఽంగేభ్యః షడ్జ ఇత్యభిధీయతే

నాసికము
తానుకాక మిగిలిన రిగమ పదని అను ఆఱు స్వరములకు కంఠము హృదయము తాలువులు నాలుక మనస్సు అను ఆరుఅంగములనుండి పుట్టును కనుకను స అన్నది షడ్జమని పిలువబడెను.

ప్రాప్నోతి హృదయం శీఘ్రమన్యస్మా దృషభః స్మృతః
స్త్రీ గవీషు యథాతిష్ఠన్ విభాతి ఋషభోమహాన్
స్వరగ్రామే సముత్పన్నః స్వరోఽయ మృషభస్తదా

ఇతరమగు చోటులందీ శీఘ్రముగా హృదయమును పొందుచున్నది. [ఋషతి-పొందుచున్నది ఋషగతౌ గతిః ప్రాప్తిః]గాన ఋషభము (ఋష+

భఞాది [ప్రత్యయము] అని వ్యుత్పత్తి. ఎట్లు వృషభము ఆవుల మధ్య ప్రకాశించునో [వృషః భాతి వృషభ ఋషభ] అది వృషభము ఋషభ పదము లోని మొదటివర్ణము ఋ. దీనికి వికృతి. రి.

వాచంగానాత్మకాంధత్త ఇతి గాంధార సంజ్ఞకః
స్వరాణాం మధ్యమత్వాచ్చ మధ్యమః స్వర ఉచ్యతే

గాం-గానాత్మ వాక్కును ధత్తే ధరతి ధరించుచున్నది. కానగాంధారము అనిపేరు వచ్చినది. మొదటి వర్ణము. గ స్వరములలో మధ్యదిగాన మధ్యమము మొదటివర్ణము మ.

స్వరాంతరాణాం విస్తారంయో మిమీతే స పంచమాం
పాఠక్రమేణ గణనే సంఖ్యయా పంచమోఽధవా

పచి-విస్తారే, పచతి-విస్తారమును మిమీతే సరిగమలను కొలుచునుగాన పంచమము లేక స్వరములలో అయిదవదిగా నపంచమము మొదటివర్ణము ప.

ధీర్యస్తి సధీనాం తత్సంబంధీ ధైవతః స్మృతః
షష్ఠస్థానే ధృతోయస్మాత్తతోఽసౌధైవతోమతః

ధీ [బుద్ధి] కల ధీమంతులకు [ధిమంతులకు ఇట 'మ'వగా మారినది] సంబంధించినది ధైవతము ఆరవస్థానమున ధరింపబడినదిగాన ధైవతము [ఈ యర్థములో ధైవతరూపము సరిగా ఏర్పడదు. ధీ వాన్-ధీవతః అయం-ధైవతము. ఈయర్థము సరిగా ఉన్నది.

నిషీదంతి స్వరాః సర్వే నిషాదస్తేన కథ్యతే

స్వరములన్నియు దీనియందు కూర్చుండును కాన నిషాదము. నిషాద పదములోని మొదటివర్ణము. ని. ఈ విధముగా సరిగమ పదని స్వరములు ఏర్పడెనని తెలియవలెను.

శ్రుత్యనంతర భావీయః స్నిగ్ధోఽనురణ నాత్మకః
స్వతోరంజయతి శ్రోతృ చిత్తం స స్వర ఉచ్యతే

శ్రుతుల యనంతరము పుట్టి యనుసరించి ఒకదానితర్వాత ఒకటి లహరులవలె పుట్టి ధ్వనించుచు శ్రోతల చిత్తమును రంజింపజేయునది కాన స్వరమనబడెను.

మయూరచాతకచ్ఛాగ క్రౌంచ కోకిల దర్దురాః
గజశ్చ సప్త షడ్జాదీన్ క్రమాదుచ్చారయంత్యమీ.

నెమలి షడ్జ ధ్వనిని చాతకము ఋషభధ్వనిని మేక గాంధార ధ్వనిని క్రౌంచపక్షి మధ్య మధ్వనిని కోయిల పంచమధ్వనిని పలుకును.

షడ్జం మయూరో వదతిగావో ఋషభభాషిణః
అజావికంతు గాంధారం క్రౌంచః క్వణతి మధ్యమం

నెమలి షడ్జధనిని గోవులు ఋషభధ్వనిని, మేకలు గొఱ్ఱెలు గాంధారమును క్రౌంచము మధ్యమమును పలుకును.

పుష్ప సాధారణేకాలే పికః కూజతిపంచమం
ధైవతం హేషతేవాజీ నిషాదం బృంహతే గజః

పువ్వులు పూచుకాలమున కోయిల పంచమధ్వని పలుకును గుఱ్ఱము హీ హీ అని సకిలించుటకు దానిని పోలిధైవతముండును. ఏనుగు ఘీంకారము నిషాదమును పోలును. ప్రకృతిలోని దేవతలు ఉద్యానవనములో మయూరాది రూపములు ధరించి గానములో ప్రపంచమునంతనుముంచి తన్మయము చేసివైచును.

హాస్య శృంగారయోః కార్యౌస్వరౌ మధ్యమ పంచమౌ
షడ్జర్షభౌతథాజ్ఞేయౌ వీరరౌద్రాద్భుతేషుచ
గాంధారశ్చ నిషాదశ్చ కర్తవ్యౌ కరుణేంసే
ధైవతశ్చాపి కర్తవ్యోభీభత్సే సభయానకే. బృహద్దేశి-మతంగముని

మపలు హాస్య శృంగారములందును, సరిలు వీరరౌద్రాద్భుతములందును, గనిలు కరుణము స,ధ భీభత్స భయానకములలో, కూర్పవలెను. ఆయా స్వరములు హెచ్చుగావాడినచో పైనిజెప్పిన రసములు వ్యక్తమగుననిభావము.

సరీవీరేఽద్భుతే రౌద్రే ధో భీభత్సే భయానకే
కార్యౌ గనీతు కరుణే హాస్య శృంగారయోర్మపౌ

వీరాద్భుత రౌద్రములందు సరి, ధ, భీభత్స భయానకములందు గనిలు కరుణమున మసలు హాస్య శృంగారములందు గూర్పవలెను. ఇది పై మతంగుని దానికనుసరణము. ఈనియమము నిపుడు ఎవరును పాటించినట్లు అగపడదు.

తే మంద్ర మధ్యతారాఖ్య స్థాన భేదా త్త్రిధామతాః
తఏవ వికృతా వస్థా ద్వాదశ ప్రతి పాదితాః

ఆ స్వరములు మంద్రము మధ్యమము తారము అని మూడువిధములు. అవే మరల వికృతావస్థ కలవై పన్నెండయ్యెను.

చ్యుతోఽచ్యుతో ద్విధాషడ్జో ద్విశ్రుతిర్వికృతో భవేత్
సాధారణే కాకలీత్వే నిషాదస్య దృశ్యతే.

షడ్జము (స) చ్యుతము అచ్యుతము అని రెండువిధములు. ద్విశ్రుతి గలది. నిషాదమునకు సాధారణ ధ్వనియందు కాకలి ధ్వనియందు వికృతమై కనిపించుచున్నది. సాధారణమైనపుడు చ్యుతము కాకలిగానున్నపుడు అచ్యుతముగాను ఉండును.

ప్రథమం శ్రవణాత్ శబ్దః శ్రూయతే హ్రస్వమాత్రకః
సాశ్రుతిః సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా

ఒకశబ్దము వినుచుండగా ఏ మొదటిభాగము వినఁబడుచున్నదో అదే శ్రుతిఅనబడును.

సాధారణే శ్రుతిం షాడ్జీమృషభః సంశ్రితోయదా
చతుశ్శ్రుతిత్వ మాయాతి తదైకో వికృతోభవేత్.

సాధారణములో ఋషభము (రి) షడ్జ శ్రుతిని ఆశ్రయించినచో చతుశ్శ్రుతిత్వమును పొందును. అప్పుడొక వికృతమగును.

సాధారణే త్రిశ్రుతిః స్యాదంతరత్వేచతుః శ్రుతిః
గాంధారఇతి తద్భేదాద్వౌనిశ్శంకేన కీర్తితౌ,

ఋషభము సాధారణముతో త్రిశ్రుతిని అంతరమందు చతుః శ్రుతిని పొందును. అది సాధారణము అంతర గాంధారమని రెండురకములగునని నిశ్శంకుడు చెప్పెను.

మధ్యమః షడ్జవద్ద్వేధాఽంతర సాధారణాశ్రయాత్
పంచమోమధ్యమ గ్రామేత్రిశ్రుతిః కైశికేపునః

మధ్యమస్య శ్రుతిం ప్రాప్య చతుః శ్రుతిరితిద్విధా
దైవతో మధ్యమగ్రామే వికృతం స్యాచ్చతుః శ్రుతిః

షడ్జమెట్లు ద్విశ్రుతిగలదై వికృతమై చ్యుతాచ్యుత భేదములచే భిన్నమై యుండునో అట్లే మధ్యమముగూడ నుండును. ఆమధ్యమము అంతర మధ్యమమని సాధారణ మధ్యమమని యగును. మధ్యమగ్రామములో పంచమము (ప) ద్విశ్రుతి గలదగును. కైశికమందైతే మధ్యమశ్రుతిని పొంది చతుఃశ్రుతి గలదగును. ఇట్లు రెండువిధములు. దైవతము (ధ) మధ్యమ గ్రామములో వికృతమై చతుః శ్రుతిగలదగును.

కైశికే కాకలిత్వేచ నిషాదస్త్రి చతుశ్శ్రుతిః
ప్రాప్నోతి వికృతౌ భేదౌ ద్వావితి ద్వాదశ స్మృతాః
తైః శుద్ధైః సప్తభిః సార్ధం భవం త్యేకోనవింశతిః

కైశికమందు [=కేశ-లేశ మాత్ర భేదమందు] కాకలిత్వమందు =కాకొంచెము కలి-మాధుర్యము గలది. త్రి చతుశ్శ్రుతి గలదగును. అవిరెండు వికృతి భేదములు గలవగును. ఆవే శుద్ధములైన యేడింటితో 19 భేదములగును. రసములు మిశ్రితములై రుచి భేదమును గలిగించినట్లు స్వరములు శుద్ధవికృతాది భేదములను పొంది రుచిభేదమును గలిగించును. స్వరములలో ఋషభము గాంధార ధైవత నిషాదముల దగ్గరనున్నది. కాని ఋషభగాంధారములు ధైవత నిషాదములు పరస్పర వివాదిస్వరములు. ఋషభగాంధారములను ధైవత నిషాదములను దగ్గఱగలిపి పలికినచో రక్తికి భంగమగును. కావున గాంధార మధ్యమములు కలిసి ఒక క్రొత్త స్వరము పుట్టెను. అదే అంతర గాంధారము. దానిస్వర స్థానము మధ్యమము యొక్క రెండవ శ్రుతి అనగా 11వ శ్రుతియగును. స్వరశ్రుతులు 9, 10, 11లు ఇట్లే ధైవత నిషాదములలో వివాదిత్వమును పరిహరించుటకై కాకలి స్వరము కలిగెను. కా. స్వల్పము, కలి-కలముగలది-మాధుర్యము గలది అని దాని వ్యుత్పత్తి. దీని స్వరస్థానము షడ్జములోని రెండవశ్రుతి. స్వరశ్రుతులు 21, 22లు 1, 2లును, ఇట్లే మిశ్రితస్వరములు సాధారణములును, వికృతములును అగును. దేశకాల భేదములనుబట్టి వికృత స్వరములు కలిగెను. కాకలి స్వరము క్రింది స్వరము

కైశికి. కాకలి, కైశికిస్వరములకు తేడా కేశ [లేశ] మాత్రమె కాన కైశికి అనబడెను. దాని స్వరస్థానము షడ్జపు మొదటిశ్రుతి. స్వరశ్రుతులు 21, 22 లు. ఇట్లే అంతర గాంధారమును క్రిందుగ పలికినచో సాధారణ గాంధార మగును. దాని స్వరస్థానము పదవశ్రుతి. స్వరగత శ్రుతులు 8, 9, 10 లో. షడ్జ స్వరమును క్రిందు చేసి పలుకగా చ్యుత షడ్జము అను ఒక వికృత స్వరము కలిగెను. ఇట్లే చ్యుత మధ్యమము కూడ మధ్యమమును క్రిందుగ చేసి పలికినచో నగును.

మధ్యమ గ్రామములోని పంచమ దైవతములు కాకలి కైశిక నిషాద ములు, అంతర సాధారణ గాంధారములు మొదటనే యుత్పన్నములైన వికృతస్వరములు. పిదప ఒక శ్రుతిని కలుపగా చతుఃశ్రుతి ఋషభము కలిగెను. ఋషభమును గాంధారములోని రెండు శ్రుతులనుకలుపగా పంచమ శ్రుతి ఋషభము కలిగెను. మధ్యములోని మొదటిశ్రుతిని గూడ కలుపగా షట్శ్రుతి ఋషభము కలిగెను. ఇట్లు దైవతములోఁ గూడ చతుశ్శ్రుతి దైవతము పంచమ శ్రుతిలో దైవతము గలిసి షట్శ్రుతి దైవతము గూడ కలి గెను. ఈ స్వరములు కర్నాటక హిందూస్థానీ సంప్రదాయములలో ఇప్పుడు కూడా కలుపబడుచుండెను. కాని పేర్లలో కర్నాటక సంప్రదాయములో స్వల్పముగాను హిందూస్థానీ సంప్రదాయములో ఎక్కువగాను భేదముకలిగెను.

| స్వరస్థానము శ్రుతి | | ప్రాచీననామము | కర్ణాటక సంప్రదాయకము | హిందుస్థానీ సంప్రదాయము |
|---|---|---|---|---|
| 1 | ని | కైశిక, సాధారణ | కైశికినిషాదము, | కోమలతర నిషాదము |
| 2 | | నిషాదము | షట్ఛ్రుతి దైవతము | కోమల నిషాదము |
| 3 | | కాకలినిషాదము చ్యుతషడ్జము | కాకలి నిషాదము | శుద్ధనిషాదము |
| 4 | స | షడ్జము (ప్రకృతి) | షడ్జము | షడ్జము |
| 5 | | | | |
| 6 | | | | |
| 7 | రి | ఋషభము ప్రకృతి | శుద్ధ ఋషభము | కోమల ఋషభము |
| 8 | | | చతుశ్శ్రుతిఋషభం | శుద్ధ ఋషభము |
| 9 | గ | గాంధారము (ప్రకృతి) | శుద్ధ గాంధారము | తీవ్రఋషభము, అతి కోమలతర గాంధారం |
| 10 | | సాధారణ | సాధారణగాంధారం, | |
| 11 | | గాంధారము | షట్ఛ్రుతి ఋషభము | కోమలతర గాంధారం |
| 12 | | అంతరగాంధారము చ్యుత మధ్యమము | అంతర గాంధారము అంతర గాంధారము | శుద్ధగాంధారము శుద్ధగాంధారము |
| 13 | మ | మధ్యమముప్రకృతి | శుద్ధమధ్యమము | శుద్ధమధ్యమము |
| 14 | | | | |
| 15 | | | | |
| 16 | | మధ్యమము గ్రామ పంచమము | ప్రతిమధ్యమము పంచమము | తీవ్రమధ్యమము పంచమము |
| 17 | ప | పంచమముప్రకృతి | | |
| 18 | | | | |
| 19 | | | | కోమల దైవతము |
| 20 | ధ | దైవతము ప్రకృతి | శుద్ధద చతుశ్శ్రుతి దైవతము | శుద్ధదైవతము |
| 21 | | | శుద్ధనిషాదము | |
| 22 | | నిషాదము ప్రకృతి | పంచమ శ్రుతి దైవతము | అతికోమలతర నిషాదము |

## గ్రామములు

గ్రామఃస్వర సమూహః స్యాన్మూర్ఛనాదేః సమాశ్రయః
తౌద్వౌధరాతలే తత్రసాత్ షడ్జ ఆదిమః

ఇండ్ల సమూహమును లోకములో గ్రామమని వ్యవహరించినట్లు స్వరముల సమూహమును గ్రామమని సంగీతజ్ఞులు వ్యవహరింతురు. అది మూర్ఛనాదులకు ఆశ్రయమగును. మూర్ఛనల సంగతి తర్వాత తెలుపబడును. ఆ గ్రామములు షడ్జ గ్రామమని మధ్యమ గ్రామమని గాంధార గ్రామమని మూడు విధములు. అందులో మొదటి రెండు గ్రామములు ఈ భూలోకమునం గలవు. అందు షడ్జ గ్రామము మొదటిది.

ద్వితీయో మధ్యమగ్రామ, స్తయోర్లక్షణముచ్యతే
షడ్జగ్రామః పంచమే స్వచతుర్థ శ్రుతి సంస్థితే.

రెండవది మధ్యమగ్రామము. ఆరెంటి లక్ష్యము చెప్పబడుచున్నది. తన (షడ్జగ్రామ) నాల్గవశ్రుతిలో కరుణా భేదములో ఆలాపినియందు మొదటి నుండి 17 వ జాతియందున్నపుడు షడ్జగ్రామమగును.

స్వోపాంత్య శ్రుతి సంస్థేఽస్మిన్ మధ్యమగ్రామ ఇష్యతే
యధ్వాధస్త్రి శ్శ్రుతిః షడ్జే మధ్యమేతు చతుశ్శ్రుతిః

మధ్యమము తన ఉపాంత్య శ్రుతియందున్న పంచమము దగ్గరున్న అనగా ఆయతా భేదమైన సందీపినిలో పదునారవ జాతిలోనున్నపుడు మధ్యమ గ్రామమగును. లేక ధ త్రి శ్రుతిగండై మధ్యమందు దైవతము చతుశ్శ్రుతి గలదై యుండును.

రిమయో శ్శ్రుతిమేకైకాంగాంధారశ్చేత్స మాశ్రితః
పశ్రుతి ధోనిషాదస్తు ధశ్రుతిం సశ్రుతిం శ్రితః
ప్రవర్తతే స్వర్గలోకే గ్రామోఽసౌన మహీతలే.

రిమలలో ఒక్కొక్క శ్రుతిని గాంధారము ఆశ్రయించినచో ధప శ్రుతిని నిషాదము ధశ్రుతిని సశ్రుతిని ఆశ్రయించినచో గాంధార గ్రామమగును. అది స్వర్గముననే గాని ఈ భూతలమున ప్రవర్తింపదు అని నారదుడనెను. సరిగమ

పధ అనునవి మూడేసి శ్రుతులను స నాలుగు శ్రుతులను పొందియుండగా స మ నిలో తక్క మిగిలిన రి గ పదలో తనునియత శ్రుతులనుండి తొలగి రి 7 శ్రుతినుండి 6 శ్రుతికి గ 9 నుండి 9 శ్రుతికి వచ్చి చేరినచో గాంధార గ్రామము భూలోకవాసులకు గానయోగ్యముకాదని స్వర్గమునకు పంపబడినట్లు తోచుచున్నదని కొందఱనిరి. కొందఱు గ ని లు తక్క మిగిలినవే తమ నియత శ్రుతినుండి తొలగినవని కొందఱు. షడ్జగ్రామమును హేమంతమున మధ్యమగ్రామమును గ్రీష్మమున గాంధారగ్రామమును వర్షాకాలమున పాడవలెనని అందురు. ఇదిఎవరును పాటించుటలేదు.

షడ్జగ్రామము — శుద్ధస్వర సహితము.

| స్వరములు | మూర్ఛనలపేర్లు | దేవతలు | పాఠాంతర దేవతలు |
|---|---|---|---|
| సరిగమ పదని | ఉత్తరమంద్ర | యక్షులు | బ్రహ్మ |
| నిసరిగమపధ | రజని | రక్కసులు | ఇంద్రుడు |
| ధనిసరిగమప | ఉత్తరాయత | నారదుడు | వాయువు |
| పదనిసరిగమ | శుద్ధషడ్జ | బ్రహ్మ | గంధర్వులు |
| మపదనిసరిగ | మత్సరికృత్తు | భవనాగులు | సింహము |
| గమపదసరి | అశ్వక్రాంత | అశ్వినులు | ద్రుహిణుడు |
| రిగమపదనిస | అభిరుగ్గత | పాశి | భానువు |

ఈ మూర్ఛనలు మంద్రతారములలో గాక మధ్యస్థాయినుండి ప్రారంభింపవలయును.

మధ్యమగ్రామము — వికృతస్వర సహితము

మధ్యమధ్యమమారభ్య, సౌవీరీ మూర్ఛనాభవేత్
షడ్జన్యాస్త దధోధస్థ స్వరానారభ్యతుక్రమాత్.

మధ్యస్థాయిలో మధ్యమమును మొదలుపెట్టి సౌవీరి మూర్ఛన అగును. మిగిలిన ఆరు క్రిందిస్వరములనుబట్టి చేయవలెను.

| స్వరములు | మూర్ఛనలు |
|---|---|
| మపదనిసరిగ | సౌవీరి |
| గమపదనిసరి | హరిణాశ్వ |
| రిగమపదనిస | కలోపనీత |
| సరిగమ పదని | శుద్ధమధ్య |
| నిసరిగ మపద | మార్గి |
| ధని సరిగమప | పౌరవి |
| పదని సరిగమ | హృష్యక. |

ఈ మూర్ఛనలు మంద్రతారములలో గాక మధ్యస్థాయినుండి సారింపవలయును.

గాంధార గ్రామము

| స్వ ర ము లు | మూర్ఛనల పేర్లు |
|---|---|
| గమ పదనిసరి | నంద |
| రిగమ పదనిస | విశాల |
| సరిగమ పదని | సుముఖ |
| నిసరిగమపద | విచిత్ర |
| ధని సరిగమప | సుఖ |
| మపదని సరిగ | ఆలాప |

ఇది భూతలములో లేదని నారదుడు

— స్వ ర ము లు —

చతుర్విధాః స్వరా, వాదీ సంవాదీ చ వివాద్యపి
అనువాదీచ; వాదితు ప్రయోగే బహుళస్వరః

ఆ స్వరములు వాది స్వరములు సంవాది స్వరములు వివాదిస్వరములు అనువాది స్వరములు అని నాలుగు విధములు. వాది స్వరములో ప్రయోగములు ఎక్కువగా నుండును.

### వా ది స్వ ర ము లు

సరిగమపదనిస-రిగమపదనిస-గమపదనిస-మపదనిస-పదనిస-ధనిస-నిస-స.

### సంవాది స్వరములు

శ్రుతయో ద్వాదశాష్టౌవా యయో రంతర గోచరాః
మిథః సంవాదినౌతౌస్తో-

సనిదపమగరిస - నిదపమగరిస - దపమగరిస - సమగరిస - సమగరిస-మగరిస - గరిస - రిస - స

### వి వా ది స్వ ర ము లు

నిగావన్యోన్య వివాదినౌ
రిధయోరేవ వాస్యాతాం, తౌ తయోర్వా రిధావపి

నిగలు పరస్వరము వివాదులు. రిధలు నిగలకు వివాదులు సమ్మగరి సరిగమ రిప్పమగరి రిగమప గద్దపమ గమపద మన్నిపద మపదని పస్సనిధ పదనిస

శేషాణా మనువాదిత్వం వాదీరాజాత్ర గీయతే
సంవాదీత్వను స్వారిత్వా, దస్యామాత్యోఽభిధీయతే

మిగిలినవి అనువాదులు ఇందు వాది స్వరము రాజని చెప్పబడుచున్నవి సంవాది స్వరము వాదిస్వరమును అనుసరించుచుండుటవల్ల ఇది మంత్రివంటి దని చెప్పబడుచున్నది. సరిగా - రిగమా - గమపా - మపదా - పదనీ-దనిసా సనిధా - నిధపా - దపమా - పమగా - మగరీ - గరిసా.

వివాదీ విపరీతత్వా ద్ధీరై రుక్తో రిపూపమః
నృపామాత్యానుసారిత్వాదనువాదీతు భృత్యవత్.

వివాదిస్వరము వాదిస్వరమునకు విపరీతముగా నుండుటవల్ల దానిని ధీరులు శత్రుస్వరమందురు. రాజును అమాత్యుని అనుసరించుటవల్ల అను వాది స్వరము వాది వివాదిస్వరములు సేవకునివంటివి.

## మూర్ఛన

క్రమాత్ స్వరాణాం సప్తానా మారోహశ్చావరోహణః
మూర్ఛనేత్యుచ్యతే గ్రామద్వయే తాఃసప్త సప్తచ.

క్రమముగా ఏడుస్వరములు ఆరోహణావరోహణలను మూర్ఛనలందురు. షడ్జ మధ్యమ గ్రామములు రెంటియందు అవి ఏడేసి ఏడేసి యుండును. మూర్ఛ్యతే-మోహ్యతే-శ్రోతా దేనిచే శ్రోత మోహపెట్టబడునో అది మూర్ఛన అని వ్యుత్పత్తి.

అది సప్తస్వర మూర్ఛన 1 పూర్ణ 2 షాడవ 3 ఔడవ 4 సాధారణ అని నాలుగు విధములు. ఏడు స్వరములు గలది పూర్ణ. ఆరేసి స్వరములు గలది షాడవ. అయిదేసి స్వరములుగలది ఔడవిత. కాకలి అంత స్వరములచే చేయబడినది సాధారణ.

మధ్యస్థానస్థ షడ్జేన, మూర్ఛనాఽరభ్యతేఽగ్రిమా
అథ స్తసై ర్నిషాదాద్యైః షడన్యా మూర్ఛనాః క్రమాత్

మధ్యస్థాయిలో నున్న స తో మొదలుపెట్టి మొదటి మూర్ఛన మొదలు పెట్టబడును. దానిక్రింది నిషాదములతో మిగిలిన ఆరుమూర్ఛనలు క్రమముగా చేయవలయును. శుద్ధమని వికృతమని గ్రామములు రెండు. శుద్ధమైనది షడ్జగ్రామము వికృతమైనది మధ్యమగ్రామము-

ఈమూర్ఛనలు 1. శుద్ధము 2. కాకలినిషాద సహితము 3. అంతర గాంధారసహితము 4. కాకలినిషాద అంతరంగాధార సహితము అని షడ్జ గ్రామములో నాలుగు విధములు కనుక స్వరములు 7×4=28 అగును. శుద్ధ వికృతభేదములచే రెండువిధములు 28×2=56 సప్తస్వరముల ఆరోహణమును బట్టి 56×7=392 అగును.

# వాది వివాది స్వరములు.

## కర్ణాటక సంప్రదాయము

| వాది | సంవాది |
|---|---|
| స 4 | శుద్ధమధ్యమము 13 పంచమము 17 |
| శుద్ధరి 7 | ప్రతిమధ్యమ 16 శుద్ధధైవతము 20 |
| చతురి 8 | ప 17 చతుశ్శ్రుతి ధైవతము 21 |
| పంచశ్రుతి. రి. 9 | పంచమశ్రుతి ధైవతము 22 |
| శుద్ధ గ. 9 | శుద్ధ ని 22 |
| సా. గ. 10 | కైశికి. ని. 1 |
| అనామి గ11 | కైశికి. ని. 2 |
| అంతర గ12 | చతు నిధ 21, కాకలి ని. 3 |
| శు. మ. 13 | శుద్ధని 22, షడ్జ 4 |
| ప్రి.మ. 16 | కా ని, 3 శు రి. 17 |
| ప. 17 | షడ్జ 4 చ రి 8. |
| శుద్ధ ధ. 20 | శుద్ధ. రి 7 |
| శుద్ధ. ధ. 21 | చ రి. 8 అంత గ. 12 |
| శుద్ధ. ని. 22 | శుద్ధ గ 9, శుద్ధ మ. 13 |
| కై. ని. 1 | సాధా. గ 10 |
| కాకలి. ని.3 | అంతర గ. 12 ప్ర. మ. 16 |

## తా న ము లు.

తానాః స్యుర్మూర్ఛనాః శుద్ధాః షాడ వౌడవితీకృతాః

షాడవములుగాను ఔడవములుగాను చేయబడిన శుద్ధమూర్ఛనము:లు తానములనఁబడును. తన్యంతే విస్తార్యంతే విస్తరింపఁ బడునవికాన తానము లని వ్యుత్పత్తి. షాడవములు – షట్ × అవయవములు స్వరములు కలవి. అనఁగా ఒకస్వరము లోపింపఁగా ఆరేసి స్వరములుగలవి షాడవములు. ఔడవములు, ఉడు–నక్షత్రములు వానిని అవ–రక్షించునది ఆకాశము. షడవము– ఆకాశము పంచభూతములలో ఆకాశము అయిదవది. ఆ ఆకాశమునకు సంబంధించినది అనగా రెండు స్వరములు లోపింపగా అయిదు స్వరములుగలది. రెండేసిస్వరములకు సంబంధించినవి ఔడవములు.

తన్యంతే విస్తార్యంతే ఇతి తానాః
షాడవౌడవ సంపూర్ణ భేదాద్రాగాః త్రిధామతః
ఔడవః పంచభిః ప్రోక్తః స్వరైః షడ్జస్తు షాడవః
సంపూర్ణః సప్తభిః జ్ఞేయః ఏవం రాగాస్త్రిధామతాః

షాడవములు షట్ (అవయవములు) ఆరుస్వరములు గలవి. ఏదో యొక స్వరము నియతముగ ఇందులో ఉండదు. ఇందు తానములు 28. స. రి. ప. ని లు లేనివి. ఇవి షడ్జగ్రామములోనివి. ఇంక మధ్యమ గ్రామములో ప రి గలు లేనివి ఇవి 21లో మొత్తము (28+21–49)49 ఔడవములు ఏవో రెండు స్వరములులేనివి. షడ్జగ్రామ మూర్ఛనలలో ద్విశ్రుతిగల సపలు రిపలు లేనివి ఏడు తగ్గగా 21 మధ్యమగ్రామ మూర్ఛనలలో రిధలు, ద్విశ్రుతిగలది 14. మొత్తము (2 +14–35) షడ్జగ్రామములోని 49లును మధ్యమ గ్రామములోని 35లు కలియఁగా (35+49, 84) 84 అగును.

అసంపూర్ణాశ్చ సంపూర్ణా వ్యుత్క్రమోచ్చారిత స్వరాః
మూర్ఛనాః కూటతానాః స్యుస్తత్సంఖ్యా మభిదధ్మహే
కూటత్వంచ వ్యుత్క్రమోచ్చారిత స్వరత్వరం
పూర్ణాః పంచ సహస్రాణి చత్వారింశ ద్యుతానితు
ఏకైకస్యాం మూర్ఛనాయాం కూటతానాః సహస్రకమైః

ఒక్కొక్క స్వరము తగ్గిన ఆరుతో గుణింపగా వచ్చినవి పూర్ణములు. ఒక్కొక్క మూర్ఛనలో క్రమములతో కూటతానములు 5040 84×6 504 ఇవి ప్రస్తరింపగా వచ్చినవి 5040 56 మూర్ఛనలలో పూర్ణల కూటములో కలిపినచో 504 ×56 – 282 40 అగును.

ఏకైకాంత్యాంత్య విరహాద్భేదాః షట్షట్ స్వరాదయః
ఏకస్వరోఽత్ర నిర్భేదో అప్యుక్తోనష్టాది సిద్ధయే
క్రమాశ్చకూటతానత్వేప్యుక్తాస్తే షూపయోగినః

ఒక్కొక్క మూర్ఛనయందు చివరి చివరిదిలేనిచో అనగా చివరి చివరి స్వరమును విడుచుటవలన ఆరు భేదములగును. ఇట్లే ఆరు స్వరాదులగును. ఎట్లన ఉత్తర మంద్రలో సరిగమ పదని అను ఏడు స్వరములు గల సంపూర్ణ క్రమములోని చివరిది [ని] విడువగా సరిగమపద అని ఆరు స్వరముల క్రమమొకటి యగును. పిదప సరిగమపద అను ఆరు స్వరములో చివరిది [ధ] విడువగా సరిగమప అని అయిదు స్వరములుగల క్రమమగును పిదప సరిగమప అను నైదు స్వరములుగల క్రమములోని చివరిది ప విడువగా సరిగమ అను నాలుగు స్వరములుగల క్రమము కలుగును. పిదప సరిగమ అను నాలుగు స్వరములుగల క్రమములోని చివరిది మ విడువగా సరిగ అను మూడు స్వరములుగల క్రమమగును. పిదప సరిగ అను మూడిటిలో చివరి గ విడువగా సరి అని రెండు స్వరములు గలదగును. సరి అను రెండింటిలో రి విడువగా స అని ఏక స్వరక్రమమగును. ఇట్లు ఆరు భేదములు. ఇది ఉత్తర మంద్ర అను ఒక మూర్ఛనలో ఆరు భేదములు గలిగెను. ఇట్లే రజని ఉత్తరాయత మొదలగు మూర్ఛనలలో ఒక్కొకటి విడువ ఆరేసి అగును. 6×6=36 మధ్యమములోని 2 భేదములచే 72 ఇవి మేళకర్తలుగానయ్యెను ఇట్లు వెంకటముఖియు చెప్పెను. స అనునది ఒకటే స్వరముగాన దానిలో ప్రస్తారము లేదు. కాన అది భేదరహితము నిర్భేదము. నష్టము ఉద్దిష్టము మొదలగు ప్రస్తారములు సిద్ధించుటకై కూట తానత్వము లేకున్నను క్రమములు చెప్పబడినవి. వ్యుత్క్రమము క్రమమునపేక్షించునది గాన అవి కూట తానములందు ఉపయోగించును.

చతుఃస్వరములలో న్యాదులు రెండు నాలుగువిధములు. ఇతర ములు 12. వీని క్రమములు రెండువిధములు. 16× -32 ఇట్లు ముప్పదిరెండు భేదములు. ఇవి 24చే గుణింపగా 24×32-ఇట్లు 768 చతుస్స్వరములగును

త్రిస్వరేషుతు మాద్యౌ ద్వావభేదౌ ద్వాదశాపరే
ద్విధాషడ్వింశతి రితిక్రమాస్తే షడ్భిరాహతాః
షట్పంచా శచ్ఛతం చస్యుః

త్రిస్వరములలో మాద్యములు 2 అభిన్నములు. ఇతరములు 12. అవి రెండువిధములు 2×12-ఇట్లు 24 అయినవి. అవి 2,×6చే గుణింపగా .44+12 156 అగును.

ద్విస్వరేషు పునర్ద్విధౌ

రిగధన్యాదయో అష్టౌస్యుః శుద్ధాః షడితరే క్రమాః
ద్వావింశతిస్తేతు చతుశ్చత్వారింశద్ద్వితాడితాః

రిగధని మొదలగునవి ఎనిమిది శుద్ధములు 6 ఇతరములు 22. వీనిని రెంటిచే గుణింపగా 22×2-44 అయినవి.

ఏక స్వరాస్త్వభేదత్వాన్మోలా ఏవచతుర్దశ. ఏకస్వరములైతే ప్రస్తార కృత భేదములులేక పోవుట వలన శుద్ధములే పదునాలుగే. ఆలోచింపగా నిగలు కాకల్యంతరావస్థను బొందుటచే మూర్ఛనలో భేదమున్నను ఆ యేక స్వరము లకు ఇతర స్వరములతో సంబంధములేకుండ దమలోని సూక్ష్మభేదములు కనిపింపవు గాన శుద్ధములైన కాకల్యంతరములకే గణన చేయబడుచున్నది. ఎప్పుడైతే షడ్జ గ్రామములో మధ్యమస్థానమందున్న షడ్జ స్థానమందే నిషాదాదు లను ఆరంభించుటచేత రజన్యాది మూర్ఛనలు అగునో-అట్లే మధ్యమగ్రామ మందు మధ్యమ స్థానమువందున్న మధ్యమమందే గాంధారాదులను ఆరంభిం చుటచే హరిణాశ్వాది మూర్ఛనలు అగునో-అపుడు గ్రామములందు భేదక పంచమము లేకపోయినను మూర్ఛనయందు ఉండుటవలన కూట తానముల పునరుక్తి యుండనే యుండదు. ఎప్పుడైతే గ్రామములందు మూర్ఛనలో

వాని క్రింది క్రింది స్వరములను ఆరంభించవలెనను పక్షముండునో అప్పుడైతే మధ్యగ్రామములోని శుద్ధమధ్య మార్గీ పౌరవీగతములైన తానములకు షడ్జ గ్రామములోని ఉత్తర మంద్రా రజ న్యుత్తరాయతా గతములయిన షడ్జ స్వరాది తానములతో వీలునుబట్టి స్థానభేదము లేకపోవుటవలన భేదకపంచమము లేకపోవుటచే పునరుక్తి గలుగునని నిశ్చయించి అందు శుద్ధములను ఆశ్రయించుటద్వారా యిదివరలో చెప్పబడిన షడ్జగ్రామములోని వానిని సంస్థాపనచేసి వానినిబట్టి పునరుక్తములయిన మధ్యమగ్రామములోని వానిని తొలగించుటకు వాని పరిగణనము చేయబడున్నది.

షడ్జాదేః శుద్ధమధ్యాయా భేదకం పంచకం వినా
చతుస్స్వరే క్రమాద్ద్వంద్వే అష్టాచత్వారింశదీరితాః

షడ్జాదియైన శుద్ధమధ్యకు భేదకమైన పంచమము లేకుండ చతుస్స్వరమందు క్రమముగా ద్వంద్వమందు ఇరువదినాలుగు తానములు గలుగును.

తానాస్త్రి స్వర యోస్త్వేతే ద్వాదశ. ద్విస్వరేద్వయం
ఏకఏవ స్వరస్తే త్రిషష్టి రౌత్తర మంద్రికైః

త్రిస్వరములందివి పన్నెండు, ద్విస్వరమందు రెండు ఏకస్వరమందు ఒకటి మొత్తము ఔత్తర మంద్రికముల చేత అరువదిమూడు.

పునరుక్తామతాస్తానై ర్వ్యాది మార్గీ క్రమాః పునః
పంచస్వరాయే చత్వార స్తత్తానానాం చతుశ్శతీ

అశీత్యధికములైన మార్గీక్రమములైతే తానములచే పునరుక్తములయియున్నవి. పంచస్వరములు గల నాలుగేవి గలవో వాని తానముల సంఖ్య నాలుగువందల ఎనభై.

ఛాతుస్స్వరీ షణ్ణవతిర్భవేత్
ద్వాదశద్వి స్వరద్వంద్వ చత్వారోద్విస్వరద్వయే
ఏక ఏకస్వరస్తా నాస్తే షాం పంచశతీత్రయం
త్రినవత్యాయుతాతానై రభిన్నారజనీగతైః

స్యుఃషాడవానాం వింశంత్యా సహస్తశతానితు
ఔడవానాంతు వింశత్యా సహితంశత మిష్యతే
చతుస్స్వరాణాం కూటానాం చతుర్వింశతిరితీరితాః
త్రిస్స్వరాః షడ్ద్విస్వరౌద్వావేక స్త్వే కస్వరోమతః

ఆరు స్వరములుగల షాడవ [షట్-ఆరు అవములు స్వరములుగలవి] ములలో 7 0. ఔడవములు అయిదుగలవి ఔడవములు. అనగా అయిదు స్వరములు గలవి. 120 ఉడు-నక్షత్రాలను అవ-రక్షించునది ఆకాశము. అది భూతాలలో అయిదవది కనుక అయిదు స్వరములు గలది. నాలుగుస్వరములు గల కూటములు 24 మూడు స్వరములుగలవి 6. రెండు స్వరముగలవి. రెండు. ఒక స్వరముగలది '. [చూ. ఖండమేరువులో మొదటివరుస.]

ఆర్చికోగాధికశ్చాథ సామికోఽధ స్వరాంతరః
ఏకస్వరాది తానానాం చతుర్ణామభిధాఇమాః

యజ్ఞ ప్రయోగములలో ఋక్కులు ఒకస్వరమును ఆశ్రయించుటవలన తత్సంబంధమువల్ల ఆర్చికమయ్యెను. అట్లే గాధనుబట్టి గాధికము, సామల సంబంధమునుబట్టి సామికము అయ్యెను. సామలు సప్తస్వరములు గలవయ్యెను. మంద్ర మధ్య తార స్థానత్రయమునుబట్టి త్రిస్వరత్వము వానికి సిద్ధించును నాలుగు స్వరములు గల తానము ఏకస్వరాది సప్తవిధ స్వరముల మధ్యనుండుటవలన స్వరాంతరమని పేరు.

ఉక్తశుద్ధాది భేదేన నిగయుక్తాశ్చతుర్విధాః
తయోరేకైక హీనాశ్చద్వేధా మూలక్రమామతాః

పైని చెప్పిన శుద్ధము కాకలి నిషాదము అంతరగాంధారముల భేదములచే నిగలతోఁ గూడిన చతుర్విధ స్వరములుండును. వానిలో ఒక్కొక్కటి తగ్గి మూలక్రమము ద్వివిధములై యుండును.

షడ్జాద్యౌ మధ్యమాద్యౌ చ చత్వారః స్యుర్ద్విధాద్విధా
చతుర్థాఽన్యేఽదశేత్యష్టా చత్వారింశ దమీక్రమాః

షడ్జగ్రామములోని ఉత్తర మంద్రక్రమముగలది షడ్జాద్యము మధ్యమ గ్రామములో శుద్ధమధ్యకు సంబంధించినది షడ్జాద్యము. ఇవి రెండు షడ్జాద్యములు. మధ్యమ గ్రామములోని సౌవీరికి సంబంధించినది మధ్యమాద్యము. షడ్జ గ్రామములో మాత్సరీ కృతక్రమము మధ్యమాద్యము. ఇవి రెండు మధ్యమాద్యములు మొత్తము నాలుగు, ఇవి నిగలలో ఒక్కొకటి హీనమగుటవల్ల ప్రత్యేకముగా రెండువిధములగును. 2×2×2-8 ఇతరముల పదినిగలు కూడినవిగనుక నాలుగు విధములు ఇతరములు పది. 4×10-40 ఈక్రమములు 8+0-48 నలభై యెనిమిది.

సవింశతిః సప్తశతీ ప్రాగుక్తా గుణితాక్రమైః
చతుస్త్రింశతి సహస్రాణి షష్ట్యా పంచశతానిచ
ఇతిషాడవ సంఖ్యాస్యా దథపంచస్వరాన్ బ్రువే.

ఇదివరలో చెప్పబడిన 720 యనుక్రమములు 48చే గుణింపబడి 48×720-34560 లు షాడవసంఖ్య అగును. ఇంక పంచస్వరములను చెప్పెదుము.

గాద్యౌ ధాద్యౌ నిషాదాద్యౌ చతుర్భేదాః షడౌడవాః
అష్టావన్యే ద్విధేత్యేవం చత్వారింశదిమేక్రమాః
స వింశతౌ శతేత్రైశ్చ గుణీత్యేష్టౌ శతానితు
చత్వారిచ సహస్రాణి సంఖ్యాపంచస్వరేష్వితి

గాద్యములు ధాద్యములు నిషాదాద్యములు నాలుగు భేదములు గలవి. షాడవౌడవములు ఎనిమిది 4×8=32 ఇతరములు 2×4=8 రెండువిధములు ఇట్లు ఈక్రమము 32+8-40. ఈనలుబదిచే 120 గుణింపగా 120×40-4800 అగును. ఇది పంచస్వరములలోని సంఖ్య.

చతుస్స్వరేషు న్యాది ద్వ్యాచతుర్థాద్యాదశాపరే
క్రమాద్విధేతి ద్వాత్రింశచ్చతుర్వింశతి తాడితాః
శతానిసప్తాష్ట షష్ట్యా స్యాచ్చతుఃస్వర సంమితిః

నాలుగు స్వరములు గలవి. తొంబదియారు. రెండుస్వరములుగల ద్వంద్వములు వంద్రెండు. ద్విస్వరద్వయమందు నాలుగు ఏకస్వరము ఒకటి ఇట్లు రజనీ గత తానములచే అయిదువందల తొంబయిమూడు.

ధైవతాదేస్తు పౌరవ్యాశ్చత్వారః షట్స్వరాః క్రమాత్
తత్తానానాం తు సాశీతిః శతాష్టా వింశతిర్మతా

ధైవతము ఆదియందు పౌరవిలోని నాలుగు క్రమముగా ఆరు స్వరములు గలవి, వాని తానములు ఎనభైతో గూడిన నూటఇరవై ఎనిమిది. 180+ 128-208.

ఔడువానాం చతుర్ణాం ప్రాగుక్తా సంఖ్యాచతుః స్వరౌ
త్రిస్వరౌ ద్విసరా వేకస్వరః ప్రాగుక్త సఖ్యకాః
పంచవింశతి సంయుక్తా చతుస్త్రింశతీ త్వియం
తానానాం సదృశాకారాఃస్యాత్తా నైరౌత్త రాయుకైః

ఔడువముల నాలుగింటి సంఖ్య ఇదివరకుఁ జెప్పబడినది. చతుస్వరములు రెండు త్రిస్వరములు రెండు ద్విస్వరములు రెండు. ఒకస్వరము ఏకస్వరము. ఇవన్నీ ఇదివరకుఁ జెప్పబడిన సంఖ్యగలవి. ఇరవై ఆరుతో గూడిన ముప్పదినాలుగు 26+34-60 ఔత్తరాయత తానములతో గూడినవి.

ఇత్యే కాశీతి సంయుక్తం సహస్రాణాం చతుష్టయం
తానానాం పునరుక్తానాం పూర్ణాపూర్ణైః స హక్రమైః

ఇట్లు నాలుగువేల ఎనభై యొకటి పూర్ణక్రమములు అపూర్ణక్రమములతో గూడిన పునరుక్తతానముల సంఖ్యయగును.

పూర్ణములు=392. అపూర్ణములు=182.39 + 82=574. వీనితోగూడిన పునరుక్త తానములు 4081 (574+084=46.5) 22.562=4655=317927

అసనీయేత చేదేషాంకూట తానమితి ర్భవేత్
లక్షత్రయం స ఉదశ సహస్రాణీ శతానిచ
నవత్రింశత్యు తానీతి జ్ఞానోపాయోత్రకథ్యత్,

322582లో నుండి 4655 తీసి వేయఁగా 317930. ఏకస్వరతానములలో పదునాల్గింటిలో శుద్ధ మధ్యా, మార్గీ, పౌరవీగతములైన ఏకస్వరముల తానములలో ఏకస్వర తానములు పునరుక్తములైనవిగాన ఆ మూడు తీసివేయఁగా పదునొకండు అగును. వీనిలో క్రమము లేకున్నను కూటతానము కాకపోవుట వలన తీసివేయఁదగినట్లు శ్లోకములో చెప్పబడెను. మూడును అందు కలుపఁబడలేదు. కాన ఆమూడు కలిపినచో 0 సంఖ్య సరిపడును. అట్లైనచో శుద్ధ మధ్యాదులయిన ద్విస్వరాదులయిన ఏకత్రింశత్క్రమములయిన పునరుక్త తానములుగా తీసివేయఁబడిన వానియందె వానికిగూడ క్రమరాశిలో ప్రవేశము లేకపోవుటవలన ఏకషష్టియుతములని పఠింపవలసియున్నవి అన్నచో నిజమె ఇక్కడ దీనికి జవాబు చెప్పబడుచున్నది. పునరుక్త తానములుగా తీసివేయఁబడిన అవి క్రమముగా నుండుట సంభవింపకపోవుటవలన క్రమరాశియందు ప్రవేశింపని వానికి క్రమత్వ ప్రయుక్తితోఁ గూడఁ దిరిగి తీసికొనుట ఆకార ద్వయము వశమువలన బృహస్పతి సవనాను ష్ఠానమువలె ఉపపన్నమగును. ఎట్లు ఒకటే యైన బృహస్పతి సవము యజ్ఞాంగముగా ప్రాధాన్యముగా అనుష్ఠేయమై లోకమున నున్నదో ఎట్లు ఒకడే దేవదత్తుఁడు పాఠక పాచకాద్యుపాధిభేదములనుబట్టి భేదముగా పరిగణింప బడుచున్నాడో కార్యాంతరాన్వయము చేయబడుచున్నదో అట్లేమూడు ఏకస్వరములకు అను క్రమత్వము లేకపోవుట వలన ఆకార ద్వయము సంభవించుటవలన తీసివేయఁదగి యుండుట మాత్రముచే నురాదు. ద్విస్వరాదులయిన ఏకత్రింశత్తానములకు ఆకారద్వయము సంభవించుటవలన నైతే స్వీకరింపక పోవుటయె. లేనిచో దోషముకలుగును. అని తలచి త్రింశద్యుతాని అని నిశ్శంక శార్ఙ్గదేవుడు చక్కగా చెప్పెను. శ్రీకల్లినాథుడు క్రమ కూటతాన సంఖ్యా విరోధమును పోగొట్టెను.

అంకానేకాది సప్తాన్ తానూర్ధ్వ మూర్ధ్వంలిఖేత్క్రమాత్
హతే పూర్వేణ పూర్వేణ తేషుచాంకే పరేపరే

ఒకటి మొదలుకొని ఆ సప్తస్వరముల యంకములను క్రమముగా పైపైకి వ్రాయవలెను. పూర్వపూర్వ స్వరముచే గుణింపగా వానియందు అంకములు తర్వాత తర్వాత స్వరములో ప్రతిమూర్ఛనయందు క్రమముగా ఏకస్వరాది సంఖ్య కలుగును. అనఁగా మొదటి మొదట యేకాంకముచే

తరువాత ద్వ్యంకము గుణింపగా ద్విసంఖ్య వచ్చును. పిదప వచ్చిన ద్విసంఖ్యాకమైనదానిని ముందుంచి తరువాత అంకమును గుణింపగా 2×3–6 షట్సంఖ్య వచ్చును. అషట్సంఖ్య తరువాత నాలుగంకము గుణింపగా 6×4–24 ఇరువదినాల్గవ సంఖ్యకలుగును. దానిచే పంచాంకము గుణింపగా 24×5–120 సంఖ్యవచ్చును. దానిచే షడంకము గుణింపగా 120×6–720 సంఖ్యవచ్చును. దానిచే తరువాత సప్తాంకము గుణింపబడగా 720×7 - 5040 సంఖ్యవచ్చును. ఇట్లు గుణింపవలెను. ఇట్లు చేయుగా ప్రతి మూర్ఛనలో క్రమముగా ఏకస్వరాది తానసంఖ్య కలుగును.

క్రమంన్యస్య స్వరః స్థాప్యః పూర్వః పూర్వః పరాధదః
స చే దుపరి తత్పూర్వః పురస్తా పరివర్తినః
మూల క్రమక్రమాత్పృష్ఠే శేషాః ప్రస్తార ఈదృశః

560 సంఖ్యగా పరిగణింపఁబడిన పూర్ణా పూర్ణాక్రమములందు ఏదోయొక దానిని ఉంచి పూర్వపూర్వ స్వరమును ప్రస్తారము చివర తరువాత ఋషభము కంటె క్రింద ఉంచవలయును. అది పైనుండగా దానికిముందు నపేక్షించి ఆపంక్తియందు క్రమముగా వ్రాయుదగిన చోట పై చేతి కుడిపై పున పై యంత్రమున నున్నవి ఉంచవలెను. అనఁగా షడ్జము తరువాత గమ లను ఉంచవలెను మూల క్రమక్రమము కంటె వెనుక ప్రథమ మధ్యమందు వ్రాయబడిన దానికై చేతికి ఎడమ పై పున మిగిలినవి వ్రాయువలయును. ప్రస్తారము ఇట్లుండును. ఉత్తర మంద్రలో క్రమముగా షడ్జస్వరాదులు ఏడు. అందు షడ్జాద్యము మూలక్రమము దానిలో స్వరముల క్రమము వ్యవహితముగాఁ గాని అవ్యవహితముగాఁ గాని యుండవలెను. ఇట్లుకాగా రిసగమ అని మొదట కూట తానము ప్రస్తారములో నిష్పన్నమగుచున్నది. మఱి యాతానములో ఆలోచింపగా ఋషభనుకంటె షడ్జము పూర్వముది. అయినను అది పైనున్నచో అనగా ఆపంక్తి యుందె పైని ఉన్నచో అపై దానికంటె ముందు ఉంచవలయును. అన్నచోట పైనున్న షడ్జముకంటె ఈ క్రమములో పూర్వమందుండక పోవుటవలన ఋషభ షడ్జములకంటె క్రిందఉం

చుట వీలుకాదు. గాంధారము క్రింద మూలక్రమము నపేక్షించి ఈ క్రమ ములో ఋషభము ముందుదికాన ఋషభషడ్జములకు క్రింద ఉంచవలెను. గాంధారముకంటె క్రింద మూలక్రమము నపేక్షించి ఋషభము ముందుదిగాన దానికి పైనుండక పోవుటవలనను ఋషభమునుంచవలెను. ముందు అంటె పైనున్నదానికి అనగా ఋషభము తరువాత మధ్యము ఉంచవలెను. మూల క్రమముకంటె వెనుక షడ్జగాంధారము లుంచవలెను. అపుడు సరిగమ అని రెండవ కూట తానగును ఇట్లు మూలక్రమావరోహణవరకు ప్రస్తరింపగా తత్తత్క్రమోక్త సంఖ్యగల కూటతానములు కలుగును.

అంక ఖండ మేరువు

సప్తాద్యేకాంత కోష్ఠానామధ్యోధః సప్తపంక్తయః
తాస్వాద్యాయామాద్యకోష్ఠే లిఖేదేకం పరేషుఖం

ఏడుస్వరములు మొదలగాగల ఏకాంతకోష్ఠములు వ్రాసి క్రింద ఏడేడు పంక్తులు గీసి వానిలో మొదటిదానిలో ఒకఅంకెవేసి మిగతావి శూన్యములుగా చేయువలెను.

వేద్యతాన్ స్వమితానన్యస్త్వేత్తాషేవ లోష్ఠకాన్,

నష్టముగాఁ గాని ఉద్దిష్టముగాఁ గాని తెలియఁదగిన దాని తానమున కున్న స్వరములతో పరిణామముగలవాని నుంచవలయును. వానియందె కదపుటకు వీలయిన ద్రవ్యములనుంచ వలయును.

ప్రాక్పంక్త్యంత్యాంక సంయోగమూర్ధ్వాధః స్థితపంక్తికే
శూన్యాదధో లిఖేదేకంతం చాంధోధః స్వకోష్ఠకాత్.
కోష్ఠ సఖ్యాగుణం న్యస్యేత్ ఖండమేరు రయంమతః

మొదటి పంక్తికిగాని మొదటి రెండు పంక్తులకుఁగాని మొదటి పంక్తు లకుగాని చివరనున్న అంకెతోకలిపి పైని క్రిందనున్న పంక్తులందు శూన్యము కంటె క్రింద వ్రాయనలెను. ఒక క్రింద క్రింద తనగడి క్రింద గడి అంకతో యంకె గుణించి వ్రాయవలెను. ఇట్లుకాఁగా ఖండమేరువగును,

## ఖండమేరువు

| స | రి | గ | మ | ప | ద | ని |
|---|---|---|---|---|---|---|
| 1 | 0 | 0 | 0 | 0 | 0 | 0 |
| | 1 | 2 | 6 | 24 | 120 | 720 |
| | | 4 | 12 | 48 | 240 | 1440 |
| | | | 18 | 72 | 360 | 2160 |
| | | | | 96 | 480 | 2880 |
| | | | | | 600 | 3600 |
| | | | | | | 4320 |

స్వరాన్మూలక్రమ స్యాంత్యాత్ పూర్వం యావతిథఃస్వరః
ఉద్దిష్టాం త్యస్తావతిథే కోష్ఠేఽధోలోష్ఠకం క్షిపేత్.

ఇది ఎన్నవది అని అడిగినపుడు చెప్పునది ఉద్దిష్టము. ఉద్దిష్టమను పేరు గల తానము ఉద్దిష్టాంత్య స్వరము మూలక్రమమునకు మూర్ఛనా స్వరము నారంభించి ప్రవృత్తమైన దానికి, ఉత్తర మంద్రయందు సరిగమ అని చతుస్స్వర క్రమము ఉండుటవల్ల చెప్పబడుచున్నది. అంత్యాంత్య స్వర మధ్యమమునుండి పూర్వము వెనుకగా మగసరి అని ఉద్దిష్టమైన తానము యొక్క చివరి ఋషభము ఎన్నవదని విచారింపగా మూడవదియగును. క్రింద అన్నవ మూడవ కోష్ఠమున పంద్రెండు అంకముచే అంకితమైన దానియందు. అర్థము—మూలక్రమమున చివరి స్వరముకంటె పూర్వము ఎన్నవస్వరము గలదో అన్నవకోష్ఠమందు-ఉద్దిష్టాంత్యమును క్రింద లోష్టకమును జిమ్మవలెను.

లోష్ఠ చాలన మంత్యాత్ స్యాత్త్యక్త్వాలబ్ధం క్రమోభవేత్
లోష్ఠాక్రాంతాంక సంయోగాదుద్దిష్ట మితిర్భవేత్

లోష్ఠ చాలనము చివరి స్వరమునుండి యగును. లబ్ధమును వదలి క్రమము అగును. లోష్ఠముచే ఆక్రమింపబడిన అంకెతో సంయోగము వల్ల ఉద్దిష్టముయొక్క మానము అగును. నియమముగా క్రింది క్రింది పంక్తి యందు నాల్గవ పంక్తిలో బిందు కోష్ఠమందలి లోష్ఠకమును చిమ్మవలెను. పిమ్మట లబ్ధమైన కోష్ఠమందలి యంకమును ప్రాపకముగా చరితార్థమైన ఋషభమును వదలి క్రమమగును. స్వరములలో సగమ అని క్రమమగును. అష్టమ ఉద్దిష్టములో గూడ లబ్ధమును వదలుటవలన మగస అని ఉద్దిష్టమగును. మరియు గూడ ఉద్దిష్టము చివరి షడ్జము పూర్వోక్తరీతిచే తృతీయముగనుక దానితో తృతీయపంక్తి బిందువు నందున్న లోష్ఠకమును కింద మూడవదాని యందు నాల్గవ యంకెగ దానిలో చిమ్మవలెను. అపుడు షడ్జము లబ్ధము కాంగా దానినిగూడ విడిచినచో గమ అని యుద్దిష్టముకూడ అగును. మరి యును ఉద్దిష్టము చివరి గాంధారము చెప్పినరీతిగా ద్వితీయమగుట వల్ల ద్వితీయపంక్తి బిందువు నందున్న లోష్టకమును క్రిందనున్న ఒక అంకెగల రెండవ కోష్ఠకమున చిమ్మవలెను. పిదప మూలక్రమములో మిగిలిన మధ్యమము ఒకటగుటవలన మొదట పంక్తిక్రింద కోష్టము లేకపోవుట వలనను మౌలికాంకమందున్న లోష్ఠము చలింపదు. ఎక్కడైతే మూలక్రమ ఉద్దిష్ట తానమందును స్వరములకు అంత్యమగుటలో సామ్యమున్నదో అక్కడగూడ లోష్టచాలనముండదు. ఇట్లోక లోష్ఠకముచే ఆక్రమింపబడిన అంకెతో సంయోగమువల్ల ఉద్దిష్టముయొక్క మానము అగును. కాన మగసరి అనుదానికి అష్టాదశత్వము ప్రమితమగును. ఇట్లు అన్ని తానములందును గ్రహింప వలెను.

యైరంకైర్నష్ట సంఖ్యా స్యాన్మౌలైకాంకసమన్వితైః
తేషులోష్టం క్షిపేన్మూలంలోష్టస్థాన మితంభవేత్.
నష్టతాన స్వరస్థానం తతోయావతిథేపదే
అధః క్రమాదస్తి లోష్ఠః స్వరస్తావతిథోభవేత్.
క్రమాంతిమ స్వరాత్ పూర్వాత్ లబ్ధత్యాగాది పూర్వకః

మూలాంకములతోఁ గూడిన ఏయంకెలచేత నష్టసంఖ్య కలుగునో వాని యందు లోష్టమును చిమ్మవలెను. అపుడు లోష్ట స్థానమితమై యగును.

తానస్వరస్థానము-తరువాత-ఎన్నవపదమందు-క్రింది క్రమముకంటె క్రింద స్థానమందలి స్వరము అన్నది అగును. పూర్వమందున్న క్రమాంతిమ స్వరముకంటె ఆద్యస్వరాదులలో పూర్వమువలెనె అగును. ఇన్నవది అని సంఖ్యా విశేషమును చెప్పి అది ఎట్టిది స్వరూపమును గురించి అడిగినపుడు ప్రతీయ మానరూపము గలది గాని నిది నష్టమనబడును. నష్టసంఖ్య-నష్టతానసంఖ్య ప్రస్తారమందలి చతుఃస్వర క్రమమందయితే తానము పద్దెనిమిదవది అని చెప్పి మూలము అనగా ఆద్యకోష్ఠమునందున్న దన్నమాట వేర్వేరు పంక్తుల యందలి కోష్ఠము నందున్న యే యంకెలతో-చతుర్థ పంక్తిలో పన్నెండవ యంకెతో, మూడవపంక్తిలో నాల్గవ యంకెలతో, రెండవపంక్తిలో ఒక యంకెతో వీని తోడ కల్పిన యంకెతో-పద్దెనిమిది సంఖ్యవచ్చును. ఆయంకెలతో కోష్ఠమును తిప్పవలెను. నష్ట తాన స్వరస్థానము అంటే నష్ట తాన స్వరమును పొందించు స్థానము, చాలిత కోష్టముచే ఆక్రమింపబడిన కోష్టమన్నమాట. మూలములో అనగా ఆద్యముగానున్న మొదటి పంక్తియందు కోష్ఠస్థానముతో బిందుకోష్ఠ ముతోకూడ మితము-పరిగణితమగును. అట్లుగానిచో స్వకోష్ఠముకంటె కోష్ట సంఖ్యాధికమన్నచోట చెప్పబడిన నియమము ఇక్కడకూడను పట్టును-ప్రకృత మగు పద్దెనిమిదవ తానమున అంత్యకోష్టము మూడవకోష్ఠమం దుండుట వలన క్రమాంతిక స్వరముకంటె పూర్వము మూడవఋషభము నష్టతానాంతి మముగా లభించుచున్నది. వెనుకటివలె ఉద్దిష్టములో జెప్పబడినట్లు చేయు వలెను అట్లుచేయగా ఋషభమును వదలి సగమ అని క్రమము అగును. దాని దగ్గఱి కోష్ఠము మూడవ కోష్టమునందుండుటవల్ల క్రమాంతికమగుట వలన పూర్వము మూడవది షడ్జము నష్టోపాంత్యముగా లభ్యమగుచున్నది. తరువాతకూడ గమ అని క్రమ ద్వితీయ కోష్టము ద్వితీయకోష్టమందుండుట వల్ల క్రమాంతిమము ద్వితీయము గాంధారము నష్టద్వితీయముగా లభ్యమగు చున్నది. పిదప పరిశేషన్యాయము వలన మధ్యమము తార పూరకముగా నష్టాదిమముగా లభ్యమగుచున్నది. అపుడు మగరి అని నష్టతానరూపమగును. మఱి యెక్కడైతే చివరగాని మధ్యగాని కోష్ట చాలనము ఉండదో అక్కడ క్కడ మూలక్రమాంత్యాది స్వరము నష్టమైనను అటువంటిదే లభ్యమగునని తెలియదగ్గది.

తానస్వరమితోర్థ్వాధః పంక్తిగాత్యాంక మిశ్రణాత్
ఏకస్వరాది తానానాం సంఖ్యా సంజాయతే క్రమాత్

ఏకస్వరాదులలో నేదోయొక స్వరములోనున్న అన్ని స్వరములతో తత్సంఖ్యతోఁ గూడినవి తత్రక్రమ సంఖ్యలు. మిశ్రణాంతము ఏకస్వరాది తానముల సంఖ్యవచ్చును. ఒకస్వరమునకు ఒకటి. ద్విస్వరమునకు రెండు, త్రిస్వరమునకు ఆరు, చతుస్స్వరమునకు 24 ఇట్లు సంఖ్యవచ్చును.

సాధారణము– 1 స్వర సాధారణము 2 జాతిసాధారణము అని రెండు విధములు. స్వరసాధారణము 1 కాకలి సాధారణము 2 అంతర సాధారణము షడ్జసాధారణము 4 మధ్యమసాధారణము అని నాలుగువిధములు.

## వర్ణములు.

గానక్రియోచ్యతే వర్ణః సచతుర్ధా నిరూపితః
స్థాయ్యారోహ్య హరో హేచసంచారీత్యథలక్షణం

గానక్రియవర్ణమని చెప్పబడుచున్నది. కర్ణాటక సంగీతములో వర్ణము లనివేఱుగా వ్యవహరింపబడినది. 1 స్థాయి. 2 ఆరోహి 3 అవరోహి 4 సంచారి అని నాల్గువిధములు మఱింక లక్షణం చెప్పబడును.

## మంద్రాదిస్వర చిహ్నములు.

స్థిత్వా స్థిత్వాప్రయోగః స్యాదేకస్యైవ స్వరస్యయః
స్థాయీకర్ణఃసవిజ్ఞేయః పరావన్వర్థనామకౌ
ఏతత్సంమిశ్రణాద్వర్ణః సంచారీ పరికీర్తితః

ఒకస్వర్ణమును ఆపి ఆపి ప్రయోగించునది స్థాయివర్ణమనబడును. ఇతర ములు సార్థక మైనపేరుగలవి.

విశిష్టవర్ణ సందర్భమలంకార ప్రచక్షతే
విశేషముగల వర్ణములుగల సందర్భమును అలంకారమందురు.

## మంద్రాది స్వరచిహ్నములు

మంద్రోబిందు శిరాభవేత్,

ఊర్ధ్వరేఖా శిరాస్తారో లిపౌత్రిర్వచనాత్ప్లుతః

బిందువుపైనున్నది మంద్రము. పైకిగీత యున్నది తారము. వ్రాతలో 3 అంకెవేసినచో ప్లుతము.

ప్రసన్నము=మంద్రము

## అలంకార స్వరములు.

0 0 1
1. సా సా సా ప్రసన్నాది (ప్రసన్నమైన ఆదిస్వరముగలది)

1 1 0
2. సా సా సా ప్రసన్నాంతము (చివరిస్వరము ప్రసన్నముగ గలది.)

0 1 0
3. సా సా సా ప్రసన్నాద్యంతము (మొదటవి చివరి ప్రసన్నములు గలవి.)

1 0 1
4. సా సా సా ప్రసన్నమధ్యము (మధ్యస్వరము ప్రసన్నముగ గలది.)

0 0 0 0 0 0
5. సారి సా సాగమ సా– సపదని సా–(క్రమరేచితము.)

0 1 0 1 0 1
6. సరి సా– సగమ సా–సపదనీ సా–దీప్తము

1 0 1 0 0
7. సారి సా– సాగమ పా–సాపదనిస సా [ప్రసాదము]

ఇవి స్థాయి గతాలంకారములు.

—o—

ఆరోహిస్వరములు–అవరోహిస్వరము–స్వరనామము

| | | | |
|---|---|---|---|
| 1. | సారిగామాపాదానీసా | సానీదాపామాగారీసా | విస్తీర్ణము |
| | సస రిరి గగ మమ | సస నిని దద పప | నిష్కర్షము |
| | పప దద నిని స | మమ గగ రిరి సస | |

2. ససని-రిరిరి-గగగ-మమమ-పవప-సనస నినిని దదద పపప | గాత్ర
దదద-నినిని-సనస పమమ-గగగ-రిరిరి-సస | వర్ణము.

3. సససస రిరిరిరి గగగగ మమమ సససస నినినిని దదదద గాత్రవర్ణం
పపపప దదదద నినినిని సససస సనస మమమ గగగ రిరిరి ససస

4. సాసారి-గాగాగామ-పాపాపాద-నినినిస-సాసాదపాపామ-
గాగాగారిసనస బిందువు

5. సగ ప ని స ద మ రి - అభ్యుచ్ఛయము=దాటు

6. సారీరీ గాగాగా మామామామా | సానీసా దాదాదా
మామా పాపాపాపాపా- | పాపాపాపా దాదాదా హసితము
పాపాపాపాపా-దాదాదాదాదాదా-నీనినీనినీనీనీసా
పాపాపాపా-దాదాదాదా

7. సరి రిగ గమ మప పద దని నిస-ఆరోహిస్వరములు ప్రేంఖితములేక
క్రమము.
సని నిద దప పమ మగ గరి రిస-అవరోహిస్వరములు

8. సగ గప పనిస (దాటుతో) ఆరోహి స్వరములు ఆక్షిప్తము
సద దగ గస [దాటుతో] అవరోహి స్వరములు.

9. సరిగ గమప పదని దనిస సంధిప్రచ్ఛ— అవరోహి
సనిద నిదప దపమ పగరి గరిస చ్ఛాదనము అవరోహిస్వరము

10. సస సరిగా మమమ పదా నిని నిసనీ దద దమగా రిరి ససా ఉద్గీతము

11. సరి రిగా మప పదా నిస సని దప పమా గరి రిసా. ద్వాహితము

12. సరిగ గగా మపద దదా నిసని నినీ దప మమ మా గరి ససా త్రివర్ణము

13. సనస రిరిరి గగగ మమమ పపప దదద నినిని సనస పృథగ్వేణీ
నినిని దదద పపప మమమ గగగ రిరిరి ససస

— o —

సంచార్యలంకార స్వరములు.

1. సగరీ-రిమగా-గపమా-మదపా-పనిధా మంద్రాదిమము

2. గసరీ-మరిగా-పగమా-దమపా-నిపదా మంద్రమధ్యమము

3. రిగసా-గమరి మపగా-పదమా-దనిపా మంద్రాంతము

4. సగా-రిమా-గపా-మదా-పనీ ప్రస్తారము

5. సరిసా-రిగరీ-గమగా-మపమా-పదపా-దనిధా ప్రసాదము

6. సాగరిమాసా-రీమగపారీ-గాపమధాగా-మాపాదనీమా వ్యావృత్తము

7. సగరిమా-మరిగాసా-రీగమగాప-పగమారీ-
గాపమదా-దమపాగా-మాదపనీ-నిపదామా స్ఖలితము

8. సగమా-రిమపా-గపదా-మదనీ పరివర్తకము

9. సరిగా-రిగమా-గమపా-మపదా-పదనీ ఆక్షేపము

10. సాసాసాసరిసా-రీరీరీగరీ-గాగాగామగా-మామామాపమా-
దాదాదానిదా బిందువు

11. సరిగరీ-రిగమగా-గమపమా-మపదపా-పదనిదా ఉద్వాహితము

12. మామామాపమా-పాపాపారిపా-ధాధాధాగధా-నీనీనీసనీ ఊర్మి

13. సరిగమా-మగసరిసా-రిగమపా-పమగరీ-గమపదా-దపమగా-
మపదనీ-నిదపమా సమము

14. సరిరిసా-రిగాగరీ-గమామగా-మపాపమా-పధాధపా-
ధనీనిదా ప్రేంఖము

15. సరిసాగసా-రిగరీమరీ-గమపాపగా-మపమాధమా-
పదపానిధా నిష్కూజితము

16. సస-రీధ-గని-ససా శ్యేనము

17. సరి సరిగ సరిగమ రిగరిగమా రిగమపా గమగమపా
గమపధా మప మపధ మపదనీ క్రమము

18. సరిపమగరీ-రిగదపమగా-గమనీధపమగా ఉద్ఘట్టితము

19. సగరి-సగరి-సా రిమగ-రిమగ-రీ-గపమ-గపమ-
గా-మధప-మదపమా-పనిద-పద-పా రంజితము

20 ససామగరీ-రిధాపమగా-గనీపదమా సన్నివృత్త ప్రవృత్తకము

21. సాసరిమాగా-రిరిగపామా-గాగమధాపా-మామపనిధా — వేణు
22. సారిమరిసా-రిగపగారి-గమా-దమాగా-మపనిమమా | లలితస్వరము
23. సరిసా-సరిగరిసా-సరిగమగరిసా-గసరిగమ-పమగరిసా
సరిగమపదపమగరిసా-సరిగమపదనిద-పమగరిసా | హుంకారము
24. సగరిసా-రిమగరీ-గపమగా-పనిధపా — హ్లాదమానము
25. సగమామరిసా-రిమపాపగరీ-గపధా-ధమగా-మదనీనిపమా-అపలోకితము

ఇవి సంచారి అలంకారములు

* * *

ఇంక సప్తాలంకారములు.

1. సరిగమపాధనిసా‘‘సా — తారమంద్రప్రసన్నము
2. 0 సా 0 సా నిదపమ గరి 0 సా — మంద్రతార ప్రసన్నము
3. ససరిరిససరిసా-రిరిగగరిరిగరీ-గగమమగగమగా
మమపపమమపమా-పపదదపపదపా-దదనినిదదనిదా — ఆవర్తకము
4. ససరిరిసస-రిరిగగరిరి-గగమమగగ-మమపపమమ-
పపదదపప-దదనినిదద- — సంప్రదానము
5. సగసగా-రిమరిమా-గపగపా-మదమదా-పనిపనీ — విధుతము
6. సరిసరి-గరిగరి-రిగరిగ-మగమగ-గమగమ-పమపమా-
మపమప-దసదసా-పదపద-నిదనిదా- — ఉపలోలము
7. ససగసగా-రిరిమరిమా-గగపగపా-మమదమపా-పపనిపనీ — ఉల్లాసితము
8. సరిరిస రిగాగరి-గమామగా-మపపమా పదదపా
దనీనిధా-నిసాసనీ — సప్రేఖోల్లిత

పైని సంగీత రత్నాకరములో శార్ఙ్గదేవునిచే చెప్పబడెను.

# జంటవరుసలు

## ఇంక నేటి సంగీత సంప్రదాయములోని కొన్ని జంటవరుసలు

1. సస రిరి గగ మమ పప దద నిని "సస" ।
సస నిని దద పప మమ గగ రిరి సస ॥

2. సస రిరి గగ మమ రిరి గగ మమ పప
గగ మమ పప ధధ మమ పప ధద నిని
పప ధధ నిని సస సస నిని దద పప
నిని దద పప మమ దధ పప మమ గగ
పప మమ గగ రిరి మమ గగ రిరి సస

3. సస రిరి సస రిరి గగ మమ
రిరి గగ రిరి గగ మమ పప
గగ మమ గగ మమ గగ మమ పప దద
మమ పప మమ పప మమ పప దధ నిని
పప దద పప దద పప దధ నిని సస
సస నిని సస నిని సస నిని దద పప
నిని దధ నిని దద నిని దద పప మమ
దద పప దధ పప దధ పప మమ గగ
పప మమ పప మమ పప మమ గగ రిరి
మమ గగ మమ గగ మమ గగ రిరి సస

4. ససరి ససరి సరి సస రిరి గగ మమ
రిరిగ రిరిగ రిగ రిరిగ మమ పప
గగమ గగమ గమ గగ మమ పప దద
మమప మమప మప మమ పప దద నిని
పపద పపద పద పప దద నిని సస
ససని ససని సని సస నిని దద పప
దధప ధదప దప దద పప మమ గగ

పపమ పపమ పమ పప మమ గగ రిరి
మమగ మమగ మగ పప మమ గగ రిరిస
మమగ మమగ మగ మమ గగ రిరిస

5. సస రిరిగ సరిగ సస రిరి గగ మమ
రిరి గగమ రిగమ రిరి గగ మమ పప
గగ మమప గమప గగ మమ పద పద
మమ పపద మపద మమ పప దధ నిని
పప దదని పదని పప దద నిని సని
సస నినిద సనిద సస నిని దద పప
నిని దదప నిద నిని ధద పమ మమ
దద పపమ దపమ ధధ పప మగ రిరి
పప మమగ పమగ పప మమ గగ రిరి
మమ గగరి మగరి మమ గగ రిరి సస

6. సాస రీరి సస రీరి సస రిరి గగ సస రిరి సరిరి సరిరి సరిరిగా గమమ
రీరి గాగ రిరి గాగ రిగగ మమ రిరిరి గగ రిగగ రిరి గమామ పప
గాగ మామ గగ మామ గమమ పప గగగ మమ గమమ గమమ
పాప ధధ
మామ పాప మమ పాప మపప దద మమమ పప మపప మపప
దాద నిని
పాప దాద పప దాద పదద నిని పప పదద పపద పదద నీని సస
సాస నీని సస నీని సనిని దాద సస సనిని సనిని సనిని దాద పప
నీని దాద నిని దాద నిదద పప నినిని దద నిదద పదద పాప మమ
దాద పాప దద పాప దపప మమ దదద పప దపప పపమా మగగ
పాప మామ పప మామ పమమ గగ పప పమమ పమమ పమమ గాగ రిరి
మామ గాగ మమ గాగ మగగ రిరి మమ మగగ మగగ మగగ రీరి సస

## త్రిస్థాయి

మంద్ర షడ్జము మొదలు ఆరోహణగతిగా షడ్జమువరకు ఒకస్థాయి మధ్య షడ్జము మొదలు ఆరోహణ గతిగా షడ్జమునకు రెండు స్థాయి. తార షడ్జము మొదలు ఆరోహణగతి షడ్జమువరకు మూడవ స్థాయి.

ఈ క్రిందివి అలంకారములుగ నేటి సంప్రదాయమున జెప్పబడినవి ఇవి సంగీత పారిజాతములోఁ జెప్పబడెను. చతుర్దండి ప్రకాశికలో వెంకటమఖి కూడ చెప్పెను. ధ్రువతాళము దీని **పేరు** ఇంద్రనీల.

14 అక్షరముల**కాలము** చతురశ్రజాతి.

| | | | |
|---|---|---|---|
| 1. సరిగమ | గరి | సరిగరి | సరిగమ |
| రిగమప | మగ | రిగమగ | రిగమప |
| గమపమ | పమ | మపదని | గమపద |
| మపదని | దప | మపదప | మపదని |
| పదనిస | నిద | పదనిద | పదనిస |
| సనిదప | దని | సనిదని | సనిదప |
| నిదపమ | పద | నిదపమ | నిదపమ |
| దపమగ | మప | దసమప | ధపమగ |
| పమగరి | గమ | పమగమ | పమగరి |
| మగరిస | రిగ | మగరిగ | మగరిస |

మఠ్యతాళము 10

2. 10 అక్షరములు చతురశ్రజాతి

దీనిపేరు మహావజ్రము

| | | |
|---|---|---|
| సరిగరి | సరి | సరిగమ |
| రిగమగ | రిగ | రిగమప |
| గమపమ | గమ | గమపద |
| మపదప | మప | మపదని |
| పదనిద | పద | పదనిస |
| సనిదని | సని | సనిదప |
| నిదపద | నిద | నిదపమ |
| దపమగ | మప | దపమగ |
| పమగరి | గమ | పమగరి |
| మగరిస | రిగ | మగరిస |

రూపకతాళము 10

3. 6 అక్షరముల కాలము

చతురశ్రజాతి

దీనిపేరు నిర్ఘోషము

| | |
|---|---|
| సరి | సరిగమ |
| రిగ | రిగమప |
| గమ | గమపద |
| మప | మపదని |
| పద | పదనిస |
| సని | సనిదప |
| నిద | నిదపమ |
| దప | దపమగ |
| పమ | పమగరి |
| మగ | మగరిస |

జంపె 1 ౮ 0

10 అక్షరములు మిశ్రజాతి

| | | |
|---|---|---|
| 4. సరిగసరి | సరిగ | మా |
| రిగమరిగ | రిగమ | పా |
| గమపగమ | గమప | దా |
| మపదమప | మపద | నీ |
| పదనిపద | పదని | సా |
| సనిదసని | సనిద | పా |
| నిదపనిద | నిపద | మా |
| దపమదప | దపమ | గా |
| పమగపమ | పపగ | రీ |
| మగరిమగ | మగరి | సా |

త్రిపుట 100 కోకిలము

7 అక్షరములకాలము త్రిశ్రజాతి

| | | |
|---|---|---|
| సరిగ | సరి | గమ |
| రిగమ | రిగ | మప |
| గమప | గమ | పద |
| మపద | మప | దని |
| పదని | పద | నిస |
| సనిద | సని | దప |
| నిదప | నిద | పమ |
| దపమ | దప | మగ |
| పమ గ | పమ | గరి |
| మగరి | మగ | రిస |

9 అక్షరములు

దీనిపేరు పీఠము

| | | |
|---|---|---|
| సరి | సరిగ | సరిగమ |
| రిగ | రిగమ | రిగమప |
| గమ | గమప | గమపద |
| మప | మపద | మపదని |
| పద | పదని | పదనిస |
| సని | సనిద | సనిదప |
| నిద | నిదప | నిదపమ |
| దప | దపమ | దపమగ |
| పమ | పమగ | పమగరి |
| మగ | మగరి | మగరిస |

## దీ[illegible] ఆవర్తము, అడ్డతాళము

| | | |
|---|---|---|
| సరిగరి | సరిసరి | సరిగమ |
| రిగమగ | గమగమ | గమపద |
| మపదప | మపమప | మపదని |
| పదనిద | పదపధ | పదనిస |
| సనిదని | సనిసని | సనిదప |
| నిదపధ | నిదనిద | నిదపమ |
| దపమప | దపదప | దపమగ |
| పమగమ | పమపమ | పమగరి |
| మగరిగ | మగమగ | మగరిస |

## స దా న ం ద ము

| | | |
|---|---|---|
| సరిగమ | రిగమప | గమపద |
| మపదని | పదనిస | సనిదప |
| నిదపమ | దపమగ | పమగరి |
| మగరిస — | | |

**అటతాళము 1100**
**14 అక్షరములు ఖండజాతి**

| | | |
|---|---|---|
| సరీగా | సారిగా | మామా |
| రిగామా | రీగమా | పాపా |
| గమాపా | గామపా | దాదా |
| మపాదా | మాపదా | నీనీ |
| పదానీ | పాదనీ | సాసా |
| నిదాపా | నీదపా | మామా |
| దపామా | దాపమా | గాగా |
| పమాగా | పామగా | రీరీ |
| మగారీ | మాగరీ | సాసా |

**ఏకతాళము**
**4 అక్షరములు**
**చతురశ్రజాతి**

సరిగమ
రిగమప
గమపద
మపదని
పదనిస
సనిదప
నిదపమ
దపమగ
పమగరి
మగరిస

| | | | |
|---|---|---|---|
| సరిగా | రిగమా | గమపా | మపదా |
| పదనీ | ధనిసా | సనిదా | నిదపా |
| మగరి | గరిసా | | |
| సరిగ | రిగమ | గమప | మపద |
| పదని | దనిస | సనిద | నిదప |
| దపమ | పమగ | మగరి | గరిస |

## అలంకార ప్రయోజనములు

రక్తిలాభఃస్వరజ్ఞానం వర్ణాంగానాం విచిత్రతా
ఇతిప్రయోజనాన్యాహు రలంకార నిరూపణే

రక్తి పొప్తించుట, స్వరముల జ్ఞానము వర్ణాంగముల వైచిత్రి అనునవి అలంకారమువలన సిద్ధించు ప్రయోజనములు.

## గ మ క ము లు-

గమకములు పదునైదు. ఇవి చతుర్దండి ప్రకాశికలోఁ జెప్పబడినవి. శ్రోతల రంజించుటకై స్వరముల వివిధ కంపనములను గమకములందురు. రంజనను పొందించునవి గాన గమకములని వ్యుత్పత్తి.

1. తిరిపము– ఒక పొట్టిస్వరమును 1/8 మాత్రాకాలముయొక్క వేగముతో స్వరమును గంపింపఁ జేయుట.
2. స్ఫురితము– పొట్టిస్వరమును 1/6 మాత్రాకాలముయొక్క వేగముతోఁ గంపనము చేయుట
3. కంపితము– పొట్టిస్వరమును 1/4 మాత్రాకాలముయొక్క వేగముతోఁ గంపనము చేయుట
4. లీనము– పొట్టిస్వరమును 1/2 మాత్రాకాలపు వేగముతోఁ గంపనము చేయుట.
5. ఆందోళితము– పొట్టిస్వరము ఒక మాత్రాకాలపు వేగముతోఁ గంపనము చేయుట.

7. త్రిభిన్నము - మూడు స్థానములలో వేగముతో స్వర సంచారముచేయుట
8. కురులము- బలి గమకములోని స్వరములను ఘనము ఉచ్చరించుట.
9. ఆహతము- స్వరసంచారముచేయుచు తరువాతిస్వరముపైని ఆఘాతము చేసి క్రిందకు మరలుట
10. ఉల్లాసితము - స్వరసంచారములో ఒకస్వరమునుదాటి [illegible]ముకుపోవుట.
11. ప్లావితము - మూడు పొట్టిస్వరకాలము వేగముతో [illegible] చేయుట.
12. గుంఫితము- హుంకారముతో గంభీరముగా కంపనము చేయుట.
13. ముద్రితము- నోరుమూసికొని కంపనము చేయుట.
14. నామితము- స్వరములను క్రిందకు అవరోహించి కంపనము చేయుట.
15. మిశ్రితము- పైని చెప్పిన గమకములలో ఒకటికంటె నెక్కువ గమకములను కలిపి కంపనము చేయుట.

ఇంక నేటి సంప్రదాయములోని దశవిధ గమకములు-

ఆరోహమవరోహంచ ఢాలుస్ఫురిత కంపితాః
ఆహతః ప్రత్యాహతశ్చ త్రిపుచ్ఛాందోళ మూర్ఛనాః

1. 1 ఆరోహము 2 అవరోహము 3 ఢాలు 4 స్ఫురితము 5 కంపితము 6 ఆహతము 7 ప్రత్యాహతము 8 త్రిపుచ్ఛము 9 ఆందోళనము 10 మూర్ఛన అని గమకములు పది.

1. ఆరోహము - సరిగమ పదనిస
2. అవరోహము - సని ధప మగరిస
3. ఢాలు - సప, సమ, సగ, సరి, సస
4. స్ఫురితము - సస, రిరి, గగ, మమ, పప, దధ, నిని, సస
5. కంపితము - పాపపప-ఒకస్థానమునందు నిలిచి స్వరస్థానములను పలికించు
6. ఆహతము - సరి, రిగ, గమ, మప, పద, దని, నిస
7. ప్రత్యాహతము - సని, నిద, దప, పమ, మగ, గరి, రిస

8. త్రిపుచ్ఛము - సససస, రిరిరి, గగగ, మమమ, పపప.
9. ఆందోళనము - సరిసపాప, రిగరిమామ, గమగపావ.
10. మూర్ఛన - సరిగమ పదని రిగమ పదనిస, గమ, పదనిసరి.

## స్వ ర జా తు లు

ఈ స్వరజాతులనే స్వరజతులని నేటి సంగీత సంప్రదాయజ్ఞులు వ్యవహరించిరి.

శుద్ధాఃస్యుర్జాతయః సప్త తాః షడ్జాది స్వరాభిధాః
షాడ్జ్యార్షభీచ గాంధారీ మధ్యమా పంచమీతథా
ధైవతీ చాథనైషాదీ శుద్ధతాలక్ష్య కథ్యతే.

షడ్జాది స్వరములనుబట్టి (స షాడ్జీ (రి ఆర్షభీ (గ గాంధారీ (మ మధ్యమా (ప పంచమీ (ధధైవతీ (ని నైషాదీ అని జాతులేడు గలిగినవి.

స] షడ్జము న్యాస స్వరముగాఁ గలది షాడ్జి.
రి] ఋషభము న్యాస స్వరముగా గలది ఆర్షభి.
గ] గాంధారము న్యాస స్వరముగా గలది గాంధారి.
మ] మధ్యమము న్యాసముగాఁ గలది మధ్యమము. ఇట్లె న్యాసస్వరము లనుబట్టి ధైవతి మొదలగు పేరులు వచ్చినవి.

ఇంక శుద్ధముల లక్షణము చెప్పబడును.

యాసాం నామస్వరోన్యాసో అపన్యాసోగ్రహ స్తథా
తారన్యాస విహీనాస్తాః పూర్ణాః శుద్ధాభిధామతాః

ఏస్వరములయొక్క నామస్వరము న్యాసముగను అపన్యాసముగను గ్రహముగను ఉండునో మఱియు తారస్థానములో న్యాసములేకుండునో అవి పూర్ణములనఁబడును. న్యాసాదుల లక్షణము ముందు చెప్పబడును.

వికృతా న్యాస వర్జ్యైతల్లక్ష్మహీనా భవంత్యమూః

న్యాసము తక్క మిగిలిన యాలక్షణము లేనివి వికృతములు అనఁగా నామస్వరమునే న్యాసముజేసి ఇతరస్వరములను అపన్యాసాదులనుగాఁ జేసినచో అవి వికృతములగును. వికృతములందు న్యాసము తప్పక యుండునన్న మాట.

సంపూర్ణత్వ గ్రహాంశాపన్యాసేష్వేకైకవర్జనాత్
భవంతి భేదాశ్చత్వారో ద్వయోస్త్యాగేన షణ్మతాః

సంపూర్ణత్వాదులతో ఒక్కొక్కటి లేనిచో నాలుగు రకములగును. రెండేసి లేనిచో ఆరు రకములగును.

1. సంపూర్ణము లేనిచో (సప్త స్వరములు లేనిచో) అనగా గ్రహము అంశము అపన్యాసము గలది యొకరకము.

2. గ్రహము లేనిచో అనగా సంపూర్ణత్వము అంశము అపన్యాసము గలది రెండవరకము.

3. అంశము లేనిచో అనగా సంపూర్ణత్వము గ్రహము అపన్యాసము గలది మూడవరకము.

4. అపన్యాసము లేనిచో అనగా సంపూర్ణత్వము అంశము గ్రహము గలది నాల్గవరకము ఇట్లు నాల్గురకములు. రెండేసిలేనిచోఁ గలుగుభేదములుఆఱు.

1. సంపూర్ణత్వ గ్రహములు మాత్రముగలది ఒకరకము.
2. సంపూర్ణత్వము అంశము మాత్రయ గలది రెండవరకము.
3. సంపూర్ణత్వము అపన్యాసము మాత్రము గలది మూడు.
4. గ్రహము అంశము మాత్రము గలది నాలుగు.
5. గ్రహము అపన్యాసము గలది అయిదు.
6. అంశము అపన్యాసము గలది ఆఱు.

త్యాగే త్రయాణాం చత్వార, ఏకస్యైకే చతుష్టయే
భేదాః పంచాదశైవైతే షాడ్జ్యాః సద్భిర్నిరూపితాః

మూఁడులేనిచో నాలుగురకములు. నాలుగులేనిచో ఒకరకము. ఇట్లు షాడ్జికి భేదములు పదునైదు ఉండునని సత్పురుషులు నిరూపించిరి.

1. సంపూర్ణత్వము గ్రహము అంశములేనిది ఒకటి.
2. సంపూర్ణత్వము గ్రహము అపన్యాసము లేనిది రెండు.
3. సంపూర్ణత్వము అంశము అపన్యాసము లేనిది మూడు.
4. గ్రహము అంశము అపన్యాసము లేనిది నాలుగు నాల్గుగు – లేనిచో ఒకటి.

1. సంపూర్ణత్వము గ్రహము అంశము, అపన్యాసము లేనిది ఒకటవరకము,

తత్రాష్టౌ పూర్ణతాహీనాః షాడవౌడవ భేదతః

అందు పూర్ణములేని భేదములు ఎనిమిది. షాడవౌడవ భేదములు 8×2-16

అతో అష్టావధికా ఆర్షభ్యాదిష్వౌడవ జాతిషు
అతస్త్రయోవింశతిధా షట్సు ప్రత్యేక మీరితాః

పూర్ణత్వమును షాడవభేదములు ఎనిమిదింటిచేతను ఇతర భేదము లేడింటిచేతను పదునైదు అగును.

ఆర్షభి (రి) మొదలగువానియందు ఔడవజాతిని (రెండేసి స్వరములు లేనిదానిని) బట్టి ఈవిధముగ ఎనిమిది యెక్కువగాన ఇరువది మూఁడగును.. ఈవిధముగా ఆర్షభి (రి) మొదలగు ఆఱును ఇరువది మూఁడేడి యగును గాన (6×23=138+15) మొత్తు 153 అగును.

వికృతానాంతు సంసర్గాజ్జాతా ఏకాదశస్మృతాః

పైని జెప్పిన వికృతములయొక్క కలయికవలనఁబుట్టినవి పదునొకండు 11 అగును.

1 స్యాత్షడ్జ కైశికీ 2 షడ్జోదీచ్యవా 3 షడ్జమధ్యమాః
4 గాంధారో దీచ్యవా 5 రక్తగాంధారీ 6 కైశికీతథా
7 మధ్యమోదీచ్యవా 8 కార్మారవీ 9 గాంధారపంచమీ
10 తథాంధ్రీ 11 నందయంతీ తద్వైతూనధునాబ్రువే.

ఆపదునొండు ఇవి. 1 షడ్జకైశికీ. 2 షడ్జోదీచ్యవ 3 షడ్జమధ్యమ 4 గాంధారోదీచ్యవ 5 రక్తగాంధారి 6 కైశికి 7 మధ్యమోదీచ్యవ 8 కార్మారవి 9 గాంధారపంచమి 10 ఆంధ్రీ 11 నందయంతి. ఇవి యెట్లైనవో వానికి కారణములు చెప్పెదను.

షాడ్జీగాంధారికా యోగాజ్జాయతే షడ్జకైశికీ
షాడ్జీకామధ్యమాభ్యాం తుజాయతే షడ్జమధ్యమాః

గాంధారి పంచమా భ్యాంతు జాతాగాంధార పంచమీ
గాంధార్యార్షభికాభ్యాంతు జాతిరాంధ్రీ ప్రజాయతే

షాడ్జిగాంధారి కలియుటవల్ల షడ్జకైశిక జాతికలుగును. (స+గ)షాడ్జి మధ్యమ కలియుటవల్ల షడ్జమధ్యమకాతి అగును(స+మ)గాంధారిపంచమము కలియుటవల్ల గాంధారపంచమి జాతిఅగును (గ+ప) గాంధారి ఆర్షభి కలియుటవల్ల ఆంధ్రీ జాతిఅగును (గ+రి)

షాడ్జీ గాంధారికా తద్వత్ధైవతీ మిళితాస్త్రీమాః
షడ్జో దీచ్యవతీం జాతిం కుర్యుః కార్మారవీంపునః

షాడ్జి గాంధారి ధైవతి ఈమూడింటి కలయికవలన షడ్జోదీచ్యవ అనునది అగును. ఇంక కార్మారవి చెప్పబడును.

ఉద్యాపయంతినై షాదీ పంచమ్యార్షభికాయుతాః
నైషాదిపంచమి ఆర్షభి ఈ మూడిటి కలయికవల్లకార్మారవి కలుగును. [ని+ప+రి]

నందయంతీతు గాంధారీ పంచమార్షభికాన్వితా
గాంధారిపంచమీ ఆర్షభి కలిసినచో నందయంతి అగును [గ+ప+రి]

గాంధారీ ధైవతీ షాడ్జీ మధ్యమేతి యుతాస్త్రీమాః
గాంధారోదీచ్యవాం కుర్యుర్మధ్యమోదీచ్యవాంపునః

గాంధారి ధైవతి షాడ్జి మధ్యమ అనునవి గలిసినచో గాంధారోచ్యవ అగును. ఇంక మధ్యమోదీచ్యవయైతే.

ఏతా ఏవవినాషాడ్జ్యా పంచమ్యా సహకుర్వతే
కుర్యుస్తా రక్తగాంధారీం నైషాదీపచధైవతీ
ఆర్షభీ ధైవతీం త్యక్త్వా పంచభ్యః కైశికీభవేత్
ఇవే షాడ్జి లేకుండ పంచమితో కూడ మధ్యమోదీచ్యవ అగును. [గ ధ మ ప]
నైషాదధైవతి ఇవిలేనిచో రక్తగాంధారి అగును.
అర్షభిధైవతి లేనిచో లేక మిగిలిన అయిదువల్ల కైశికి అగును.

1. స గ – (షాడ్జీ గాంధారి)–షడ్జకైశికి
2. స మ – (షాడ్జి మధ్యమ) – షడ్జ మధ్యమ
3. గ వ – గాంధారి పంచమి – గాంధార పంచమి
4. గ రి = (గాంధారి ఆర్షభి) – ఆంధ్రి
5. స గ ధ – (షాడ్జి గాంధారి ధైవతి) – షడ్జోదీచ్యవతి
6. ని ప రి = (నైషాది పంచమి ఆర్షభి) – కార్మారవి
7. గ ప రి – గాంధారి పంచమి ఆర్షభి – నందయంతి
8. గ ధ స మ (గాంధారి ధైవతము షాడ్జి మధ్యమ గాంధారో దీచ్యవ
9. గ ధ మ ప – గాంధారి ధైవత మధ్యమ పంచమి – మధ్యమో దీచ్యవ
10. గ మ ప ని – గాంధారి మధ్యమ పంచమ నైషాది –రక్తగాంధారి
11. స గ మ ప ని – [షాడ్జీ గాంధారి మధ్యమ పంచమి నైషాది] కైశికి

ఈ షడ్జకైశికి మొదలగు పేర్లు సార్థకములు కొన్ని రూఢములు.

## షడ్జగ్రామ జాతులు

చతస్రః షడ్జ శబ్దిన్యో నైషాదీధైవతీ తథా
ఆర్షభీచేతి సప్తైతాః షడ్జగ్రామస్య జాతయః

షడ్జ శబ్దములు గలవి నాలుగు అనగా 1 షాడ్జి 2 షడ్జకైశికి 3 షడ్జ మధ్యమ 4 షడ్జో దీచ్యవ 5 నైషాది 6 ధైవతి 7 ఆర్షభ అని యివి షడ్జ గ్రామములోని జాతులు.

## మధ్యమ గ్రామ జాతులు.

శేషాఃస్యుర్మధ్యమ గ్రామే పూర్ణత్వాద్యధునోచ్యతే

మిగిలినవి మధ్యమ గ్రామములోని జాతులు. 1 గాంధారి 2 మధ్యమ 3 పంచమి 4 గాంధారపంచమి 5 ఆంధ్రి 6 కార్మారవి 7 నందయంతి 8 గాంధారోదీచ్యవ 9 మధ్యమోదీచ్యవ 10 రక్తగాంధారి 11 కైశికి ఇవిమధ్యమగ్రామజాతులు.

ఇంక పూర్ణత్వాదులు చెప్పబడును షాడవౌడవములుగాక నిత్యము పూర్ణమగు జాతులు.

## పూర్ణజాతులు

కార్మారవ్యథ గాంధార పంచమీ షడ్జకైశికీ
మధ్యమోదీచ్యవేత్యేతా నిత్యపూర్ణాః ప్రకీర్తితాః

1 కార్మారవి 2 గాంధార పంచమీ 3 షడ్జకైశికి 4 మధ్యమోదీచ్యవ అన్నవి పూర్ణములు.

## సంపూర్ణ షాడవములు

షాడ్జీచనందయం త్యాంధ్రీ గాంధారోదీచ్యవేత్యమూః
సంపూర్ణషాడవాః ప్రాహచతస్రః సోఢలాత్మజః

1 షాడ్జి నందయంతి 3 ఆంధ్రీ 4 గాంధారోత్తీచ్యవ అని సంపూర్ణషాడవములు నాలుగని సోఢలుని పుత్రుడుచెప్పెను.

సంపూర్ణముగను షాడవముగను ఔడవముగను నుండు జాతులు.

దశావశిష్టాః సంపూర్ణ షాడఔడవితామతాః

మిగిలినవి పది సంపూర్ణషాడవౌడువములుగ నున్నవి 1 ఆర్షభి 2 గాంధారి 3 మధ్యమ 4 పంచమి 5 ధైవతి 6 నైషాది 7 షడ్జోదీచ్యవ 8 షడ్జమధ్యమ 9 రక్తగాంధారి 10 కైశిక.

1. ఆర్షభిలో షడ్జము లోపించినచో షాడవమును సపలు లోపించినచో ఔడవమునగును.

2. గాంధారి 3 రక్తగాంధారి 4 కైశికి అను వానిలో రి లోపించినచో షాడవములును రిధలు లోపించినచో ఔడవములగును.

3. మధ్యమపంచమి వీనిలో గ లోపించినచో షాడవములును, నిగలు లోపించినచో షాడవములను సపలు లోపించినచో ఔడవములునగును. షడ్జోదీచ్యవలో ఠి లోపించినచో షాడవములును స, రిలు లోపించినచో ఔడవములునగును.

4. షడ్జమధ్యమలో ని లోపింపగా షాడవములును నిపలు లోపించినచో ఔడువములు నగును.

పంచమీ, మధ్యమా, షడ్జ మధ్యమాఖ్యాసుజాతిషు
స్వరసాధారణం ప్రోక్తం మునిభి ర్భరతాదిభిః

1 పంచమి 2 మధ్యమ 3 షడ్జమధ్యమ అను జాతుల స్వరములు సాధారణముగ గలుగునని భరతాది మునులనిరి.

అంశేషుసమపేష్వేవయథా స్వనియమాద్భవేత్
ఏత దల్పనిగాస్వాహుః కంబలాశ్వత రాదయః

నిగలు తక్కువగాఁ గల పంచమీ మధ్యమ షడ్జమధ్యమ షాడ్జీ అను వానిలో తమనియమము తప్పక సమవ అంశములందె స్వరసాధారణమగునని కంబలాశ్వతరాదులనిరి. నిషాదగాంధారములు ఇతరములకు సంవాదు లగుటచే లోపము (అల్పము) ఇతరాంశయందు లేకపోవుటచే కాకల్యంతర ప్రయోగము చేయరాదని భావము.

అల్ప ద్విశ్రుతికే రాగ భాషాదావపి తన్మతం

అల్పద్విశ్రుతి గల జాతులందు రాగాంగ భాషాంగ క్రియాంగోపాంగము లందు ఆకాల్యంతర సాధారణమగునని భరతాదుల మతము.

నిగయోరంశయోః షడ్జ మధ్యమాయాం నతద్భవేత్
వికృతాఏవ తత్రాపి స్వరసాధారణాశ్రయాః

షడ్జ మధ్యమయందు అంశములైన నిగలకు ఆస్వర సాధారణము గలుగదు. అందులోను స్వరసాధారణమును ఆశ్రయించినవి వికృతములే గాని శుద్ధములుగావు. షడ్జాదులందు శుద్ధావస్థయందు వికృత స్వరప్రయో గము చేయరాదని భావము.

ఏకాంశానందయంతీచ మధ్యమోదీచ్యవాతథా
గాంధారవంచమీ త్యేతాస్త్రిస్రోః ద్వ్యంశాస్తు ధైవతీ
గాంధారోదీచ్య వాచాథ పంచమీ త్యుదితాఇమాః

1. ఒకస్వరము అంశముగాఁ గలవి. 1 నందయంతి 2 మధ్యమోదీచ్యవ 3 గాంధారపంచమ వీనిలో పంచమము అంశముగా నుండును.
2. రెండుస్వరములు అంశముగాఁగలవి 1 ధైవతి 2 గాంధారోదీచ్యవ 3 పంచమి అనునవి. ధైవతియందు ఋషభ ధైవతములు (రిధ) అంశములు

గాంధారోదీచ్యవయందు షడ్జ మధ్యమములు (స, మ) అంశములు. పంచమియందు ఋషభ పంచమములు (రిప) అంశములు.

సైషాద్యార్షభికా షడ్జకైశిక్యంశికామతాః
ఆంధ్రీకార్మారవీ షడ్జాదీచ్యావాశ్చతురింశకాః

3. మూడు అంశములు గలవి 1 నైషాది 2 ఆర్షభికా 3 షడ్జకైశికి.

నైషాదిలో నిసగలు అంశములు. ఆర్షభిలో రినిధలు అంశములు. షడ్జకైశికలో సగపలు అంశములు.

4. నాలుగుస్వరములు అంశములుగాఁ గలవి. 1 ఆంధ్రి 2 కార్మారవి 3 షడ్జోదీచ్యవ. ఆంధ్రిలో రిగపనిలు అంశములు. కార్మారవిలో రిపదనిలు అంశములు. షడ్జోదీచ్యవలో సమధనిలు అంశములు.

పంచాంశా రక్తగాంధారీ గాంధారీ మధ్యమాతథా
షాడ్జీత్యేతాశ్చతస్రః స్యుః షడం శై కైవకైశికీ.

5. అయిదు స్వరములు గలవి–1 రక్తగాంధారి 2 గాంధారి 3 మధ్యమషాడ్జీ. రక్తగాంధారిలో సగమపనిలు అంశములు గాంధారిలో సగమపనిలు అంశములు మధ్యమలో సరిగమనిలు. షాడ్జిలో సగమపదలు అంశములు.

6. ఆరు స్వరములు అంశముగాగలవి. కైశికి ఒకటి ఇందు రి తక్క మిగిలిన సగమపదనిలు అంశములు.

సప్తాంశాః సూరిభిః షడ్జమధ్యమా పరికీర్తితాః
ఇతిత్రిషష్టి రంశాఃస్యుర్జాతి ష్వష్టాదశాస్వమే.

7. ఏడుస్వరములు గలది షడ్జమధ్యమ అనిసూరులచేఁ జెప్పఁబడెను. ఇందు ఏడు స్వరములును అంశములె. ఇట్లు పదునెనిమిదియందు మొత్తము 63 అంశములుగలవు.

గ్రహాంశతార మంద్రాశ్చన్యా సాపన్యాసకౌతథా
అపిసంన్యాస విన్యాసౌ బహుత్వం చాల్పతామతా
ఏతాన్యంతరమార్గేణ సహలక్ష్మాణీ జాతిషు
షాడవౌడు వితే క్వాపీత్యేవ మాహుస్త్రయోదశ

1 గ్రహము 2 అంశము 3 తారము 4 మంద్రము 5 న్యాసము 6 అపన్యాసము 7 సంన్యాసము 8 విన్యాసము 9 బహుత్వము 10 అల్పత్వము ఇవియు 11 అంతరమార్గము (తోఁగూడ) 12 షాడవము 13 ఔడవము. అని జాతులలో వానివాని సంబంధమునుబట్టి (అనగా రాగములలో) పదమూడు లక్షణములుండును.

## గ్ర హ ల క్ష ణ ము

గీతాది నిహిత స్తత్ర స్వరో గ్రహ ఇతీరితః
తత్రాంశ గ్రహయోరన్యతరోక్తా వుభయ గ్రహః

మనోరంజకమైన స్వర సందర్భముగల గీతము పాడుటకు నారంభింపఁ బడునపుడు మొదట సప్తస్వరములలో నేస్వరము గ్రహింపబడునో ఆ స్వరము లలో నేదోయొకటి చెప్పినచో ఉభయగ్రహము. గ్రహముచెప్పినచోట అంశ మునకు అంశము చెప్పినచోట గ్రహమునకు సంగ్రహము కలుగునని భావము. అంశముల వలెనే గ్రహములును 63 ఉండునని తెలియునది. (రాగముగానిసంగతులుగాని ఏస్వరముతో ప్రారంభింపబడునో ఆ స్వరము గ్రహము.)

## అం శ ల క్ష ణ ము

యోర క్తివ్యంజకో గేయే యత్సంవాద్యనువాదినౌ
విదార్యో బహులౌ యస్మాత్తారమంద్ర వ్యవస్థితిః
యఃస్వయం యస్యసంవాదీవానువాదీ స్వరోఽపరః
న్యాసావన్యా విన్యాస సంన్యాస గ్రహతాం గతః
ప్రయోగే బహులః సఃస్యాద్వా ద్యంశోయోగ్యతావశాత్

1. గేయములో ఏది రక్తి వ్యంజకత్వాది ధర్మములగలదో 2 దేని యొక్క సంవాది అనువాది స్వరములు విదారియను గీతి ఖండమందు బహుళ యోగము గలిగియుండునో 3 దేనివల్ల ఇదితారము ఇదిమంద్రము అనువ్యవస్థ గలుగునో అనగా దేనిని హద్దుగా పెట్టుకొన్నందువల్ల పైస్వరమును ఆరోహ ణము చేయుటవల్ల మంద్రవ్యవస్థయుఁ గలుగునో 4 ఏస్వరము స్వయముగా దేనికి సంవాది స్వరము అగునో ఒకప్పుడు వాదిగా వ్యవహరింపఁబడునే స్వర మునకు స్వయముగా సంవాదిగానే యగునో 5 ఏస్వరమునకు అనువాది స్వర మైతే ఇతరస్వరమే యగునో.

* అనగా ఎన్నిటికిని ఆ స్వరము తనకుతాను (ఆస్వరమె) అనువాదిగా నుండదో 6 ఏస్వరమైతే సందర్భమునుబట్టి ఒక్కొక్కప్పుడు న్యాసముగా గాని, 7 అపన్యాసముగాఁగాని, 8 విన్యాసముగాఁగాని, 9 సన్యాసముగాఁగాని 10. గ్రహముగాఁ గాని ప్రయోగములో బహుళముగా అగునో అట్టి వాది స్వరము రక్తి వ్యంజకత్వాది యోగ్యతలనుబట్టి అంశ స్వరమగును. ఈపది లక్షణములుగలది అంశస్వరమని భావము. రాగకళను జూపుటకై మాటి మాటికి ప్రయోగింపబడు స్వరము అంశము. అన్న మాట
అంశ సామాన్యలక్షణము,

బహుళత్వం ప్రయోగేషు వ్యాపకంత్వంశలక్షణం

ప్రయోగములో బహుళముగా నుండుటయె వ్యాపకమైన యంశలక్షణమని తేలిన సారాంశము.

## తా ర స్వ ర ము

మధ్యమే సప్తకేఽంశః స్యాత్తస్మాత్తార స్థితాన్వరాన్
స్వరాంశ్చతురఆరోహే దేషతారావధిః పరః

మధ్య స్థాయియందున్న షడ్జాది సప్తస్వరములందు తారములోనున్న యాస్వరమునుండి పైనున్న నాలుగు స్వరములను ఆరోహణము చేయవలయును. ఇది నిరతిశయమనయితారావధి. షడ్జగ్రామములు తారములో సనుండి రిగమప వఱకును మధ్యమ గ్రామములో మ తోఁ గలిపి అనఁగా మపదని వఱకు ఆరోహణము చేయవలెను. దీనిని తారమందు 'తార్యతే దూరం' దూరముగాఁ దరింపఁ జేయఁ బడునుగాన తారమని వ్యుత్పత్తి షడ్జగ్రామములో నైతే తార పంచమమునుండి ధైవత నిషాదములు ధనిలను అవి పైనున్నను

* ఎట్లన లోకములో రాజు ఆయా ప్రయోజనములనుబట్టి అమాత్యకృత్యములను జేయునుగాని భృత్యకార్యకారి మాత్రముగా నట్లు స్వరము అనువాది స్వరము గాదని భావము.

ఆరోహణము చేయరాదు. శక్తియున్నను తారము చేసినను రక్తియుండదు. గాన తారము చేయరాదు. మధ్యమగ్రామములోనైతే తార నిషాదము 'ని, అసంభవము' గాన అది తారముగా ఆరోహణము చేయబడదు.

అర్వాక్తుకామ చారఃస్యా త్తారోలుప్తోపిగణ్యతే
ఆతారషడ్జ మారోహో నందయంత్యాం ప్రకీర్తితః

న్యూనతారావధిగా చెప్పఁబడిన నిపలకంటె క్రిందుగా తారముఁతోనున్న స్వరములను ఇష్టమువచ్చినట్లు ఆరోహనము చేయవచ్చును. తారస్వరము ఒకటి లోపించినను తారము ఆరోహణము చేసినట్లె లెక్కయగును. నంద యంతిలో తార షడ్జమువఱకు ఆరోహణము గలుగును.

## మంద్రము

మధ్యస్థాన స్థితాదంశా దామంద్ర స్థాంశమావ్రజేత్
ఆమంద్ర న్యాసమధవాతదధఃస్థ రిధావపి
ఏషామంద్రగతేః సీమాతతో అర్వాక్కామ చారితా

మధ్యస్థాయియందున్న షడ్జాంశమును మధ్యమాంశము మొదలుకొని మంద్రస్థాయియందున్న షడ్జమధ్యమ మందున్న యంశమువఱకు స్వరమును అవరోహణము చేయవచ్చును. లేక మంద్ర న్యాసమగు గాంధారమువఱకుఁ గాని నిషాదము వఱకుఁగాని అవరోహణము చేయవచ్చును. లేక గాంధార నిషాదముల క్రిందవగు రిధల వఱకు అవరోహణము చేయవచ్చును. ఇది మంద్రగతికి హద్దు. దానిక్రింద ఇంకను న్యూనముగా అవరోహణము ఇష్ట మునుబట్టి చేయవచ్చును.

## న్యాసము

గీతేసమాప్తి కృన్న్యాస ఏకవింశతిధాచసః

గీతములో సమాప్తిని జేయుస్వరము న్యాసము. "న్యస్యతే త్యజ్యతే యేన" గీతము ముగింపఁబడునో అది న్యాసమని వ్యుత్పత్తి. అది అష్టాదశ జాతులలో ముందుచెప్పబోవు రీతిగా ఇరువదియొకటిగా అగును.

షాడ్జా దీనాంతు సప్తానాం న్యాసః స్యాన్నామ కృత్స్వరః
ద్వౌనామకారిణౌ షడ్జమధ్యమాయాంతుతౌమతౌ॥

షాడ్జీ ఆర్షభి మొదలైన యేడు జాతులలో షడ్జాదినామ స్వరములె న్యాసము షాడ్జిలో షడ్జము ఆర్షభిలో ఋషభము మొ. ఇవి 7 షడ్జమధ్యమ జాతిలో నామస్వరములు రెండు.

ఉదీచ్యవాత్రయుం మాంతం నిపగాంతు కైశికీ
కార్మారవీ పంచమాంతా గాంతాః పంచ పరాః స్మృతాః

షడ్జోభ్యవా గాంధారో దీచ్యవా మధ్యమోదీచ్యవా ఈమూఁడు మధ్యమ స్వరము [మ] అంతము గలవి. ఇక మూడు ఇంక మిగిలిన కైశికి నిపగలు న్యాసముగాఁ గలది. ఇవి మూడు. కార్మారవి పంచమమ న్యాసముగాఁగలది. ఇది ఒకటి. మిగిలిన షడ్జకైశికి, రక్తగాంధారి, గాంధారపంచమి ఆంధ్రి నంద యంతి ఈయయిదును గ న్యాసముగా గలవి. ఇదియైదు. మొత్తము 21

రాగమునగాని సంగతులలోగాని ముగింపుస్వరము న్యాసము. ఫలానా స్వరము న్యాసము అని చెప్పినప్పుడు షడ్జమునే గ్రహాంశమునుగా గ్రహింప వచ్చును.

## అ ప న్యా స ము

అపన్యాసః స్వరః స్యాద్యోవిదారీ (–గీతఖండః) సమాపకః

గీతఖండమును (అవాంతర విచ్ఛేదమును) పూర్తిచేయు స్వరము అప న్యాసము (రాగము సంగతులు పాడునపుడు నడుమ నడుమ ముగించుస్వరము అపన్యాసము)

కార్మారవ్యాంచసైషాద్యా మాంధ్రీ మధ్యమ యోస్తథా
ఆర్షభ్యాంచ స్వరాయేఽం శాస్తే అపన్యాసాః పరికీర్తితాః

కార్మారవి సైషాదీ ఆంధ్రీ మధ్యమలయందును ఆర్షభి యందున్న యంశ స్వరములె అపన్యాసములుగాఁ జెప్పఁబడెను.

ఉదీచ్యవానాంత్రితయేఽపన్యాసౌ షడ్జధైవతౌ
మధ్యమోరక్తగాంధార్యాం గాంధార్యాం షడ్జపంచమౌ
సరిసాః షడ్జకైశిక్యాం పంచమ్యాం నిరిపాః స్మృతాః

1 షడ్జోదీచ్యవ 2 గాంధారోదీచ్యవా 3 మధ్యమో దీచ్యవా వీనిలో సధలు అపన్యాసములు.

రక్తగాంధారిలో మయును, గాంధారిలో సపలును షడ్జ, కైశికియందు సరిపలును పంచమిలో సిరిపలును అపన్యాసములు.

రిపౌ గాంధార పంచమ్యాం షాడ్జ్యాం గాంధారపంచమౌ
ధైవత్యాం రిధమాః ప్రోక్తానందయంత్యాం మపౌమతౌ

గాంధార పంచమిలో రిపలును, షాడ్జియందు గధలును ధైవతిలో రిధమలును, నందయంతిలో మపలును అపన్యాసములు.

రివర్జ్యాః షడ్జకైశిక్యాం సప్తాపీత్యూచిరేపరే
సప్తస్వరాపన్యా సాంతు భాషంతౌ షడ్జమధ్యమాం

షడ్జ కైశికిలో రి గాక మిగిలిన అనఁగా సగమప దనిలు అపన్యాసము అని కొందఱన్నారు. షడ్జమధ్యమలో స్వరములన్నియు అపన్యాసములందురు. ఇందున్న అంశములన్నియు అపన్యాసములే యగును.

అత్రయేఽంశా అపన్యాసాస్తేస్యురేకోన వింశతిః
సప్తత్రింశత్ పరే తేచ, షట్పంచాసత్తు సంయుతాః
కైశిక్యాం సప్తపక్షేత్యా సప్తచందాశతం విదుః

ఇందు అంశములు 19 అనియు, కొందఱు 37 అనియు కొందఱు 56 అనియు నందురు. కైశికిలో ఏడు అపన్యాసములు అను పక్షములో 57 అనియు నందురు.

## సంన్యాసము

అంశావివాదీ గీతస్యాద్య విదారీ సమాప్తికృత్
సన్యాసోంఽశావివాద్యేవ విన్యాసః సతుకథ్యతే
యోవిదారీ భాగరూప పదప్రాంతేఽవతిష్ఠతే।

అంశమునకు (అనివాదియై) అవిరోధియై యనఁగా సంవాదియై (ఆద్య విదారీ) రాగము పాడునపుడు ఖండఖండలుగా విభజించినపుడు ఒక్కొకక్క లేక ప్రథమ ఖండమును సమాప్తముచేయునది సంన్యాసము.

విన్యాసము :— అంశమునకు అవివాదిగానే విన్యాసముండును. గీతి ఖండ భాగరూప పదము దగ్గరనుండునది విన్యాసము. రాగఖండములలో రాగకళలను జూపుటకై మాటిమాటికి వచ్చుస్వరము.

## బహుత్వము

అలంఘనా త్తథాఽభ్యాసాద్ బహుత్వం వివిధంమతం
వర్యాయాంశే స్థితం తచ్చ వాది విసంవాదినో రపి

ఈషత్స్పర్శస్వరమునకు స్వస్థాన ప్రియత్న స్వరూప న్యూనత్వము లంఘనము అదిలేనిది అలంఘనము. సాకల్యముగా స్పర్శగలిగి యుండుట యని భావము. అట్టి సాకల్య స్పర్శవల్లగాని అభ్యాసమువల్ల [నైరంతరోచ్చారణమువల్ల]గాని బహుత్వము బహులత్వము వాది. భూతాంశకంటె వ్యతిరేకమైన యంశమందు వాది సంవాదులకును స్థితిని ప్రయోగింపవలెను.

## అల్పత్వము

అల్పత్వంచ ద్విధాప్రోక్త మనభ్యాసాచ్చలంఘనాత్
అనభ్యాసస్త్వనం శేషుప్రాయో లోపోప్యేష్వపీక్ష్యతే ।

అభ్యాసము ఆవృత్తి లేకపోవుటవలన స్వరములను దాటవేయుట వలనను స్వరముల అల్పోచ్చారణ అల్పత్వము. వాది పర్యాయములగు నంశోభయవ్యతిరిక్తములగు స్వరము లందు లోపింపఁదగిన షాడవౌడములం దైతే అనభ్యాసము ఆవృత్తి లేకపోవుట యిష్టమే. మిగిలినచోట్ల యిష్టము గాదు.

## షాడవము

ఈషత్స్పర్శోలంఘనంస్యాత్ ప్రాయ స్తల్లోప్యగోచరం
ఉశంతి తదనంశేపి క్వచిద్గీత విశారదాః

లంఘనమనగా ఈషత్స్పర్శము.

## అంతరమార్గము

న్యాసాది స్థాన-ము జ్ఝిత్వా మధ్యే మధ్యేఽల్పతాయుజాం
స్వరాణాంయా విచిత్రిత్వకారిణ్యంశాది సంగతిః
అనభ్యాసైః క్వచిత్ప్రాపిలంఘనై రేవకేవలైః
కృతాసాంతర మార్గః స్యాత్ప్రాయో వికృతజాతిషు

న్యాసాపన్యాస విన్యాస సంన్యాస గ్రహాంశలయొక్క స్థానమును అనగా గీతములోని చివరి ప్రదేశాదులను విడిచి పైనిజెప్పిన న్యాసాదులు రెండేసి మధ్యయందు అల్పములుగా నున్న స్వరముల యంశాది సంగతిని ఆరోహావరోహణలలో సంఘట్టన ఏదికలదో అది స్వరసముదాయ రూపమైన వైచిత్ర్యమును జేసినదగునో అది కొన్నిచోట్ల కేవలానభ్యాసముల చేతను కొన్నిచోట్ల లంఘనములచేతనే తత్తద్గీత రక్తవశమువల్ల పుట్టింపఁబడినది అంతరమార్గము. అదియు వికృతజాతులందుఁ బ్రాయికమై యుండును. శుద్ధజాతులందైతే కాదాచిత్కమై యుండును.

షడవంతి ప్రయోగం యేస్వరాస్తే షాడవామతాః
షట్స్వరంతేషు జాతత్వాద్గీతం షాడవముచ్యతే

(షట్ అవంతి) ఏస్వరము లారును ప్రయోగమునుగాని జాత్యాదులను షట్-ఆరుస్వరములు అనంతి-రక్షించుచున్నవో అనగా ప్రవర్తింప జేయుచున్నవో అవి షాడవములు. [షడవములందు అయినవి షాడవములు.] ఏడు స్వరములలోను లక్షణమునుబట్టి ఒకస్వరము విడువఁబడగా మిగిలిన ఆరు స్వర ప్రపంచమునుబట్టి బయులుదేఱిన గీతము షాడవమని భావము.

## ఔడవితము

వాంతియాత్యుడవోఽత్రేతికెౢ్యమోక్తముడువం బుధైః
పంచమంతచ్చ భూతేషు పంచ సంఖ్యాతదుద్భవా

వాంతి-వీచునవి అనగా యాంతిచరించును ఉడు-నక్షత్రములు ఇచ్చట గాబట్టి యుడువం అనగా ఆకాశము అర్థము. కాబట్టి యుడవమనగా లక్షణ చేత అయిదు సంఖ్య అర్థము. ఇట్లే యుడవమనగా అయిదుగా పుట్టినది.

ఔడువీసాఽస్తి యేషాంచస్వరాస్తేత్వౌడువా మతాః
తేషుజాతంతుయద్గీతం తదౌడువిత ముచ్యతే

ఆయయిదును ఆశ్రయించినది ఔడువి. ఏస్వరములకు అయిదుసంఖ్య యుండునో అవి ఔడవములయినవి. ఆయయిదు స్వరములందు బయలు దేఱినగీతము ఔడువితము.

తత్సంబంధాదౌడువంచ పంచస్వర మిదం విదుః

దాని సంబంధము వలన అయిదు స్వరముల గీతము ఔడవమని యందురు.

క్రమాదల్పాల్పతరతే షాడఔడువకరిణౌ
సంపూర్ణత్వ దశాయాం స్తః పంచమ్యాంతు విపర్యయః

క్రమముగా అల్పతయు (అనభ్యాసమును) అల్పతరతయు [లంఘనమును] షాడవమును అల్పతయు ఔడువమును అల్పతరతయును జేయునవి సంపూర్ణదశలో పంచమియందైతే విపర్యయముండును. అనగా అవస్థాత్రయముగల పంచమికి పూర్ణత్వలక్షణములో "సగమాః స్వల్పకాః మతాః" సగమలుస్వల్పములైనవి. అనిచెప్పబోవువాక్యముచే షడ్జమధ్యములను షాడవౌడువములుగఁ జేయకపోవుటవలన ప్రాప్తింపకపోగా క్రమముగా గ తోను నిగల తోను షాడరౌడువిత్వముగలుగు ననుటవల్ల షాడవమును గాని జేయుటవల్ల గాంధారమునందు ప్రాప్తింపగాను గలిపి మూడిటికి అల్పత్వముచెప్పుటచే నిషాదములోఁ గూడ ఔడవకారిత్వము.

వచనం విధి రప్రాప్తౌ విహాల్పత్వ బహుత్వయోః

ఇట్లు అల్పత్వ బహుత్వములు ప్రాప్తించకపోగా చెప్పుటయే విధానమగుచున్నది.

పరిసంఖ్యా ద్వయోః ప్రాప్తావేకస్యాతిశయాయతత్.

షాడవౌడువా కారులయిన గాంధార నిషాదములు [నిగ] రెండింటికి అల్పత్వ ధర్మము ప్రాప్తింపగా ఆరెండిటిలో ఒకదానియొక్క యతిశయము కొఱకు అల్పత్వవచనము పరిసంఖ్య యుదాహరణము. అగుచున్నది. పరిసంఖ్యకు ఇతరపరివర్జనము ఫలముగాన ఇక్కడఁగూడ నిషాదము అల్పమగుటవల్ల నిషేధించుట ఫలము.

అథ ప్రత్యేకమేతాసాం జాతీనాం లక్ష్మ కథ్యతే
షాడ్జ్యామంశాః స్వరాః పంచ నిషాదర్షభవర్జితాః
నిలోపాత్ షాడవంసోఽత్ర పూర్ణత్వే కాకలీక్వచిత్

మఱియొక్కొక్కదానికి ఈజాతులకు లక్షణము చెప్పఁబడుచున్నది వానిలో నిరి తక్క సగమపధలు అంశలు. అవి పర్యాయముగా వాదులు గ్రహములును అగును. నిలోపమువల్ల షాడవమును ఇక్కడ పూర్ణత్వములో ఒక్కచోట షడ్జము వాదికాఁగా వికృతదశలో కాకలి [కాకలి నిషాదము] అగును.

సగయోః సధయోశ్చాత్ర సంగతిర్బహుళస్తుగః
గాంధారాంశే న నేర్లోపో మూర్ఛనాధైవతాదికా

సగలకు సధలకును ఒక స్వరము వ్యవధానము గలుగునట్లు సగ సగ సధ అని గస గస ధస అని గాని రక్తి సంబంధము చేయవలెను. గ అయితే బహుళముగా నుండును. గాంధారాంశములో ని కి లోపములేదు. కాన ఈ నిషేధములో పూర్ణావస్థయే యుండును. పమ పద అన్నది ఔడవము. ఇది షడ్జగ్రామములోనిది గాన మూర్ఛనధైవతము నుండి కలుగును మరి యుత్తరాయత మూర్ఛనయైతే మధ్యగ్రామములోనిది పౌరవి.

## జాతులలో మూర్ఛనాదులు

| జాతి | గ్రామము | మూర్ఛన | అంశము | అపన్యాసము |
|---|---|---|---|---|
| 1. షాడ్జి | షడ్జగ్రామ | ధైవతాది | సగమపధ | గప |
| 2. ఆర్షభి | షడ్జగ్రామ | పంచమాది | రిధని | రిధని |
| 3. గాంధారి | మధ్యమగ్రామ | పంచమాది | సగమపని | సప |
| 4. మధ్యమ | మధ్యమగ్రామ | ఋషభాదిమూర్ఛన | సరిగమపధ | సరిమపధ |
| 5. పంచమి | మధ్యమగ్రామ | ఋషభాదిమూర్ఛన | రిప | రిపని |
| 6. ధైవత | షడ్జగ్రామ | ఋషభాదిమూర్ఛన | రిధ | రిమధ |
| 7. షడ్జకైశిక | షడ్జగ్రామ | షడ్జాదిమూర్ఛన | నిరిగ | నిరిగ |
| 8. నైషాది | షడ్జగ్రామ | గాంధారాది | సగప | సపని |
| 9. షడ్జోదీచ్యవ | షడ్జగ్రామ | గాంధారాది | సగమధని | సధ |
| 10. షడ్జమధ్యమ | షడ్జగ్రామ | మధ్యమాది | సరిగమపధని | సరిగమపధని |
| 11. గాంధారోదీచ్యవ | మధ్యమగ్రామ | ధైవతాది | సమ | సధ |
| 12. రక్తగాంధారి | మధ్యమగ్రామ | ఋషభాది | సగమపని | సగమపధని |
| 13. కైశిక | మధ్యమగ్రామ | గాంధారాది | సగమపదని | సగమపధని |
| 14. మధ్యమోదీచ్యవ | మధ్యమగ్రామ | మధ్యమాది | ప | సధ |
| 15. కార్మారవి | | | రిపదని | రిపధని |
| 16. గాంధారపంచమి | మధ్యమగ్రామ | గాంధారాది | ప | రిప |
| 17. ఆంధ్రీ | మధ్యమగ్రామ | మధ్యమాది | రిగపని | రిగపని |
| 18. నంద | మధ్యమగ్రామ | పంచమాది | ప | మప |

## న్యాస స్వరముల విధి

1. షాడ్జి మొదలైనవానికి వానివాని మొదటిస్వరములు న్యాసములు.
2. షడ్జకైశికి, రక్తగాంధారి, గాంధారపంచమి ఆంధ్రి నందయంతులకు గాంధారము న్యాసస్వరము
3. షడ్జోదీచ్యవ గాంధారోదీచ్యవ మధ్యమోదీచ్యవ వీనికి మధ్యమము న్యాసస్వరము.
4. కార్మారవికి పంచమము న్యాసస్వరము.
5. షడ్జమధ్యమకు సములు న్యాసస్వరములు.
6. కైశికికి గ, ప, నిలు న్యాసస్వరములు.

## జాతులలో షాడవ ఔడవలోపి స్వరముల పట్టిక

| జాతి | షాడవలోపి స్వరము | ఔడవలోపి స్వరము | రసము |
|---|---|---|---|
| 1. షాడ్జి | ని | | వీరఅద్భుతరౌద్ర |
| 2. ఆర్షభి | స | సప | వీరఅద్భుతరౌద్ర |
| 3. గాంధారి | రి | రిధ | కరుణ |
| 4. మధ్యమ | గ | గని | శృంగారహాస్య |
| 5. పంచమి | గ | గని | శృంగారహాస్య |
| 6 ధైవతి | ప | సప | భీభత్సభయానక |
| 7. నైషాది | ప | మప | |
| 8. షడ్జకైశిక | – | – | భీభత్సభయానక |
| 9. షడ్జోదీచ్యవ | రి | రిప | శృంగార, హాస్య |
| 10. షడ్జమధ్యమ | ని | గని | శృంగారము, హాస్య |
| 11. గాంధారోదీచ్యవ | రి | — | (సర్వరస) వీరరౌద్ర |
| 12. రక్తగాంధారి | రి | రిధ | కరుణ |
| 13. కైశిక | రి | రిధ | భీభత్సభయానక |
| 14. మధ్యమోదీచ్యవ | – | – | వీరరౌద్ర |
| 15. కార్మారవి | – | = | అద్భుత |
| 16. గాంధారపంచమి | – | – | భీభత్సభయానక |
| 17. ఆంధ్రి | స | = | అద్భుత |
| 18. నందయంతి | – | – | శృంగారహాస్య |

ఆదికాలపు తాళములు ఆరు

| | |
|---|---|
| 1. చచ్చత్పుటము | 8 అక్షరములు |
| 2. చాచపుటము | 6 అక్షరములు |
| 3. షట్పితా పుత్రకము | 12 అక్షరములు |
| 4. సంపద్వేష్టాంకము | 12 అక్షరములు |
| 5. పంచపాణి | 12 అక్షరములు |
| 6. ఉద్ఘట్టము | 6 అక్షరములు |

త్రిధా తాలః పంచపాణిరత్ర చైకకలాదికః
క్రమాన్మార్గాశ్చిత్రవృత్తదక్షిణాః గీతయః పునః
మాగదీసంభావితా చపృథులేతిక్రమాదిమాః

1 ఏకకల 2 ద్వికల 3 చతుష్కల 4 అని పంచపాణి అను తాళములు మూడురకములు. దీనిలో చిత్రము వృత్తి దక్షిణ అని మార్గములు మూడు. మరల గీతులు మాగధి సంభావిత పృథుల అని మూడు. వీనివివరము తాళాధ్యాయములో తెలుపబడును.

నైష్క్రామిక ధ్రువాయాంచ ప్రథమేప్రేక్షణేస్మృతః
వినియోగో ద్వాదశాత్రకలా అష్టలఘుః కలాః

ఛందోవృత్తివిధానమును బట్టి ముఖ ప్రముఖాదులు అంతట గీతాంగ ములే. నాటకములో తత్స్వరూపమైనవే ధ్రువలనఁగా, వీనిలో ప్రావేశికి, ఆక్షేపికి ప్రాసాదికీ అంతరాధ్రువా నైష్క్రామికి అనిధ్రువలు అయిదు. ప్రవేశాద్యర్థములను సూచించునవిగాన ధ్రువలని అన్వర్థకము. నాటకాదుల ప్రథమాంకమందు నైష్క్రామిక ధ్రువయందు వినియోగము భరతాదులచేఁ జెప్పఁబడినది. ఈషాడ్జియందు 12 కలలు ఉండును. పంచపాణి అను తాళములో 12 కలలు ఉండును. ఎనిమిది లఘ్వక్షర పరిమితకాలముకలవి కలలు.

## జాతి స్వరాదులు

| జాతి | స్వరము | ప్రయోగము | అశాతి | తాళము | అంక | ధ్రువలో |
|---|---|---|---|---|---|---|
| 1 షాడ్జి | కాకలి | షగ,సధ కలిసి | గ నిలో పములేద్దు | పరిబంధము లోపంచపాణి చిత్రవృత్తి దక్షిణ మార్గము 4?, 4, 8 మాతలు | 1 | నైష్క్రామిక |
| 2 ఆర్షభి | పంచమ | గ,నిల బహుళ | ప(అల్ప)ప లంఘనము | కళలు12 చచ్చత్పుటము 8 గళలు 8 | 2 | నైష్క్రామిక దేశి అధికరి చాయలు ధ్రువాగానము |
| 3 గాంధారి | న్యాస, అంశము లతో ఇతర స్వరములు | రిధలు (కలిసి) | ప(పూర్ణ, ని,స,మ, పూర్ణషాడవ | చచ్చత్పుట కళలు 16 | 3 | గాంధారపంచమి, దేశి వేళావతి రాగ చ్ఛాయ |
| 4 మధ్యమ | షడ్జమధ్యమ బహుళ | అంతర, కాలిక | గ,నిలు అల్ప స్వరములు | చచ్చత్పుట కళ 8 | 2 | ధ్రువాగానం శుద్ధ, షాడవ దేశిఆంధాళి చ్ఛాయలు |
| 5 పంచమి | సగ, మ అల్ప స్వరములు | రిమ, గని [కలిపి] | అంతర కాకలి ఋషభ ఆరు పూర్ణ షాడవ | చచ్చత్పుట కళలు 8 | 3 | ధ్రువాగానిలో శుద్ధపంచమ దేశి ఆంధాళి రాగచ్ఛాయలు |

| జాతి | స్వరము | ప్రయోగము | అంశలు | తాళము | అంక ధ్రువలో |
|---|---|---|---|---|---|
| 6 ధైవతి | ఆరోహ ణలో షడ్జ పంచమలు వర్జ్యాలు | రిధ బహుళ | మార్గగీతి ప్రయోగ | పంచపాణి కళ 12 | శుద్ధకైశికి దేశి సింహళ ఆదిచ్ఛాయలు |
| 7 నైషాది | సమపధ అల్ప | నిరిధ బహుళ | వినియోగ షాడ్జి | చచ్చత్పు కళలు 16 | శుద్ధ సాధారణ దేశకళావతి |
| 8 షడ్జకైశిక | రిమ అల్పత్వ | ధని బహుళ | | చచ్చత్పుట కళలు 16 | 2 ఆది. ప్రవేశికి గాంధారపం చమి హిందోళ దేశి కళావతి ఛాయలు |
| 9 షడ్జోదీచ్యవ | స,మని,గ రెండేసి కలిపి | మ, గ బహుళ స,రి అతి బహుళ స్వరము | ని,గ,[నిఅ ల్పముకాదు | షాడ్జివతి కళలు 12 | 2 ధ్రువాగాన |
| 10 షడ్జమధ్యమ | సరిగమ ధని | రెండేసి కలిసి | అంతర,కాకలి ని[అల్పత్వ] గ లేనపుడు షాడవ ఔడవ ములలో నిషాద లోపము. షాడవ ఔడవ ములలోనిషాద ము వివాది స్వరము | గీత,తాళ ము షాడ్జివలె కళలు !2 | 2 ధ్రువాగానం |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 | గాంధారో<br>దీచ్యవ | పూర్ణము | అంశము<br>గాక<br>మిగిలిన<br>స్వర<br>ములుఅల్పము | షాడవములో<br>ని,ద,ప, గ<br>[అల్పత్వ రిద<br>లు [కలిసి ] | చచ్చత్పుట<br>కళలు 16.<br>తాళగీతులు | 4 ధ్రువాగానం |
| 12 | రక్తగాం<br>ధారి | స,గలో<br>[కలిసి] | ధ నిలు<br>[బహుళ] | | షాడ్జీవలె<br>కళలు 12 | 2 ధ్రువాగానం |
| 13 | కైశిక | నిప బహుళ<br>సగమపదని రి అల్పము<br>రెండేసికలిసి | | నిధ అంశ<br>ప న్యాస<br>ము ని,గ<br>అంశలైతే<br>నిగపలు<br>న్యాసము<br>వలెను. | షాడ్జివలె<br>కళలు 12 | వ ధ్రువాగానం<br>5 ధ్రువాగానం |
| 14 | మధ్యమో<br>దీచ్యవ | గాంధారో<br>దీచ్యవవలె | | | చచ్ఛతుట<br>కళలు 16 | 4 ధ్రువాగానం |
| 15 | కార్మారవి | అంశములు<br>గానివి | అంతర గ బహుళ<br>మార్గము<br>(బహుళ)<br>రెండేసి<br>కలిసి | | చచ్చత్పుట<br>కళలు 16 | 5 ధ్రువాగానం |
| 16 | గాంధార<br>పంచమి | గాంధారి<br>పంచమిలవలె | | | చచ్చత్పుట<br>కళలు 16 | 4 ధ్రువాగానం |
| 17 | ఆంధ్రి | రి,గ,గ,ధ<br>నిలు కలిపి అంశమునుండి<br>ప్రయోగము న్యాసము గాంధార | వరకు క్రమ పంచమి<br>సంచారము వలె | | | |
| 18 | నందయంతి | గాంధారం మంద్ర<br>న్యాసము ఋషభ | బహుళము | | చచ్చత్పుట<br>కళలు 22 | 1 ధ్రువాగానం |

## నేటి సంప్రదాయములోని గీతములు మచ్చుకు

రచన : పురందరదాసు.

### మలహరిరాగము రూపకతాళము సరిమదస సదపమగరిస

మప దససరి రిస దపమప రిమ పద మప దప మగరిస
శ్రీ ఐ గణనాథ సింధు రా వర్ణ కరుణాసాగరా కరి వద – న
సా రిమగరి సరి గరిసా రిమ పదమప దప మగరిస
లంబోదర లకి మికరా అం బఅసుత అమ ర వినుత
మప దససరి రిస దపమప రిమ పదమప దప మగరిస
సిద్ధ చారణ గణ సేవిత సిద్ధి వినాయక తే నమొ నమొ। లం॥
సకల విద్యా ఆది పూజిత స ర్వో త్తమ తే నమొ నమొ। లం॥

### మలహరి రూపకము పురందదాసు

దప మగరిస రిమపదమప దరిరి సదప ధప మగరిస
కుంద గౌ. ర గౌరి . . . వర మందిరాయ మాన మకుట
సా రీ రీ దప మగరిస సరి మాగరి సరి గరిసా
మందారా కుసు మాకర మక రందం వా - సితువా
దప మగరిస రిమపదమప ధరిరిస దపధప మగరిస
హేమ కూట సింహాసన విరుపాక్ష కరుణా కర। కుంద
చందమామ మందాకిని మందిరాయ మాన మకుట। కుంద॥

మోహనరాగము – రూపకతాళము సరిగ పదస దపగరిస

గగ పాపా దప సాసా రిసదదపా దప గగరీ
వర వీణా మృదుపాణీ వన రుహలో చన రా–ణీ
గప దసదా దప గగరీ గగ దపగా పగ గరిసా
సురు చిత బం భర వే–ణీ సుర నుత కళ్యా అణీ
గగ గగరిగ సగ పాపా గగ దపధా దప సాసా
నిరు పమశుభ గుణ లోలా నిర తజయ ప్రద శీలా
దగ రి రి స స దస దదదప గప దసదప దప గగరిస
వర దాపిప్రియ రంగ నా యకీ వాం ఛిత ఫల దాయకీ
సరి గాగా గరి పగరీ సరి సగరిస
శర సీజా సన జననీ జయ జయజయ

నాటరాగము – ఏకతాళము

సరిగమపదనిస సనిదపమగరిస

స స స ని స స స ని ప మ ప మ స స స ని
అ మరీ క బరీ ధార భ్రమరీ
సనిసరి స స సా స ని స రి మ రి స రి
ముఖరీ కృతం ధూరీ కరోతు
స స స ని స ని స ని ప స ని ప మమరిస
దురితం గౌరి చరణ పంకజం

నేటి సంప్రదాయములో వాడబడిన తాళములు, సులభముగా తెలియుటకు చెప్పబడుచున్నవి.

ధ్రువో మఠ్యో రూపకశ్చ ఝంపా త్రిపుట ఏవచ
అటతాళైక తాళేచ సప్తతాళాః ప్రకీర్తితాః

ధ్రువ మఠ్య రూపక, జంపె, త్రిపుట, అట, ఏకతాళము అని తాళములు నేడు ప్రచారములోనున్నవి. ఈ తాళములు ఈ క్రింది గుర్తులచే అంగసంజ్ఞలచే తెలిసికొనవలయును.

అనుద్రుతము ◡ ఇదియొక యక్షరకాలమును తెలుపును.
ద్రుతము 0 ఇది ఇది రెండు అక్షరముల కాలమును తెలుపుట.
లఘువు 1 ఇది నాలుగు అక్షరముల కాలమును తెలుపును.
గురువు 8 ఇది ఎనిమిది అక్షరముల కాలమును తెలుపును.
ప్లుతము 8 ఇది పన్నెండు అక్షరముల కాలమును తెలుపును.
కాకపాదము + ఇది పదునారు అక్షరములకాలము తెలుపును.

తాళజాతులు చతురస్రజాతి 4, అని, త్రిస్ర జాతి 3 అని మిశ్రజాతి 4+3 -7 అని ఖండజాతి 5 సంకీర్ణజాతి 5+4-9 అని అయిదురకములుగా నున్నవి.

## ముప్పది యైదుతాళముల పథకము

| సప్తతాళములు | దెబ్బ | గుర్తులు | చతురస్ర | త్రిశ్ర | మిశ్ర | ఖండ | సంకీర్ణ |
|---|---|---|---|---|---|---|---|
| ధ్రువ | 4 | 1011 | 14 | 23 | 11 | 17 | 29 |
| మఠ్య | 3 | 101 | 10 | 8 | 16 | 12 | 20 |
| రూపక | 2 | 01 | 6 | 5 | 9 | 7 | 11 |
| జంపె | 3 | 1◡0 | 7 | 6 | 10 | 8 | 12 |
| త్రిపుట | 3 | 100 | 8 | 7 | 11 | 9 | 13 |
| అట | 4 | 1100 | 12 | 10 | 18 | 14 | 22 |
| ఏక | 1 | 1 | 4 | 3 | 7 | 5 | 9 |

లఘువున్నచోట దెబ్బ వ్రేళ్ళును, ద్రుతమున్నచోట దెబ్బ ఊసియువేయ వలెను.

ఇందులో చతురస్రజాతిని ఆదితాళమందురు.

త్రిస్రజాతిని త్రిపుటతాళమందురు.

అడ్డతాళములో చతురస్రజాతి, [illegible]+5+2+[illegible]+14 అక్షరములు.

ఏకతాళములో చతురస్రజాతికి 4 అక్షరములు.

చాపునకు 3+4–7 హక్షరములు.

రూపకములో త్ర్యశ్రజాతివగు 2+[illegible]–5 అక్షరములు.

త్రిశ్రజాతి రూపకతాళమును చాపుఅందురు.

ఇవి నేటి సంప్రదాయజ్ఞులు వాడుతాళములు

సంగీతరత్నాకరములో చెప్పబడిన తాళములు ముందు తాళ ప్రకరణములో వివరింపబడును.

చా పు తా ళ ము లో

| | దెబ్బ వేళ్ళు | | దెబ్బ ఊసి | | |
|---|---|---|---|---|---|
| మిశ్రచాపు | 3 | – | 4 | 7 | అక్షరములు. |
| ఖండచాపు | 2 | – | 3 | 5 | ” |
| త్రిశ్రచాపు | 1 | = | 2 | 3 | ” |

– ౦ –

# స్వ ర ప ల్ల వు లు

## ఖమాసురాగము - ఆదితాళము

రచయిత :- శ్రీ మాన్నలాన్ చక్రవర్తుల శ్రీరామాచార్యులు

సమగమ పదనిప సనిదప మగరిస, ని - కాకలి

మొదటి చరణములో ధ, రెండవ చరణములో స. న్యాసము

### ప ల్ల వి

సా ; -; నిద - నీపమ - గామప మా ; - ; సమ గమాప-, దాని॥

### అనుపల్లవి

సా, గ - రీసని - దా, రి - సానిద మా, ని -దాపమ గమాప-, దాని॥ సా

### చరణములు

1. దా; - ; దని-దపమగ-మపమని దా ; - దగ రిసారి - నిరిసని
దా; - ; గమ-పదాని-గరిసని దా ; - సని దా, రి-సనిదని॥ సా

2. సా; - ; సమ-గమ రిగ- సగ రిస నీ ; - ; గిస నిదాప-మపదని
సా, మ - గరిసని-సా, రి-సనిదని సా , ప-దనిసని సా, గ - రీసని
సరిగమ -గగరిస- నిసరిగ-రిరిసని మగారి - సనీద రిసాని-దపదని॥ సా

## కాం భో జి ఆ ది తా ళ ము

సరిగమపదస సనిదపమగరిస

### ప ల్ల వి

1. ; ;- పా
2. ధాసా- ; రీ-గా ; - ; మా గారి-; సా నీ;-ధా/పా
3. ధాసా- : రీ-గా ; - ; మగ రీ/గరి-సారిస నీ;-ధా/పా
ధాసా- ; రీ-గా ; - ; మగ రిగారి-సారిస నీ;-ధా ; ॥

అనుపల్లవి

మనిద/వ-దవ/మవ-మ/గమగ-రిగ_రి గమవమ-గరిసా నీ;-ధా॥ పా
ధాసా-; రీ - గా; - ; మగ రిగారి-సారిస నీ;-ధా ॥

చరణములు

1. మా, గ - మా ; -రిగమగ-మా; పా, మ-పా; గమవద-పా ;
నీ, ద-నీవద-వమగా-మా, మ పావమ - గరిసా నీ;-ధా ॥ పా
ధాసా-; రీ - గా ; - ; మగ రిగారి - సారిస నీ; - ధా ;
2. మనిదని-పదమవ-గదవద-మవగమ రివమవ-గమరిస సమగమ-రిగసరి
మగరిస-వమగరిస-దవమగ-నినిదవ దవమగ-రిగరిస నీ; - ధా ॥ పా
ధాసా-; రీ-గా ; - ; ; ; ; - ; ; ; ; - ; ; ॥

జంఝూటి - ఆదితాళము

ధసరిగమవద దవమగరి సనిదవదవ

పల్లవి

1. మా;-; గా-రీసా-నీధా పా ; - ; ధా సారీ - ; గా
2. మా;-; గా-రీసా-నీధా పా ; - ;/ధస రీ/సరి - గా/రిగ
3. మా;-; గా-రీసా-నీధా పా ; - ;/ధస రిగా/స-రిగమవ

అనుపల్లవి

మా;-పాదా-మా;-పాగా ; మా-రీ ; గాసా-, రిగా॥

చరణములు

1 మా;-;మవ-మమగగ-రిసరిరి గా ;-; సరి ససధవ-ధసరిగ
గా, రి-సా ;-ధా, వ-ధా ; సా, రి - గా ; మగమద-పా ;
పా, ద-నీదా-మా, వ-దాపా గా, వ-మాగా మమగగ-రిసరిగ॥ మా
2. సారిగ-మామా-వమగరి-గాగా రిసరిగ-సాసా ధసరిమ-గాగా
మనిదని-పాద/మ-, వ/గవ-మగరిస రిగమవ-మగమ, గరిగ-,సరిగ॥[మా]
2. మవదా-దాదా-వదనీ-నీనీ దనిదమ-; వదవ గమాగ - రిసరిగ
మవదా-దా/వమ-నిదనివ-, మా/ద పాదమ -; వమ గా/మగ - రీదవ
మాగరి-సానిధ-పాధస-రిగాస రిగమవ-మా; మమగగ - రిసరిగ॥ మా

1. షాడ్జీ తాళము, చచ్చత్పుటము :—

దీనిలో నిరిలుగాక మిగిలినసగమపధలు అంసములు. నిలోపించిన షాడవము. పూర్ణత్వములో ఒకపుడు కాకలి. సగలకు, సధలకు సంబంధముండును· గ బహుళముగ. గాంధారాంశలోనికి లోపములేదు. ధనుండి మూర్ఛన. నాటకములో 1వ యంకములు నై ష్క్రామిక ధ్రువలో వినియోగం కళలు 12. లక్షణము ఇందులో షడ్జము—న్యాసము గాంధారపంచమముల అపన్యాసములు.

వరాటి=వికృతావస్థలో కాకలీ ప్రయోగమున్నపుడు వరాటితోఁచును.

సాహిత్యము

తం భవలలాటనయనాంబుజాధికం నగసూను ప్రణయకేళి సముద్భవం
సరసకృత తిలకపంకాను లేపనం, ప్రణమామి కామదేహంధ నానలల

1 2 3 4 5 6 7 8
ప్రస్తారము సా సా సా సా పా ని ధ పా ధని
తం భవ ల లా ట 1
రి గమ గాగా సా రిగ దస ధా
న యు నాం – బు జా – ధి 2
రిగ సారి గాగా సా సా సా 3
కం – – – – – . .
దా దా నిద ని స ని ద పా సా సా 4
న గ సూ – ను ప్ర ణ యు
నీ దా వా దని రి గా సా గా 5
కే – ళి – స ము – ద్భ
సా దా దని పా సా సా సా సా 6
వం – – – – – – –
సా సా గా సా మా మా మా మా 7
స ర స కృ త తి ల క

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| సా | పస | మా | దని | ద | పా | గా | రిగ | 8 |
| పం | – | – | కా | ను | లే | ప | – | |
| గా | గా | గా | గా | సా | సా | సా | సా | 9 |
| నం | – | – | – | – | – | – | – | |
| దా | సా | రీ | గరి | సా | మా | మా | మా | 10 |
| ప్ర | ణ | మా | – | మి | కా | – | మ | |
| దా | నీ | పా | ధని | రీ | గా | రీ | సా | 11 |
| దే | – | హేం | – | ద | నా | – | న | |
| రిగ | సా | రీ | గా | సా | సా | సా | సా | 12 |
| లం | – | – | – | – | – | – | – 12 కళలు. | |

## ఆర్షభి (షడ్జగ్రామములు)

దీనిలో నిరిధలు అంశములు. గ్రహములును, గనిలకు సరిమపదలతో సంబంధము. గనిలకు బహుత్వము, సరిమపదలకు అల్పత్వము, పమ లంఘనము –అల్పతరత్వము. షడ్జలోపముచే షాడవము, సపల లోపముచే ఔడవము. వ మొదలుకొని మూర్ఛన, చచత్పుటము తాళము. కళలు 8. వినియోగము పూర్వమువలె దీనిలో రి న్యాసము. అంశమువలె అపన్యాసములు. దేశిమధు కరులు కనిపించును. దేశిమధుకరులు సదృశరాగములు గనుక ఋషభాంగముగా ప్రస్తుతమైన ఆర్షభిని గానము చేయుటలో దేశిమధుకరులు ప్రతీయమానమగును.

2. ఆర్షభీ:– [షడ్జగ్రామము] తాళము చచ్చత్పుటము. సాహిత్యము–

గుణలోచనాధిక మనంతమమరమజర మక్షయ మజేయం
ప్రణమామి దివ్యమణి దర్పణామల నికేతం భవమమేయం

ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రీ | గా | సా | రిగ | మా | రిమ | గా | రిరి | 1 |
| గు | ణ | లో | – | చ | నా | – | ధి | |
| రీ | రీ | నిన | నిద | గా | రిమ | మా | పని | 2 |
| క | మ | నం | – | త | మ | మ | ర | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మా | పా | నీ | దా | పా | పా | సా | గా | 3 |
| మ | జ | ర | మ | – | – | క్ష | య | |
| నీ | ధని | రీ | గరి | పద | గరి | రీ | రీ | 4 |
| మ | జే | – | – | – | – | యం | – | |
| రీ | మా | గరి | సద | సస | రిస | రిగ | మమ | 5 |
| వ్రి | ణ | – | మా | – | – | మి | దివ్య | |
| నిధ | పా | రీ | రీ | రిప | గరి | సధ | సా | 6 |
| మ | ణి | ద | – | ర్ప | ణా | – | మ | |
| రిస | రిప | రిగ | రిగ | మా | మా | మా | గరి | 7 |
| ల | ని | కే | – | – | – | తం | – | |
| పా | నీ | నీ | మగ | రీ | సద | గరి | గరి | 8 |
| భ | వ | మ | మే | – | – | – | యం | |

## 6. గాంధారి.

[మధ్యమగ్రామము] తాళము చచ్చత్పుటము

దీనిలో రిధలు కాక సగమనిలు అంశములు గ్రహములును. న్యాసమైన గతోను, అంశములైన గమపధనిలలో ఏదోయొకదానితోను వీనికంటె నితరములైన పర్యాయముగా అంశరూపము అనంశరూపములయిన వానికి సంగతియుండును. పూర్ణావస్థలో ఒక్కపుడు దరిలకు సంగతికలుగును. రి, నిల లోపమువల్ల షాడవౌడవములు క్రమముగానగును. పంచమము షాడవద్వేషి అనగా ఎపుడు పంచమము అంశముఅగునో అపుడు సంపూర్ణావస్థయె. నిసమలు ఎప్పుడు యంశములగునో అపుడు సంపూర్ణషాడవావస్థలు రెండుఅగును. దీనినిబట్టి గాంధారముయొక్క సంగములేనపుడు ఈమూడు అవస్థలుగలుగును. దీనినిబట్టి పంచమము షాడవద్వేషి అంశలు నిసపమలు అగునని భావము. అంశలు ఔడవితమును ద్వేషించునన్న సంగతి రక్తగాంధారియందుఁ జెప్పబడును. కళలు 8 ధైవతము మొదలుకొని మూర్ఛన. తాళము చచ్చత్పుటము. ధ్రువాగానమునందు మూఁడవ యంకమందు వినియోగము. ఈ గాంధారిలో గ న్యాసము. సపలు అపన్యాసములు. గాంధారిపంచమ, దేశీ వేళావలులు కనుపుట్టుచున్నవి.

ఏతం రజని వధూముఖ విభ్రమపదం, నిశామయవరోరుం
తవముఖ విలాస వపుశ్చారు మమల మృదుకిరణ మమృతభవం
రజతగిరిశిఖర మణిశకల శంఖవరయువతి

దంతపంక్తినిభం, ప్రణమామి ప్రణయరతికలహ రవ తుదం శశినం।

ప్రస్తారము :

గా గా సా నీ సా గా గా గా 1
ఏ - - - తం - - .
గా గమ పా పా ధప మా నిధ నిస 2
ర జ నీ వ ధూ - ము ఖ
నిధ పని మా మపరి గా గా గా గా 3
వి - - భ్ర మ - దం .
గా గమ పా పాదప మా నిధ నిస 4
ని శా మ య వ రో - రు
నిధ పని మా మపరి మా గా మా సా 5
త వ ము ఖ వి లా - సం
గా సా గా గా గా గమ గా గా 6
వ పు శ్చా రు - మ మ ల
గా గమ పా పా దప మా నిధ నిస 7
మృ దు కి ర ణ - - -
నిధ పని మ మపరి గా గా గా గా 8
మ మృ త భ వం - . .
రీ గా మా పద రీ గా సా సా 9
ర జ త గి రి శి ఖ ర
నీ నీ నీ నీ నీ నీ నీ నీ 10
మ ణి శం క ల శ - ఖ
గా గమ పా పా ధప మ నిధ నిస 11
వ ర యు వ తి దం - త

నిధ పని మా మప రిగా గా గా గా గా 12
పం – క్తి ని భం . – . –
నీ నీ పా నీ గా మా గా సా 13
ప్ర ణ మా – మి ప్ర ణ య
గ గా సా గా గా గా గమ గా గా 14
ర తి క ల హ ర వ ను
గా పా మా మా నిద నిస నిధ పని 15
దం – – – – = – –
మా ప రిగ గా గా గా గా గా గా 16
శ శి – – – వం – –

4 మధ్యమా. [మధ్యమగ్రామము] తాళము చచ్చత్పుటము.

దీనిలో గనిలు లేవు. సరిమపదలు అంశములు గ్రహములును. సపలును బహుళము. గ స్వల్పము. గ లోపించిన షాడవము నిగల లోపముచే ఔడవము. కళలు 8. రి మొదలుకొని మూర్ఛన. తాళము చచ్చత్పుటము. ధ్రువాగానమున రెండవయంకమున వినియోగము.

దీనిలో మధ్యమము న్యాసము. అంశములే అపన్యాసములు. చోక్ష షాడవదేశి ఆంధాళులు కనిపించును.

సా హి త్య ము

పాతుభవమూర్ధ జాననం కిరీట మణిదర్పణం
గౌరీకర పల్లవాంగుళిసుతేజితం సుకిరణం

ప్ర స్తా ర ము

మా మా మా మా పాధని నీ ధప 1
పా – – తు భ వ మూ –
మా పమ మా సా మా గా రీ రీ 2
ర్ధ జా – = న నం – –

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పా | మా | రిమ | గమ | మా | మా | మా | మా | 3 |
| కి | రీ | టం | – | – | – | – | – | |
| మా | నిధ | నిస | నిధ | పమ | పధ | మా | మా | 4 |
| మ | ణి | ద | – | ర్ప | – | ణం | – | |
| నీ | నీ | రీ | రీ | నీ | రి | రి | పా | 5 |
| గౌ | – | రీ | – | క | ర | ప | – | |
| నీ | మప | మా | మా | సా | సా | సా | సా | 6 |
| ల్లి | వాం | – | – | గు | లి | – | సు | |
| గా | నీ | సా | గా | ధప | సా | ధని | సా | 7 |
| తే | – | – | – | – | – | జి | తం | |
| పా | సా | పా | నిధ | పమా | మా | మా | మా | 8 |
| సు | కి | ర | – | ణం | – | – | – | |

5 పంచమి మధ్యమగ్రామము తాళముచచ్చత్పుటము

దీనిలో రిపలు అంశములు. సగమలు అల్పములు. రిమలకు, గనిలకు పూర్ణత్వములో సంగతిచేయవలెను. గ లేకపోవుటచే షాడవము. నిగలులేక పోవుటచే ఔడువితము. ఋషభము అంశమయి ఔడువత్వమును నిషేధించును కళలు 8 రినుండి మూర్ఛన. మూఁడవ యంకమున ధ్రువగీతి. దీనిలో ప న్యాసము. రిపనిలు అపన్యాసములు. చోక్ష – శుద్ధ పంచమాదేశి ఆంధ్రాళులు కను పట్టుచున్నవి.

ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పా | ధని | నీ | నీ | మా | నీ | మా | పా | 1 |
| హ | ర | మూ | ర్ధ | జా | – | న | | |
| గా | గా | సా | సా | మా | మా | పా | పా | 2 |
| నం | మ | హే | – | శ | మ | మ | ర | |
| పా | పా | దా | నీ | నీ | నీ | గా | సా | 3 |
| ప | తి | బా | – | హు | స్తం | – | భ | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పా | మా | ధా | నీ | నిధ | పా | పా | పా | 4 |
| న | మ | నం | – | తం | – | – | – | |
| పా | సా | రీ | రీ | రీ | రీ | రీ | రీ | 5 |
| ప్ర | ణ | మా | – | మి | పు | రు | ష | |
| మా | నిగ | సా | సధ | నీ | నీ | నీ | నీ | 6 |
| ము | ఖ | వ | ద్మ | – | ల | – | క్ష్మీ | |
| సా | సా | సా | మా | పా | పా | పా | పా | 7 |
| హ | ర | మం | – | బి | కా | – | వ | |
| ధా | మా | ధా | నీ | పా | పా | పా | పా | 8 |
| ని | మ | జే | – | యం | – | – | – | |

6. ధైవతి – [షడ్జగ్రామము] తాళము-మార్గము – గీతి.

రిధలు అంశములు సపలు పూర్ణావస్థలో అల్పతరములు. ఆరోహణా వరోహణలు గలవి. ఆరోహణలో అల్పములేకాని అల్పతరములుకావు. ప లోపించుటచే షాడవము. సపలు లోపించుటచే ఔడవము. రి మొదలు మూర్ఛనతాళము మార్గమును. గీతి, వినియోగము షాడ్జివలె 12 కళలు

దీనిలో ధ న్యాసము రి మధలు అపన్యాసములు. చోక్ష శుద్ధ కైశిక దేశి సింహళులు కనుపట్టుచున్నవి.

సాహిత్యము

తరుణామలేందు మణిభూషితా మలశిరోజం
భుజగాధిపైక కుండల విలాస కృతశోభం
నగసూను లక్ష్మిదేహార్ధ మిశ్రిత శరీరం
ప్రణమామి భూతగీతోపహార పరితుష్టం

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ధా | ధా | నిధ | పధ | మా | మా | మా | మా | 1 |
| త | రు | ణా | – | మ | లేం | – | దు | |
| ధా | ధా | నిధ | నిస | సా | సా | సా | సా | 2 |
| మ | ణి | భూ | – | షి | తా | – | మ | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| సధ | ధా | పా | మధ | ధా | నిధ | ధని | ధా | 3 |
| ల | శి | రో | – | – | – | జం | – | |
| సా | సా | రిగ | రిగ | సా | రిగ | సా | సా | 4 |
| భు | జ | గా | – | ధి | పై | – | క | |
| ధా | ధా | నీ | పా | ధా | పా | మా | మా | 5 |
| కుం | – | డ | ల | వి | లా | – | స | |
| ధా | ధా | పా | మధ | ధా | నిధ | ధని | ధా | 6 |
| కృ | త | శో | – | – | = | భం | – | |
| ధా | ధా | నిస | నిస | నిధ | పా | పా | పా | 7 |
| న | గ | సూ | – | ను | ల | – | క్షి | |
| రిగ | సా | సా | సా | నీ | నీ | నీ | నీ | 8 |
| దే | హా | – | – | ర్ధ | మి | – | శ్రి | |
| సా | రిగ | రిగ | సా | నీ | సా | ధా | ధా | 9 |
| త | శ | రీ | – | – | – | రం | – | |
| రీ | గరి | మగ | మా | మా | మా | మా | మా | 0 |
| ప్ర | ణ | మా | – | మి | భూ | – | త | |
| నీ | నీ | ధా | ధా | పా | రిగ | సా | నిగ | 11 |
| గి | – | తో | | వ | హా | – | ర | |
| పా | ధా | పా | మా | ధా | నీ | ధా | ధా | 12 |
| ప | రి | తు | – | – | – | ష్టం | – | |

7. నైషాది. [షడ్జగ్రామము.]

ఇందులో అనంశములు బహుళములునగు నిరిగలు అంశములగును. సపధలు అల్పత్వ యుక్తములు. షాడ ఔడువలంఘములు ధైవతియందు వలె, చచ్చత్పుటము కళలు 16. గ నుండి మూర్ఛన

ఇందులో ని న్యాసము. చోక్ష [శుద్ధ] సాధారిత దేశీకైళావళులు కనపట్టుచున్నవి.

## సాహిత్యము

తంసురవందిత మహిషమహాసుర మధన ముమాపతిం భోగయుతం
నగసుత కామినీ దివ్యవిశేషక సూచక శుభనఖదర్పణకం
ఆహిముఖమణిఖచితోజ్జ్వల నూపురబాల భుజంగమరవికలితం
ద్రుతమభివ్రజామి శరణమనిందిత పాదయుగ పంకజవిలాసం

## ప్రస్తారము :

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| నీ | నీ | నీ | నీ | సాం | ధా | నీ | నీ | 1 |
| తం | – | సు | ర | వ | ం | ది | త | |
| పా | మాం | సా | దాం | నీ | నీ | నీ | నీ | 2 |
| మ | హి | ష | మ | హా | – | సుర | | |
| సాం | సాం | గా | గా | నీ | నీ | ధా | నీ | 3 |
| మ | ధ | న | ము | మా | – | ప | తిం | |
| సా | సా | ధా | నీ | నీ | నీ | నీ | నీ | 4 |
| భో | – | గ | యు | తం | – | – | – | |
| సా | సా | గా | గా | మాం | మాం | మాం | మాం | 5 |
| న | గ | సు | త | కా | – | మి | ని | |
| నీ | పాం | ధాం | పాం | మా | మా | మా | మా | 6 |
| ది | – | వ్య | వి | శే | – | ష | క | |
| రీ | గా | సా | సా | రీం | గాం | నీ | నీ | 7 |
| సూ | – | చ | క | శు | భ | న | ఖ | |
| నీ | నీ | పా | ధని | నీ | నీ | నీ | నీ | 8 |
| ద | – | ర్ప | ణ | కం | – | – | – | |
| సా | సా | గా | సా | మా | మా | మా | మా | 9 |
| అ | హి | ము | ఖ | మ | ణి | ఖ | చి | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మా | మా | మా | మా | నీ | ధా | మా | మా | 10 |
| తో | | జ్వల | ల | నూ | – | పు | ర | |
| ధా | ధా | నీ | నీ | రీ | గా | మా | మా | 11 |
| బా | ల | – | భు | జంగ | | | మ | |
| మా | మా | పా | దా | నీ | నీ | నీ | నీ | 12 |
| ర | వ | క | లి | – | తం | – | – | |
| పా | పా | నీ | నీ | రీ | రీ | రీ | రీ | 13 |
| ద్రు | త | మ | భి | ప్రవ | జా | – | మి | |
| రీ | మా | మా | మా | రీ | గా | సా | సా | 14 |
| శ | ర | ణ | మ | నిం | – | ది | త | |
| ధా | మా | రీ | గా | పా | ధా | నీ | నీ | 15 |
| పా | – | ద | యు | గ | పం | – | క | |
| పా | మా | రీ | గా | నీ | నీ | నీ | నీ | 16 |
| జ | వి | లా | – | సం | – | – | – | |

### 8 షడ్జకైశికీ—చచ్చత్పుటము సంసర్గ వికృత జాతులు

దీనిలో సగపలు అంశములు. రిమలు అల్పము. ధనిలు కొంచెము ఎక్కువ. కళలు 16. ప్రవేశికధ్రువ. రెండవయుంకము. దీనిలో గ న్యాసము, సనిపలు అపన్యాసము. గాంధారము హిందోళక దీశీకేళావలులు కన్పట్టుచున్నవి.

### సాహిత్యము

దేవమసకల శశితిలకం ద్విరద గతిం
నిపుణమతిం ముగ్ధ ముఖాంబురుహ దివ్యకాంతిం
హరమంబుదోదధి నినాదమచల వరసూనుదేహార్ధ
మిశ్రిత శరీరం ప్రణమామి తమహ మనుపమ ముఖ కమలం

# స్వరజాతులు

## ప్రస్తారము

సా సా మా పా గరి మగ మా మా 1

దే – – – . . . .

మ మా మా మా సా సా సా పా 2

వం – – – – – = –

ధా ధా పా పా ధా ధా రీ రిమ 3

అ స క ల శ శి తి ల

రీ రీ నీ నీ నీ నీ నీ నీ నీ 4

కం – – – – – = – –

ధా ధా పా ధ ని మా మా పా పా 5

ద్వి ర ద గ తిం – – –

ధా ధా పా ద ని దా దా దా పా పా 6

ని పు ణ మ తిం – – –

సా సా సా సా సా సా సా సా 7

ము – గ్ధ ము ఖాం – – బు

ధా దా పా ధా ధని ధా ధా ధా 8

రు హ ది – వ్య కాం – తిం

సా సా సా రిగ సా రిగ ధా ధా 9

హ ర మ – బు దో – ద

మా దా పా పా ధా ధా నీ నీ 10

ది ని నా . . దం . . –

రీ తీ గా సా సా సా సా గా 11

అ చ ల వ ర సూ – ను

ధా రి స రీ సరి రీ సా సా సా 12

దే – హా . – ర్ధ మి – శ్రీ

సా సరి రీ సరి రీ సా సా సా 13

త క రీ – రం – – –

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మా | మా | మా | మా | నిద | పధ | మా | మా | 14 |
| ప్ర | ణ | మా | | మి | త | హా | - | |
| నీ | నీ | షా | పమ | పా | పమ | పధ | రిగ | 15 |
| మ | ను | ప | మ | ము | ఖ | క | మ | |
| గా | గా | గా | గా | గా | గా | గా | గా | 16 |
| అం | - | - | - | - | - | - | - | |

9. షడ్జో దీచ్యవా :-

దీనిలో సమనిధలు అంశముగలు సమనిదలు పరస్పరము సంగీతము అగును. మంద గాంధారము ఎక్కువ. సరిలు భూరితరములు. రి లోపించుటచే షాడవము రిపలు లోపించుటచే ఔడవము. ధ అంశమైనపుడు షాడవము. గీతతాళాదులు షాడ్జివలె. గ నుండి మూర్ఛన రెండవయంకమున ధ్రువాగానము.

దీనిలో మ న్యాసము. సధలు అవన్యాసములు 1 కళ 2వ కళ.

సాహిత్యము

శైలేశ సూనుప్రణయ ప్రసంగస విలాసఖేలన వినోదం
అధికముఖేందు నయనం నమామితప దెవాసురేశఖ తవరుచిరం

ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| సా | సా | సా | సా | మా | మా | గా | గా | 1 |
| శై | - | - | | లే | - | - | - | |
| గా | మా | షా | మా | గా | మా | మా | ధా | 2 |
| శ | - | శూ | - | - | - | - | ను | |
| సా | సా | మా | గా | పా | పా | నీ | ధా | 3 |
| శై | - | లే | - | శ | సూ | - | ను | |
| ధా | నీ | సా | సా | ధా | నీ | పా | మా | 4 |
| ప్రి | ణ | య | - | ప్ర | సం | - | గ | |
| గా | సా | సా | సా | సా | సా | సా | గా | 5 |
| స | వి | లా | - | స | ఖే | - | ల | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ధా | ధా | పా | దా | పా | నీ | ధా | ధా | 5 |
| న | వి | నో | – | – | – | దం | – | |
| సా | గా | గా | గా | గా | గా | సా | సా | 7 |
| అ | – | ధి | – | క | – | – | – | |
| నీ | ధా | పా | ధా | పా | ధా | ధా | ధా | 8 |
| ము | | ఖేం | – | – | – | – | దుం | |
| సా | సా | మా | గా | పా | పా | నీ | ధా | 9 |
| అ | ధి | క | – | ము | ఖేం | – | దు | |
| ధా | నీ | సా | సా | ధా | నీ | పా | మా | 10 |
| న | య | నం | – | న | మా | – | మి | |
| గా | సా | సా | సా | సా | సా | | గా | 11 |
| దే | – | వా | సు | రే | – | శ | | |
| ధా | ధా | పా | ధా | మా | మా | మా | మా | 12 |
| త | వ | రు | చి | రం | – | – | – | |

10. షడ్జమధ్యమా.

దీనిలో సప్తస్వరములు అంశములై. ఒకదానితో నొకదానికి పరస్పరము సంగతికలుగును. ని అల్పము. గ అంశమైనపుడు ని సంవాదియగును. గాన అల్పము ఇష్టముగాదు. అది వాదియైనపుడు దానికేమాత్రము అల్పత్వములేదు. ని లోపించినచో షాడవము. నిగలు లోపించినచో ఔడువము. ద్విశ్రుతులైన నిగలు పరస్పరము విరోధులు. గీతి, తాళము కళలు షాడ్జికి వలెను. మనుండి మూర్ఛన. వినియోగము వెనుకటివలెనె.

దీనిలో సమలు న్యాసములు. స్వరములేడును అపన్యాసములై.

సాహిత్యము

రజని పధూముఖ విలాసలోచనం
ప్రవికసిత కుముద దళ ఫేనసంనిభం
కామిజన నయన హృదయాభినందనం
ప్రణమామిదేవం కుముదాధి వసనం

## ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మా | గా | సగ | పా | దప | మా | నిధ | నిమ | 1 |
| ర | జ | ని | వ | ధూ | — | ము | ఖ | |
| మా | మా | సా | రిగ | మగ | నిధ | పధ | మా | 2 |
| వి | లా | — | స | లో | — | — | చ | |
| మా | గా | రీ | గా | మా | మా | సా | సా | 3 |
| నం | — | — | — | — | — | — | — | |
| మ | మగమ | మా | మా | నిధ | పధ | పమ | గమమ | 4 |
| ప్ర | వి | క | సి | త | కు | ము | ద | |
| ధా | పధ | పరి | రిగ | తమ | రి | సధస | సా | 5 |
| ద | ళ | ఫే | న | సం | — | — | ని | |
| నిధ | సా | రీ | మగమ | మా | మా | మా | మా | 6 |
| భం | — | — | — | — | — | — | — | |
| మా | మా | మగమ | మధ | దప | పద | పమ | గమగ | 7 |
| కా | — | మి | జ | న | న | య | న | |
| ధా | పధ | పరి | రిగ | మగ | రిగ | సధస | సా | 8 |
| హృ | ద | యా | భి | నం | — | — | ది | |
| మా | మా | ధని | ధన | ధప | మప | పా | పా | 9 |
| నం | — | — | — | = | — | — | — | |
| మా | మగమ | మా | నిద | పద | పమగ | గా | మా | 10 |
| ప్ర | ణ | మా | — | మి | దే | వం | — | |
| ధా | పధ | పరి | రిగ | మగ | సధస | సా | | 11 |
| కు | ము | ధా | ధి | వా | — | సి | | |
| నిధ | సా | రీ | మగమ | మా | మా | మా | | 12 |
| నం | — | — | — | — | — | — | | |

11 గాంధారోదీచ్యవ :- తాళము చచ్చత్పుటము.

దీనిలో సమలు అంశలు, పూర్ణత్వములో రిగమపదనిలు అల్పములు.

రి లోపించినచో షాడవము షాడవములో నిధపగలు అల్పము. రిధలకుసంగతి. ధ మొదలు మూర్ఛన. కళలు 16. నాల్గవ యంకము న ధ్రువాగానమున వినియోగము.

దీనిలో మ న్యాసము. సదలు అపన్యాసములు.

## సాహిత్యము

సౌమ్య గౌరీముఖాంబురుహ దివ్యతిలకపరిచుంబి
తార్చితసు పాదం ప్రవికసిత హేమ కమల నిభం,
అతి రుచిర కాంతినఖ దర్పణామల నికేతం
మనసిజ శరీరతాడనం ప్రణమామి గౌరీచరణయుగ మనుపమం.

## ప్రస్తారము:

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| సా | సా | పా | మా | పా | ధప | పా | మా | 1 |
| సౌ | – | – | – | – | – | – | – | |
| ధా | పా | మా | మా | సా | సా | సా | సా | 2 |
| మ్య | – | – | – | = | – | – | – | |
| ధా | నీ | సా | సా | మా | మా | పా | పా | 3 |
| గౌ | – | – | రీ | ము | ఖాం | – | బు | |
| నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ | 4 |
| రు | హ | ది | – | వ్య | తి | ల | క | |
| మా | మా | ధా | నిస | నీ | నీ | నీ | నీ | 5 |
| ప | రి | చుం | – | బి | తా | | ర్చి | |
| మా | పా | మా | పరిగ | గా | గా | గా | సా | 6 |
| త | సు | పా | – | దం | – | – | – | |
| గా | మగ | పా | పధ | మా | ధని | పా | పా | 7 |
| ప్ర | వి | క | సి | త | హే | – | మ | |
| రీ | గా | సా | సధ | నీ | నీ | ధా | ధా | 8 |
| క | మ | ల | ని | భం | – | – | – | |

గా రిగ సా సని గా రిగ సా సా 9
అ తి రు చి ర కాం - తి

సా సా సా మా మని ధని నీ నీ 10
న ఖ ద - ర్ప ణా - మ

మా పా మా పరి గ గా గా సా సా 11
ల ని కే - తం - - -

గా సా గా సా మా పా మా పరిగ 12
మ న సి జ శ రీ ర -

గా మా గా సా గా గా గా సా 13
తా - - - - డ - నం

నీ నీ పా ధా నీ గా గా గా 14
ప్ర ణ మా - మి గౌ - రీ

నీ నీ ధా పా ధా పా మా పా 15
చ ర ణ యు గ మ ను వ

దా పా సా సా మా మా మా మా 16
మం - - - - - - -

12 రక్తగాంధారి :-

దీనిలో రిధలు కాక మిగిలిన సగమ పనిలు అంశలు. రినిదాటి సగలకు సంనిధిని మేళనము చేయవలెను. భిన్న లఘువులు గల స్వరముల నైరంతర్యము సంనిధి. ఏక లఘువు కలము రెండింటికిని గాని మూఁడిటికిఁగాని నైరంతర్యము మేళనము, రక్తినిబట్టి రెండును జేయవలెను. రి లోపించినచో షాడవము రిధలు లోపించినచో ఔడవితము. నిధలు బహుళము. మధ్యమగ్రామములో పరిలకు సంవాదముండును. గాన పంచమము అంశము షాడవమును ద్వేషించును. అనగా పంచమము స్వయముగా అంశమగుచు నిలోపముచే నిర్వర్తింపఁదగిన షాడవమును సహింపదు. సనిమపలు ఔడువితమును ద్వేషించును. అనగా సనిమపలు అంశములై రిధల లోపము నిర్వర్తింపఁదగిన ఔడువితమును సహింపవు. నిధల షడ్జాంశ స్థు

వాదులు గాకపోయినను ఔడువితమె. కొన్నిచోట్ల అంశలోపమువల్ల కొన్ని చోట్ల చెప్పుటవలనను ఔడువాది జాతులలో ఒకప్పుడు ఔడువితము ప్రాప్తించినను నిషేధము. స, గలకు సంగతి. పంచపాణ్యాది తాళములు షాడ్జియందు వలెనె. రి మొదలు మూర్ఛన. 3వ అంకమున ధ్రువాగానము దీనిలో గ న్యాసము. మ అపన్యాసము.

## సాహిత్యము

తంబాల రజనికర తిలకభూషణ విభూతిం
ప్రణమామి గౌరీవదనారవిందం ప్రీతికరం.

## ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పా | నీ | సా | సా | సా | గా | పా | నీ | 1 |
| తం | – | బా | | ల | ర | జ | ని | |
| సా | సా | పా | పా | మా | మా | గా | గా | 2 |
| క | ర | తి | ల | క | భూ | – | ష | |
| మా | పా | ధా | పా | మా | పా | దప | మగ | 3 |
| ణ | వి | భూ | – | – | – | – | – | |
| మా | మా | మా | మా | మా | మా | మా | మా | 4 |
| తిం | – | – | – | – | – | – | – | |
| ధా | నీ | పా | మప | ధా | నీ | పా | పా | 5 |
| – | – | – | – | – | – | – | – | |
| మా | పా | మా | ధని | పా | పా | పా | పా | 6 |
| – | | – | | – | | – | – | |
| రీ | గా | మా | పా | పా | పా | మా | పా | 7 |
| ప్ర | ణ | మా | – | మి | గౌ | – | రీ | |
| రీ | గా | మా | పా | పా | పా | మా | పా | 8 |
| వ | ద | నా | – | ర | విం | – | – | |
| పా | పా | పా | పా | పా | పా | పా | పా | 9 |
| ధ | | – | | – | | – | – | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రీ | గా | సా | సా | రీ | గా | గా | గా | 10 |
| ప్రి | | తి | క | రం | - | - | - | |
| గా | గా | పా | ధమ | పా | నిధ | పా | పా | 11 |
| - | | - | | - | | - | - | |
| గా | పా | మా | పరిగ | గా | గా | గా | గా | 12 |
| - | | - | | - | | - | - | |

12 కైశికి

దీనిలో రి కంటె మిగిలిన సగమ పధనిలు అంశములు. నిధలు అంశములైనపుడు పంచమమున్యాసము. నిగలు ద్విశ్రుతి గలవి. నిధలు అంశలైనపుడు నిగపలు న్యాసములని మతంగాదులనిరి. రి లోపమువల్ల షాడవము, రిధ లోపమువల్ల ఔడువము. రి అల్పము. నిపలు బహుళము. అంశలకు పరస్వరము సంగతి. పంచమము షాడవమును ధైవతము ఔడువమును ద్వేషించును. పంచపాణ్యాది తాళములు షాడ్జియందువలె. గ మొదలు మూర్ఛన. అయిదవ యంకమున ధ్రువాగానము. దీనిలో గపనిలు న్యాసములు. రి గాక మిగిలినవి ఆఱు అపన్యాసములు. ఒకప్పుడు రి కూడ అపన్యాసము అగును. అపుడు ఏడును అపన్యాసములె.

సాహిత్యము

కేళీ హతకామతను విభ్రమ విలాసం
తిలకయుతం మూర్ధోర్ధ్వబాలసోమ నిభం
ముఖ కమల మసమ హాటక సరోజం
హృది సుఖదం ప్రణమామిలోచన విశేషం

ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పా | ధని | పా | ధని | గా | గా | గా | గా | 1 |
| కే | | ళీ | - | హ | - | తం | - | |
| పా | పా | మా | నిధ | నిధ | పా | పా | పా | 2 |
| కా | | మ | త | ను | - | | - | |

ధా నీ సా సా రీ రీ రీ రీ 3
వి – భ్ర మ వి లా – సం
సా సా సా రీ గా మా మా మా 4
తి ల క యు తం – – –
మా̇ ధా̇ నీ ధా మా ధా మా పా 5
మూ – ర్ధో – ర్ధ్వ జా ల
గా రి సా ధని రీ రీ రీ రీ 6
స్తో – మ ని ఖం – –
గా రీ సా సా ధా ధా మా మా 7
ము ఖ క మ లం – – –
గా గా గా మా మా నిధ ని నీ నీ 8
అ స మ – హా – ట –
గా గా నీ నీ గా గా గా గా 9
క స రో – జం – –
గా గా నీ నీ నిధ పా పా పా 10
హృ ది సు ఖ దం – –
మా పా మా పా పా పా మా మా 11
ప్ర ణ మా – మి లో చ –
పా మా గా నిధ నిదని నీనీ మా మా 12
న వి శే – షం ం ం

14 మధ్యమోదీచ్యవ, తాళము, చచ్చత్పుటము.

దీనిలో ప అంశము సదా పూర్ణగానే యుండును. ఎప్పుడును షాడవ ఔడవములుండవని భావము. గాంధారోదీచ్యవలె నుండును. మ మొదలు మూర్ఛన. 4 అంకమున ధ్రువాగానము దీనిలో మ న్యాసము.

సాహిత్యము

సురాభిష్టుతమనిలమనోజవమంబుదోదధినినాదమతిహాసం
శివం శాంతమసురచమూమథనం వందే త్రైలోక్యనతచరణం

## ప్రస్తారము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పా | ధని | నీ | నీ | మా | పా | నీ | పా |
| దే | - | హా | - | ర్థ | రూ | - | ప |
| రీ | రి | రీ | గా | సా | రిగ | గా | గా |
| మ | తి | కాం | - | తి | మ | మ | ల |
| నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ |
| గ | మ | తేం | - | దు | కం | - | ద |
| నీ | నీ | ధప | మా | నిధ | నిధ | పా | పా |
| కు | ము | ద | ని | భం | - | | - |
| పా | పా | రీ | రి | రీ | రి | రీ | రీ |
| చా | - | మీ | | క | రా | - | బు |
| మా | రిగ | సా | సధ | నీ | నీ | నీ | నీ |
| రు | హ | ది | - | - | వ్య | కాం | తి |
| మా | పా | నీ | సా | పా | పా | గా | గా |
| ప్ర | వ | ర | గ | ణ | పూ | - | జి |
| గా | పా | మా | నిధ | నీ | నీ | సా | సా |
| త | మ | జే | - | యం | - | | - |
| పా | పా | మా | ధని | పా | పా | పా | పా |
| సు | రా | భి | ష్టు | త | మ | ని | ల |
| మా | పా | మా | రిగ | గా | గా | గా | గా |
| మ | నో | జ | - | వ | - | మం | బు |
| గా | పా | మా | పా | నీ | నీ | నీ | నీ |
| దో | - | ద | ధి | ని | నా | - | ద |
| మా | పా | మప | రిగ | గా | గా | గా | గా |
| మ | తి | హా | - | సం | - | | - |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గా | గా | గా | గా | మా | ని ధ | నీ | నీ | 13 |
| శి | వం | శా | ం | త | మ | ను | ర | |
| నీ | నీ | దప | మా | నిధ | నిధ | పా | పా | 14 |
| చ | మూ | మ | ధ | నం | | – | – | |
| రీ | గా | పా | సా | మా | నిధని | నీ | నీ | 15 |
| వం | – | దే | – | త్రై | లో | క్య | – | |
| నీ | నీ | దా | పా | ధా | పా | మా | మా | 16 |
| న | త | చ | ర | ణం | – | | – | |

15 కార్మారవి (మధ్యమ గ్రామము) తాళము చచ్చత్పుటము.

దీనిలో ని రిధలు అంశలు. అంతర మార్గములోని వగ టపబన చాల అనంశములుగా జెప్పబడినవి. గ మిగుల బహుళము. అన్నిటికి స్వర సంగతి. కళలు 16. స నుండి మూర్ఛన. అయిదవ అంకము ధ్రువా వినియోగము. స్థాయిగా ఎక్కువగా ప్రయోగము గలది. అంశము సంచారిగా బహు ప్రయోగము గలది. అంతరమార్గము. అనంశమనబడును. కనుక ఇందు అంతర మార్గము ప్రయోక్తవ్యము.

ఇందులో ప న్యాసము. అంశలే అపన్యాసములు.

సాహిత్యం

తం స్థాణులలిత వామాంగస క్తమతితేజః ప్రసరసౌధాంశు కాంతి
ఫణిపతిముఖం ఉరో విపుల సాగరనికేతంసితపన్న గేంద్ర
మతికాంతం షణ్ముఖవినోదకరపల్ల వాంగుళి విలాస
కీన వినోదం ప్రణమామి దేవయజ్ఞోపవీతకం.

ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రీ | రీ | రీ | రీ | రీ | రీ | రీ | రీ | 1 |
| తం | – | స్థా | – | ణు | ల | లి | త | |
| మా | గా | సా | గా | సా | నీ | నీ | నీ | 2 |
| వా | | మాం | – | గ | స | – | క్త | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| నీ | మా | నీ | మా | పా | పా | గా | గా | 3 |
| మ | తి | తే | – | జః | వ్రి | స | ర | |
| గా | పా | మా | పా | నీ | నీ | నీ | నీ | 4 |
| సౌ | – | ధాం | – | శు | కాం | – | తి | |
| రీ | గా | సా | నీ | రీ | గా | రీ | మా | 5 |
| ఫ | ణి | వ | తి | ము | ఖం | – | – | |
| రీ | గా | రీ | సా | నీ | ధని | పా | పా | 6 |
| [illegible] | రో | వి | పు | ల | సా– | – | గ | |
| మా | పా | మా | పరిగ | గా | గా | గా | గా | 7 |
| ర | ని | కే | – | తం | – | | – | |
| రీ | రీ | గా | సమ | మా | మా | పా | పా | 8 |
| సి | త | వం | – | న | గేం | – | ద్ర | |
| మా | పా | మా | గరిగ | గా | గా | గా | గా | 9 |
| మ | తి | కాం | – | తం | – | | – | |
| ధా | నీ | పా | మా | ధా | నీ | సా | సా | 10 |
| ష | – | ణ్ము | ఖ | వి | నో | – | ద | |
| నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ | 11 |
| క | ర | వ | – | ల్లి | వాం | – | గు | |
| మా | మా | ధా | నీ | సనిని | ధా | పా | పా | 12 |
| శి | వి | లా | – | స | కీ | – | ల | |
| మా | పా | మా | గరిగ | గా | గా | గా | గా | 13 |
| న | వి | నో | – | దం | – | | – | |
| నీ | నీ | పా | ధని | గా | గా | గా | గా | 14 |
| ప్రవ | ణ | మా | – | మి | దీ | – | వం | |
| సా | రీ | గా | సా | నీ | నీ | నీ | నీ | 15 |
| య | – | జ్ఞో | – | ప | వీ | – | త | |
| నీ | నీ | ధా | ధా | పా | పా | పా | పా | 16 |
| కం | | – | | – | | – | – | |

16 గాంధార పంచమి. (మధ్యమ గ్రామము.) చచ్చత్పుటతాళము.

దీనిలో ప అంశము. గప లకు చాల స్వరములతో గపలకు సంగతి చేయవలెను. 16 కళలు. రి మొదలు మూర్ఛన. నాల్గవయంకమున ధ్రువాగానము. దీనిలో గ న్యాసము. రిప అపన్యాసములు.

సాహిత్యము

కాంతం వామైకదేశప్రేంఖోలమానకమల నిభం
వరసుభి కుసుమగందాధి వాసితమనోజ్ఞ
నగరాజ సూనురతిరాగరభసకేళీ కుచగ్రిహలీలం
తం ప్రణమామి దేవం చంద్రార్ధ మండిత

ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| పా | మప | మధ | నీ | ధప | మా | ధా | నీ | 1 |
| కాం | – | | – | | – | – | – | |
| సనిని | ధా | పా | పా | పా | పా | పా | పా | 2 |
| – | – | తం | – | – | – | | – | |
| ధా | నీ | సా | సా | మా | మా | పా | పా | 3 |
| వా | – | మై | – | క | దే | – | శ | |
| నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ | నీ | 4 |
| ప్రేం | – | ఖో | – | ల | మా | – | న | |
| నీ | నీ | ధప | మా | నిధ | నిధ | పా | పా | 5 |
| క | మ | ల | ని | భం | – | | – | |
| పా | పా | రి | రి | రి | రి | రి | రి | 6 |
| వ | ర | సు | ర | భి | కు | సు | మ | |
| మా | రిగ | సా | సధ | నీ | నీ | నీ | నీ | 7 |
| గం | – | ధా | – | ది | వా | – | సి | |
| నీ | నీ | సా | రిస | రి | రి | రి | రి | 8 |
| త | మ | నో | – | జ్ఞ | – | | – | |
| నీ | గా | సా | నిగ | సా | నీ | నీ | నీ | 9 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| న | గ | రా | - | జ | సూ | - | ను | |
| నీ | మా | నీ | మా | పా | పా | గా | గా | 10 |
| ర | తి | రా | - | గ | ర | భ | స | |
| గా | పా | మా | పా | నీ | నీ | నీ | నీ | 11 |
| కే | - | లీ | - | కు | చ | - | గ్ర | |
| మా | పా | మా | పరిగ | గా | గా | గా | గా | 12 |
| హ | లీ | అం | - | తం | - | | - | |
| నీ | సీ | పా | ధా | నీ | గా | గా | గా | 13 |
| ప్ర | ణ | మా | - | ఖి | దే | - | వం | |
| నీ | సీ | సీ | సీ | సీ | సీ | నీ | సీ | 14 |
| చం | - | ద్రా | - | ర్ధ | మం | - | డి | |
| మా | మా | ధా | నీ | సనిని | ధా | పా | పా | 15 |
| త | వి | లా | - | సక్తి | ల | - | - | |
| మా | పా | మా | పరిగ | గా | గా | గా | గా | 16 |
| న | వి | నో | - | దం | - | | - | |

17 ఆంధ్రి (మధ్యమ గ్రామము)

దీనిలో ని రి గ ప లు అంశములు. రిగలకు నిధలకు పరస్పరము న్యాసము వఱకు అంశానుక్రమముగా సంగతి కలుగును. స లోపము వల్ల షాడవము. మ నుండి మూర్ఛన. కల తాళములు పూర్వమువలె.
దీనిలో గ న్యాసము. అంశలె అపన్యాసములు.

సాహిత్యము

తరుణేందు కుసుమ ఖచితజటం త్రిదివనదీసలిల ధౌతముఖం
నగసూనుప్రణయం వేదనిధిం వరదాహితుహినశైల గృహం
అమృతభవం గుణరహితం తమవనిరవిశశిజ్వలనజతి గగన తనుం
శరణం వ్రజామి శుభమతి కృత నిలయం

ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గా | రీ | రీ | రీ | రీ | రీ | రీ | రీ | 1 |
| త | రు | ణేం | - | దు | కు | సు | మ | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రి | గా | రి | గా | రి | రి | రి | రి | 2 |
| ఖ | చి | త | జ | టం | – | | – | |
| రి | రి | గా | గా | రి | రి | మా | మా | 3 |
| త్రి | ది | వ | న | దీ | స | లి | ల | |
| రి | గా | సా | ధని | సీ | సీ | సీ | సీ | 4 |
| ధౌ | – | త | ము | ఖం | – | | – | |
| సీ | రి | సీ | రి | ధని | ధని | పా | పా | 5 |
| న | గ | సూ | – | ను | ప్ర | ణ | యం | |
| మా | పా | మా | రిగ | గా | గా | గా | గా | |
| వే | – | ద | ని | ధిం | – | | – | |
| రి | రి | గా | సస | మా | మా | పా | పా | 7 |
| ప | రి | ణా | – | హి | తు | హి | న | |
| మా | పా | మా | రిగ | గా | గా | గా | గా | 8 |
| శై | – | ల | గృ | హం | – | | – | |
| ధా | సీ | గా | గా | గా | గా | గా | గా | 9 |
| అ | మృ | త | భ | వం | – | | – | |
| పా | పా | మా | రిగ | గా | గా | గా | గా | 10 |
| గు | ణ | ర | హి | తం | – | | – | |
| సీ | సీ | సీ | సీ | రి | రి | రి | రి | 11 |
| త | మ | వ | ని | ర | వి | శ | శి | |
| రి | రి | గా | సీ | సా | సా | సీ | సీ | 12 |
| జ్వ | ల | న | జ | ల | ప | వ | న | |
| పా | పా | మా | రిగ | గా | గా | గా | గా | 13 |
| గ | గ | న | త | నుం | – | | – | |
| రి | రి | గా | సమ | మా | మా | పా | పా | 14 |
| శ | ర | ణం | – | వ్రి | జా | – | మి | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| మా | మా | నీ | నీ | సా | రీ | గా | గా | 15 |
| శు | భ | మ | వి | కృ | త | ని | ల | |
| రి | గ | గా | గా | గా | గా | గా | గా | 16 |
| యం | – | | – | | – | | – | |

18 నందయంతి (మధ్యమ గ్రామము)

దీనిలో ప అంశము. గ గ్రహము. కొందఱు ప గ్రహ మనిరి. మంద్ర రి బహుళము. స లోపమువల్ల షాడవము. హృష్యకమూర్ఛన తాళము పూర్వమువలె. కళలు 32. మొదటి యంకమున ధ్రువాగానము.
దీనిలో గ న్యాసము. మ ప లు అపన్యాసములు.

## సాహిత్యము

సౌమ్యం వేదాంగ వేదకరకమల యోనిం తమో రజోవివర్జితం హరం
భవహర కమలగృహం శివం శాంతం సంనివేశనమపూర్వం
భూషణలీలమురగేశ భోగభాసుర శుభ పృథులం
అచలపతిసూనుకరపంకజామల విలాసకీల వినోదం
స్ఫటికమణిరజతసిత నవదుకూలక్షీరోద సాగరనికాశం
అజరశిరఃకపాల పృథుభాజనం వందే సుఖదం
హరదేహమమల మధుసూదనసుతేజోధికసుగతియోనిం

## ప్రస్తారము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గా | గా | గా | గా | పా | పా | ధప | మా | 1 |
| సౌ | – | | – | | – | | – | |
| ధా | ధా | ధా | ధా | ధా | నీ | సనిని | ధా | 2 |
| – | | – | | – | | | – | |
| పా | పా | పా | పా | పా | పా | పా | పా | 3 |
| మ్యం | – | | – | | – | | – | |

ధా వే మా క మా త ధా రిజ ధా హరం ధా ళ మా హం రి శి రి వే ధా భూ ధా ఉ గా ఖా ధా లం రి అ

నీ - రీ ర మా మో నీ తం నీ - నీ వ మా - గా వం రీ - నీ ష నీ ర పా - ధా గా చ

మా దాం గా క పా ర మా - మా మా హ మా మా శాం రీ శ సనిని - మా గే పా సు నీ - మా లి

పా - గా మ పా జో పా పా - పా ర మా - పా - రీ న ధా ణ పా - పా ర ధా పా వ

గా గ గా అ ధా వి గా - గా గా క మా పమ తం పా మ పా లీ గా శ ధా శు పా - పమ తి

గా వే గా యో నిధ చ గా గా - గా మ మా - పా సం పా పూ పా - గా భో మా భ పా పా సూ

గా - గా - పా - గా - గా గా అ మా పా - మా - పా అం గా - గా పృ పా - పా ను

గా ద గా నిం పా - గా - గా - గా గృ మా - పా ని మా ర్వం పా - గా గ మా ధు పా - నీ -

4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రి | రి | రి | రి | పా | పా | పా | పా | 18 |
| క | ర | వం | - | క | జా | - | మ | |
| పా | పా | పా | పా | ధా | మా | మా | మా | 19 |
| ల | వి | లా | - | స | క్షి | - | ల | |
| నీ | పా | గా | గమ | గా | గా | గా | గా | 20 |
| న | వి | నో | - | దం | - | | - | |
| రి | రి | గా | గా | మా | మా | మా | మా | 21 |
| స్ఫ | టి | క | మ | ణి | ర | జ | త | |
| నీ | పా | నీ | మా | నీ | ధా | పా | పా | 22 |
| సి | త | న | వ | దు | కూ | - | ల | |
| సా | సా | ధని | ధా | పా | పా | పా | పా | 23 |
| క్షీ | - | రోద | - | సా | - | - | గ | |
| మా | పా | మా | పరిగ | గా | గా | గా | గా | 24 |
| ర | ని | కా | - | శం | - | | - | |
| రి | రి | గా | గా | మా | మా | పా | పా | 25 |
| అ | జ | శి | రః | క | పా | - | ల | |
| రి | రి | రి | గా | మా | రిగ | మా | మా | 26 |
| వృ | ధు | ఖా | - | - | జ | నం | - | |
| మా | నీ | పా | నీ | గా | గా | గా | గా | 27 |
| వం | - | దే | - | సు | ఖ | దం | - | |
| మా | మా | పా | పా | ధా | ధని | నిధ | మా | 28 |
| హ | ర | దే | - | హ | మ | మ | ల | |
| ధా | ధా | సా | నీ | ధా | నీ | పా | పా | 29 |
| మ | ధు | సూ | - | ద | న | - | సు | |
| రి | రి | రి | రి | మా | పా | ధా | మా | 30 |
| తే | - | జో | - | ధి | క | - | సు | |
| నీ | నీ | నీ | నీ | ధా | పా | మా | మా | 31 |
| గ | తి | యో | | - | | - | - | |

మా పరిగ గా గా గా గా గా గా 22
– – నిం – – –

అనుక్తా విహ తాలః స్యాత్ త్రిష్వపై కకళాదికః
మార్గాః క్రమాచ్చిత్ర వృత్తిదక్షిణాః గీతయః పునః
మాగధీసం భావితాచ, పృథులేత్యుదితాః క్రమాత్

ఈ జాతి లక్షణములలో ఏక కల మొదలైన తాళ భేదములు మార్గ గీతులు చెప్పనప్పుడు తాళ లక్షణములలోఁ జెప్పిన చంచత్పుటము గాని, పంచపాణి గాని ఏక కళాదికము మూఁడు విధములుగనే యుండును. మార్గములు చిత్రము, వృత్తి, దక్షిణలు. మాగధి సంభావిత పృథుల అని గీతులు మూఁడు వరుసగా చెప్పబడినవి. 

వార్తికే ద్విగుణాజ్ఞేయా, స్తైవచిత్రే చతుర్గుణా 
సర్వజాతిషు జానీయా దంశ స్వరగతం రసం, 

మార్గమందుఁ జెప్పఁబడిన కలాసంఖ్యయే వార్తికము (వృత్తి మార్గము సంబంధించినది) అను మార్గములో రెట్టింపు అని తెలియవలెను. షాడ్జిలోనైతే దక్షిణలో పన్నెండుగాఁ జెప్పఁబడినది. అది వార్తికములో ఇరువదినాల్గు అగునని భావము. అష్టలఘువులుగానున్న కళలను విడిచి నాల్గు లఘురూపమగు కలను జేయవలెనని యభిప్రాయము. ఆ దక్షిణలోఁ జెప్పఁబడిన కళ సంఖ్యయే చిత్రమార్గములో నాలుగురెట్లు అని తెలియవలెను. షాడ్జిలోనైతే ఇరవై యెనిమిది కళలగునని భావము. భాగములుచేసి లఘుద్వయాత్మకమైన కలను జేయవలెనని దీని యభిప్రాయము. దీనిచేతనే వార్తిక వృత్తిమార్గమునకు సంబంధించిన మార్గములో రెండు కళలుగల తాళము–సంభావిత గీతి చిత్రములో ఏకకళగల తాళము, మాగధీగీతి. ఇట్లే మిగిలినవానిలోఁ దెలియనగును. సర్వ జాతులలోను అంశస్వరమును బట్టి "సరిపీరే" అని యిదివరలోఁ జెప్పిన ప్రకారము రసములను దెలియవలెను. 

జన్యరాగాంశములైన గ్రామరాగాదులు పదివిధములైనను జాతులకు సాక్షాత్తుగాఁగాని పరంపరగాఁగాని జన్యరాగములే వాని యవయవములు.

నేడు వీనిని స్వరజతులని వ్యవహరించిరి. స్వరజాతి శబ్దమునుండి స్వరజాతి అను రూపమేర్పడినది.

## జాత్యాదుల వివరము

| జాతిసంఖ్య | జాతులు | అంశములు | న్యాసములు | అపన్యాసములు | మూర్ఛన | షాడవద్వేషి స్వరములు | ఔడువద్వేషి స్వరములు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | షాడ్జి | సగమపద | స | గస | ఉత్తరాయత | ని | — |
| 2 | ఆర్షభి | రిధని | రి | రిధని | శుద్ధషడ్జ | స | సప |
| 3 | గాంధారి | సగమపని | గ | సప | పౌరవి | రి | రిధ |
| 4 | మధ్యమ | సరిగమపద | మ | సరిగమపద | కళోపనత | గ | గని |
| 5 | పంచమి | రిప | ప | రిపని | కళోపనత | గ | గని |
| 6 | ధైవతి | రిధ | ద | రిమధ | అభిరుద్గత | ప | సప |
| 7 | నైషాది | సగని | ని | సగని | అభిరుద్యత | ప | సప |
| 8 | షడ్జకైశికి | సగప | గ | సపని | | — | — |
| 9 | షడ్జోదీచ్యవ | సమధని | మ | సధ | అశ్వక్రాంత | రి | రిధ |
| 10 | షడ్జమధ్యమ | సరిగమపదని | సమ | సరిగమపదని | మత్సరీ కృత | ని | గని |
| 11 | గాంధారోదీచ్యవ | సమ | మ | సధ | పౌరవి | రి | — |
| 12 | రక్తగాంధారి | సగమపని | గ | గ | కళోపనత | రి | రిధ |
| 13 | కైశికి | సగమపదని | గపని | సగమపధని | హరిణాశ్వ | రి | రిప |
| 14 | మధ్యమోదీచ్యవ | ప | మ | సధ | సౌవీరి | — | — |
| 15 | కార్మారవి | రిపధని | ప | రిపధని | శుద్ధ మధ్యమ | — | — |
| 16 | గాంధారపంచమి | ప | గ | రిప | హరిణాశ్వ | — | — |
| 17 | ఆంధ్రీ | రిగమపని | గ | రిగపని | సౌవీరి | స | — |
| 18 | నందయంతి | ప | గ | మప | హరిణాశ్వ | స | — |

## ఎనిమిదవ గీతి ప్రకరణము

శుద్ధజాతి సముద్భూత కపాలాన్యధునాబ్రువే
రాగాజనకజాతీనాం తత్కపాలేషు సంమతాః

శుద్ధములైన షాడ్జి మొదలైన జాతులనుండి పుట్టిన కపాలములనింకఁ జెప్పెదను. సంసర్గ జాతులును కపాలములును శుద్ధజాతులనుండి పుట్టెఁ వి. జనకములయిన శుద్ధజాతులనుండి రాగములు పుట్టును. "షాడ్జినుండి శ్రీరాగము పుట్టును." ఈ విధముగాఁ ముందు చెప్పఁబడును. అవి కపాలములందు సమ్మతములు. కపాలములవి కుండ మొ॥ వాని భాగములు రెంటిని అందురు. కుండ బిందె మొదలైనవానిలో ఒక భాగము కపాలము అనబడును. ఘటములోని ఏకదేశమును కపాలమన్నట్లే రాగములోని ఏకదేశమును కపాలమందురు. లేదా పూర్వము భిక్షాటన చేయు సమయములో శంకరుడు షాడ్జి ఆర్షభి మొదలైనవానిని గానము చేయఁగా నితిశయమగు రసము వ్యక్తముకాఁగా రస రూపమైన శివుని మౌళిగత చంద్రకళ ద్రవింపగా దాని యమృతములచేఁ జిలుకఁబడి సజీవములై శివుని భూషణములైన బ్రహ్మ కపాలములు గానము చేసెనట అందుచే ఆ కపాలములచేఁ బాడఁబడినవి గాన కపాలములు అని పేరు గలవి యయ్యెను. వీనికి జాతులనుంటి స్వరూప భేదమయితే న్యాసాది భేదములను బట్టి తెలియఁదగును.

### షాడ్జీకపాలములు

షడ్జో గ్రహాంశో ఽపన్యాసో, గోన్యాసోఽతి బహూగమౌ
అల్పారిపనిధా లంఘ్యో రిః కలా ద్వాదశోదితాః
యస్మిన్ షాడ్జీకపాలం తద్గదితం మార్గవేదిభిః

దేనిలో షడ్జము గ్రహము అంశము న్యాసముగను గాంధారము న్యాసముగను గమలు అతి బహుళముగను రిప పనిదలు అల్పములుగను రి లంఘ్యముగను ఉండి 12 కళలు ఉండునో అది షాడ్జీకపాలమని మార్గవేదులు చెప్పిరి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | టుం | | 1 |
| ఝుం | టుం | ఝుం | ధ | రం | 2 |
| ఖ | ట్వాం | గ | రా | శం | 3 |
| దం | ష్ట్రా | క | | | |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| త | డి | త్స | దృ | శ | జి | హ్వాం | | 4 |
| హా | హా | హా | హా | హా | హా | హా | హా | 5 |
| బ | హు | రూప | వదనం | ఘనఘోర | నాదం | | | 6 |
| హా | హా | హా | హా | హా | హా | హా | హా | 7 |
| ఊ | ఊ | హ్రాం | హ్రాం | "ం | "ం | "ం | "ం | 8 |
| నృ | ముం | డ | మం | డి | తం | | | 9 |
| హూం | హూం | కహ | కహ | హూం | హూం | | | 10 |
| కృ | త | వికట | ట | ము | ఖం | | | 11 |
| న | మా | మి | దే | వం | భైరవం | | | 12 |

ఇవి షాడ్జి జపాల పదములు.

2 ఆర్షభీ కపాలం

యత్రర్ష భోంఽశోఽపన్యాసోమోఽంతో గనిపద ధాల్పకా
సోఽత్యల్పోఽష్ట కపాలం తత్స్యాత్కపాలం త్వార్షభీ గతం

ఎందులో రి అంశము అపన్యాసముగను మ అంతమై గనిపదలు అల్పమై స అత్యల్పమై యుండి 8 కళలుండును. అది ఆర్షభీ కపాలము.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఝం | ఝం | ఝం | ఝం | | | | | 1 |
| దంష్ట్రా | క | రా | ళం | | | | | 2 |
| ఊ | ఊ | హ్రాం | త్రైం | హా | హా | హా | హా | 3 |
| హా | హా | " | ఐం | " | " | " | హా | 4 |
| వ | ర | సు | రభి | కు | సుమ | | | 5 |
| చ | ర్చి | త | గాత్రం | | | | | 6 |
| క | పా | ల | హ | స్తం | | | | 7 |
| న | మా | మి | దే | వం | | | | 8 |

3 గాంధారీ కపాలము.

మధ్యమోఽంశగ్రహా న్యాసాపన్యాసో ధైవతో ఽపరః
యత్రాల్పాః సరిగా లోపోఽదిపఞ్చమో రాడువంభవేత్
తద్గాంధారీ కపాలంస్యాత్ కలాష్టక వినిర్మితం.

మధ్యమము అంశము గ్రహము న్యాసము అపన్యాసముగ నుండును. ధైవతము బహుళము. సరిగలు అల్పములు. రిపలు లోపించుటచే ఔడువమగును. 8 కళలు ఉన్నచో గాంధారీ కపాలమగును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| చ | ల | త్తు | రం | గ | 1 |
| ఘం | గు | రం | అ | | 2 |
| నే | క | రే | ణు | | 3 |
| పిం | జ | రం | సు | | 4 |
| రా | సు | రైః | సుసేవితం | పు | 5 |
| నా | తు | జా | హ్ను | | 6 |
| వీ | జ | లం | మాం | | 7 |
| బిం | | దు | భిః | | 8 |

4 మధ్యమా కపాలములు

మధ్యమోంఽశో నిరిగపాస్త్వల్పాయత్ర కళానవ
తన్మ ధ్యమ కపాలం స్యాదితి నిశ్శంక కీర్తితం.

మధ్యమము అంశముగను నిరిగపలు అల్పముగ నుండి ఎందు కళలు తొమ్మిది యుండునో అది మధ్యమ కపాలమని నిశ్శంకుడు చెప్పెను.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శూ | ల | క | పా | ల | | | 1 |
| పా | ణి | త్రి | పుర | వినాశి | | | 2 |
| శ | శాం | క | ధా | రి | ణం | | 3 |
| త్రి | న | య | న | త్రి | శూలం | | 4 |
| స | త | త | ముమ | | యాసహితం | | 5 |
| తం | వ | ర | దం | హై | హై | హైహై | 6 |
| హై | హై | హై | హై | హై | | | 7 |
| హై | హై | హై | హై | " | | | |
| నౌ | మి | మ | హా | దే | | వం | 9 |

5 పంచమీ కపాలములు

ఋషభాంశం సగ్రహంచ నిధషడ్జ గమాల్పకం
క పాలం పంచమీ జాత మష్టకలం విదుః

రి అంశముగ గ్రహముగనుండి నిధ సగమలు అల్పము ఎనిమిది కళలు కలది పంచమీ కపాలము.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| జ | య | వి | ష | మ | న | య | న | 1 |
| మ | ద | న | త | ను | ద | హ | న | 2 |
| వ | ర | వృ | ష | ఖ | గ | మ | న | 3 |
| పు | ర | | ద | | | | హన | 4 |
| న | త | స | క | ల | భు | వ | న | 5 |
| సి | త | క | మ | ల | వదన | | | 6 |
| భ | వ | మే | ఖ | య | హ | | ర | 7 |
| భ | వ | శ | ర | ణం | | | | 8 |

6 ధైవతీ కపాలములు

అత్యల్పర్షభగాంధారం పన్యాసం మధ భూరిచ
షాడ్జ్యా ఇవ కపాలం తద్దైవత్యాః స్యాత్కలాష్టకాత్

రిగలు అల్పము, ప న్యాసముగ మధలు బహుళముగ ఉండి ఎనిమిది కళ లున్నది షాడ్జివలె ధైవత కపాలము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అ | గ్ని | జ్వా | | లా | శి |
| ఖా | వ | | | లి | |
| మాం | స | | | శోణిత | |
| భో | జి | ని | స | ర్వా | హారి |
| ణీ | ని | ర్మాం | | సే | |
| చా | ప | ర్ణే | | | |
| న | మోఽ | స్తు | తే | | |

7 నైషాదీ కపాలములు

గ్రహాంశ న్యాస షడ్జంచ రిగాల్ప మతిభూరిభిః
నిధమైరష్ట కలకం స్యాన్నైషధీ కపాలకం

స గ్రహము అంశము న్యాసమును. రిగలు అల్పములు నిధమలు అతి బహుళము, ఎనిమిది కళలు గలది నైషధీ కపాలము.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| స | ర | స | గ | జ | | | చర్మపటం | 1 |
| భీ | మ | భు | జం | గ | | | మానద్దజటం | 2 |
| క | హ | క | హ | హ్యం | కృతి | | వికృతముఖం | 3 |
| న | మ | త | శి | వం | హర | | మజితం | 4 |
| చం | ద్ర | చూ | | | డ | మ | జేయం | 5 |
| క | పా | ల | మం | డి | త | | మకుటం | 6 |
| కా | మ | ద | ర్ప | విధ్వం | స | | కరంవందే | 7 |
| న | మ | త | హరం | పరమ | | | శివం | 8 |

ఇతి సప్త కపాలాని గాయన్ బ్రహ్మోదితైః పదైః
స్వరైశ్చ పార్వతీ కాంతస్తుతౌ కళ్యాణభాగ్భవేత్.

ఇట్లు పార్వతీ పతియొక్క స్తోత్రములో బ్రహ్మచే చెప్పబడిన పదముల స్వరములతోను పాడుచున్న వాడు కళ్యాణములను పొందును.

కంబలములు

యత్రగ్రహోంఽశోఽపన్యాసః పంచమో బహుళస్తురిః
సోన్యాసోఽథ గాంధారా స్త్వల్పా స్తత్ కంబలం మతం

పంచమము గ్రహముగా అంశముగా అపన్యాసముగా నుండి రి బహుళముగా నుండి మధగలు స్వల్పముగాను సన్యాసముగను ఉండునో అది కంబలమనిరి.

పంచమీ జాతి సంజాత మల్పతా బహుశావశాత్
స్వరాణాం బహవో భేదా స్తే పూర్వైరుదీరితాః

ఈ కంబలములు పంచమీ జాతియందు పుట్టినవి. అల్పత్వము బహుత్వములను బట్టి స్వరములకు చాల భేదములు గలిగినవి. అవి పూర్వులు చెప్పిరి.

ప్రీతః కంబలదానేన కంబలాయ వరందదౌ
పురా పురారి రద్యాపి ప్రీయతే తైరతః శివః

శివుని కర్ణకుండలమైన కంబలుడనెడి సర్పరాజు గానము చేయుటచేత శివుడు కంబలుడగు సర్పరాజునకు వరమిచ్చెను, ఆ కంబల సర్పరాజు పాడుటచే కంబలములని పేరున ప్రసిద్ధములైన వానిచే పురారియైన శివుడు ఇప్పుడు గూడ ప్రీతి పొందుచున్నాడు.

కపాలానాం క్రమాద్బ్రూమో బ్రహ్మప్రోక్తాం పదావళీం

అవి కపాలగాన నియమములో ప్రస్తుతములై బ్రహ్మచే చెప్పబడిన పదముల స్వరూపమును ఝం టం మొదలైన స్తోభాక్షరములతో గాన సంకేతాక్షరములతోఁ గూడునట్లు ఆ కపాలములందు ఉపయోగించిన కళల సంఖ్యచే క్రమముగా చెప్పుచున్నాము. వీనికి స్వరకల్పన మాత్రము ఆయా షాడ్జ్యాది లక్షణములను బట్టి యూహింపవలయును. ఝం టం మొ.

వర్ణాద్యలం కృతాగాన క్రియా పదలయాన్వితా
గీతి రిత్యుచ్యతే సా చబుధై రుక్తా చతుర్విధా.

వర్ణాదులచే నలంకరింపఁబడిన గాన క్రియ పదలయలతోఁ గూడి గీతియనఁబడును. అది నాలుగు విధములని బుధులనిరి.

మాగధీప్రథమా జ్ఞేయా ద్వితీయా చార్ధమాగధీ
సంభావితా చ పృథులే త్యేతాసాం లక్ష్మచక్ష్మకే

అందు 1 మాగధి 2 అర్ధమాగధి 3 సంభావిత 4 పృథుల అని నాలుగు గాన క్రియ నాలుగు విధములు.

గీత్వా కళాయా మాద్యాయాం విలంబితలయం పరం
ద్వితీయాయాం మధ్యలయం తత్పదాంతర సంయుతం

మాత్రలు నాలుగు ఉండునట్లు కళలు కల్పింపవలెను. కళయందు (ఆవృత్తియందు) లయ విలంబిత పదముగా గానముచేసి రెండవ కళయందు మధ్యలయ గల పదము గలుగునట్లుగా గానము చెయవలెను.

పత్పృతీయ పదేతే చ తృతీయ స్యాంద్రుతేలయే
ఇతి పురావృత్త పడాం మాగధీం జగదుర్బుధాః

మూఁడవ కళయందు విలంబిత పదములనుబట్టి లయద్రుతము కాఁగా తృతీయ మగు వందే అనుదానితో గూడినట్లు మూఁడు ఆవృత్తములు గలుగనట్లున్న దానిని మాగధి అందురు. ఇది మగధదేశమునఁ బుట్టినది గాన మాగధి యను పేరు గలిగినది.

| | | | |
|---|---|---|---|
| ఉదా:- | మాగా | మాధా | 1 |
| | దే | వం | |
| | దని దని | సని ధా | 2 |
| | దే వం | రు ద్రం | |
| | రిగ రిగ | మగ రిసా | 3 |
| | దే వం | రుద్రం వందే | |

అర్ధమాగధి:-

పూర్వయోఃపదయోరర్ధే చరమే ద్వ్యర్యదోది తే
దదా అర్ధమాగధీం ప్రాహుః

మొదటి రెండు పదములందును 'దేవం రుద్రం' అను రెంటిలో చివరి అర్ధమును అనగా 'దేవం' అను పదంలో 'వం' అనుదానిని రుద్రం అను దానిలో 'ద్రం' అను రెండుసార్లు అనగా అర్ధమాగధి అగును. అనగా మొదటి కళలో దేవం అని రెండవమారు వం రుద్రం అని, మూడవదానిలో ద్రం వందే అని పలుకవలెను.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉదా:- | మా | రీ | గాసా | | 1 |
| | దే | – | వం - | | |
| | సా | సా | ధా | నీ | 2 |
| | వం | రు | ద్రం | – | |
| | పా | ధా | ధా | పా | 3 |
| | ద్రం | వం | దే | – | |

ద్విరా వృత్త పదాం పరే. కొందరేమన్నారనగా మొదటి దానిలోని దేవం అనుదానిని రెండవదానిలో దేవం రుద్రం అనుదానిని మూడవదానిలో రుద్రం వందే అని అనవలెనన్నారు.

| | | | | |
|---|---|---|---|---|
| మా | మా | మా | మా | 1 |
| వే | – | వం | – | |
| ధా | సా | ధా | నీ | 2 |
| దే | వం | రు | ద్రం | |
| పా | నిధ | మా | మా | 3 |
| రు | ద్రం | వం | దే | |

సంభావితం = సంక్షిప్త పదా భూరిగురుః సంభావిత పదామతాః
సంక్షేపింపబడిన పదములు గలిగి ఎక్కువగా గురువులు గలది సంభావిత.

| | | | | |
|---|---|---|---|---|
| ఉదా :– | ధా | మా | రీ | గా |
| | భ | – | క్త్యై | – |
| | రీ | గా | గా | సా |
| | దే | – | వం | – |
| | నీ | ధా | సా | నీ |
| | రు | – | ద్రం | – |
| | ధా | నీ | మా | పా |
| | వం | – | దే | |

పృథుల

భూరి లఘ్వక్షర పదా పృథులా సంమతా సతాం
ఎక్కువ లఘ్వక్షరములు గల పదములు గలది పృథుల అనబడును.

| | | | |
|---|---|---|---|
| మా | గ | రీ | గా |
| సు | ర | న | త |
| సా | దని | ధా | ధా |
| హ | ర | ప | ద |
| ధా | సా | ధా | ని |
| యు | గ | లం | – |

పా నిదప మా మా
ప్రి ణ మ త

**అవతారిక :—**

పదముల నాశ్రయించిన గీతుల లక్షణము చెప్పి యింక తాళముల నాశ్రయించిన గీతులు చెప్పబడుచున్నవి.

యద్వాయధాక్షరే యుగ్మే గుర్వోః ప్రథమోర్యదా
ఏకైకం చిత్రమార్గాది ప్రియుజ్యచ గణాత్మకం
మాత్రాభిరష్టభి ద్యుక్తే దక్షిణే ధ్రువకాదిభిః
ప్రయుజ్యతే తదా గీతిర్మాగధీత్యభి ధీయతే

లఘు ప్లుతరూపమైన గురుద్వయము గల యక్షరమందు యతి గణములు, ద్విమాత్రలుగల మొదటి రెండు గురువుల మధ్య ఒక్కొక్క గురువును స్వయముగనే మాత్ర ద్వయాత్మకముగాన చిత్రమార్గాధికమున కర్తముగా "ధ్రువకాపతితా"యుక్తముగా చరణాత్మకముగా (=చతుర్మాత్రికమగు మాత్రాగణ విశేషముగా) ప్రయోగించి అనగా రెండు కళలుగా చేసి నాలుగు మాత్రలు గలుగునట్లు ఒక్కొక్క గురువును వార్తిక (వృత్తికి సంబంధించిన) మార్గము నాశ్రయించుటవల్ల "ధ్రువ కాసర్పిణీ పతితా" పతాకలను పేరుగల కరక్రియలచేతఁ బ్రయోగించి పిదప దక్షిణమార్గమందు ధ్రువకా, సర్పిణీ, కృష్ణా, పద్మినీ విసర్జితా విక్షిప్తా పతాకా పతితలను పేరుగలవానిలోగూడిన యొక్కొక్క గురువును ప్రత్యేకముగా నాలుగు కళలు గలుగునట్లు చేసి గురుద్వయము రెండుసార్లు ఆవృత్తి చేయుటవల్ల ప్రయోగింపఁబడినపుడు మాగధిగీతి యనఁబడును.

**అర్థమాగధి :—**

తృతీయం లఘు యుగ్మస్య భగణార్థయుతం యదా
ఆద్యాభ్యామంతికాభ్యాం చ మాత్రాభ్యాం సప్రయుజ్యతే
తతః ప్లుతం సార్థగణ యుక్తం కృత్వా ప్రయుజ్యతే
ధ్రువకాది భిరష్టాభి ర్ద్విరుక్తా స్త్వద్వ యేనచ
తదా అర్థమాగధీతే ద్వ్యా త ద్రుతతాలాంతరేష్వపి

యుగ్మములోని (=చంచత్పుటములోని) మూడవ (తాళావయమగుటచే

శిబిక ఆదులుచూచి కులుకుచున్నాము. అను భావము గ్రహింపుటలేదు. సంగీత జ్ఞానముభక్తి వినాసన్మార్గము గలదేమనసా. తెలియలేరు రామ భక్తిమార్గమును రాజస తామస గుణముల గలవారి గలిసిమెలసి తిరుగుచున్నాము అట్లు తిరగక నామనవి వినవేల గుణవిహీన మనసా, ఇత్యాది కీర్తనల భావములు పట్టక పాడుటయే గాక దుర్వ్యసనములలోఁబడుచు పడునట్లు చేయుచు అసలు ఉద్దేశమునకే భంగము కలిగించుచున్నాము ఇది జ్ఞానదాయక సాహిత్యము చదువుచు భక్తిజ్ఞాన సాహిత్యము చదివి అది మనసుకు పట్టని వారివిషయములోగూడ ఇంతే అగుచున్నది.

## రాగము-తానము-పల్లవి-

మరి రాగము తానము పల్లవి అను ప్రక్రియకూడ మనకు ఎక్కువ వాడుకలో నున్నది. పూర్వవాగ్గేయకారకులు పాడు కీర్తనలు రాగ నామములు సంస్కృతములో నున్నవి. వాని యర్థముఁగూడ తెలిసికొని పాడుటమంచిది. నాదము సగుణమునిర్గుణము అనిఉపాసనలలోవలె రెండువిధములుగనున్నది. కీర్తనలు సగుణములు, రాగములు నిర్గుణములుగ ఉండును.

## త ద రి న అనువాని భావము

రాగములలో నేడు తదరిన, అని నన, అని అక్షరములతోఁగలిసి పాడుట వినుచున్నాము. ఇవికేవలము అర్థములేని యక్షరములా? పడి కట్టురాళ్ళు అనుచు నుందురు అవా? అని ఆలోచింపఁగా అది తదితరం న తత్ ఆనాదముకంటె ఇతరము అన్యమేదియులేదు. న లేదు న లేదు ఇది నిశ్చయము అను నర్థము గలిగినది. వ్యాకరణకర్తలు శబ్దము బ్రహ్మమని వేదాంతులు సర్వము బ్రహ్మమని అన్నట్లు నాదోపాసకులైన వాగ్గేయకారులు ఆ నాదముకంటె వేరులేదనివీ క్రమముగ తదితరం న అనునది త ద రిన అను నక్షరములుగా మారి యుండ వచ్చును అనగా మాకిదితెలియదు అదే కావచ్చును అనికొందరన్నారు. తదితరంన అని గాని త్వదితరం, నాదమా? నీ కంటె నితరము న లేదు అను నర్థముండునట్లు పాడుటగాని మంచిది ఇది సంగీతమునకు లక్ష్యము. మఱియు మనము పాడెడితానము అనునది కూడ అనంతం

రాగము నాదము, అనంతం ఎంతగా చెప్పుదుము. ఎంతగా పాడుదుము ఎంతగా రాగము నాదము భావము చెప్పుదుము అనంతం అనంతం అనుచున్న పదము క్రమముగా తం, తం, తం, అని తానము అను పేరుతో ప్రసిద్ధి పొందినట్లు ఉన్నది అని సంగీతజ్ఞులు చెప్పుదురు. అందుచేత తం తంతం అనుచు మధ్య గా అనంతం అనంతం అని ఆభావము తోచునట్లు పాడుట మంచిది.

ఇంక పల్లవి సంగతి ఇది సంగీత పాండిత్యమును తెలుపు ప్రక్రియ ఏదో చరణము తీసికొని ఆచరణమునకే అనేక పద్ధతులుగా అర్థము రామా రక్షించు రామా రక్షించు రామారక్షింపవేమిరా రామా రామా అని యనేక భావములు తోచునట్లుగా పాడుట మంచిదది లక్ష్యము. సరే ఆచరణముపాడి దానికి స్వరములువేయుట జరుగుచున్నది. ఇది పాండిత్య ప్రదర్శన తెలుపునది అయినను భావము తన్మయత్వమును తెలుపు ప్రక్రియకాదు. కేవల పల్లవిలో నేగాక ప్రతికీర్తనలోను పల్లవి అందుకొనియో అను పల్లవి అందుకొనియో లేక చరణము నుండియో వీలునుబట్టి ఏదో స్థానిని అందుకొని లయకు అనుకూలముగా స్వరములు వివిధ రకములుగ వేయుట చూచుచున్నాము. వాగ్గేయకారులు క్షమించినచో నిక్కడ ఒక మాట.

భావముల తన్మయత్వముతో పాడుచు పరిగమలలో సంగీత పాండిత్యమును చూపుట పానకములో పుడకలా ఉండునేమో అని పించుచున్నది. పెద్ద పెద్ద వాగ్గేయకారకులుగూడ ఇట్లుపాడుట వినుట తటస్థించుచున్నది. కాన ఆ పాడెడ వారికి వినెడివారికట్లు అనుపించక పోవచ్చును కాని అది తన్మయత్వకు అడ్డు గలిగించునట్లు కాకపోదు దీనివిషయములోగూడ పెద్దలు ఆలోచించుతురు గాక

## పంచరత్నకీర్తనలు

త్యాగరాజు వ్రాసిన పంచరత్నకీర్తనల చరణములో స్వరముపాడి సాహిత్యము పాడుట సర్వేసర్వత్ర జరగుచున్నది. త్యాగరాజుకూడ అట్లే స్వరము పాడి పిదప సాహిత్యము పాడెనందురు. మరియుకొన్నికీర్తనల మధ్యచివరంగూడ చిట్టస్వరములు త్యాగరాజే రచించెననియు అట్లు పాడెననియు నందురు. కాని ఇది సరికాదేమో అనియు అనిపించుచున్నది. స్వరముకూడ

పాడుటలో సాహిత్యము వరుసమార్గము చూపించుటకే కానిమరొకటికాదు. అట్లు గానిచో భావస్ఫూర్తికి ఆనందమునకు, తన్మయత్వాదులకుస్వరము అడ్డుపడు ననుకొందును. ఇదియు విజ్ఞులు ఆలోచింతురుగాక.

కీర్తనలలో అన్ని సంగతులును అర్థభావగాంభీర్యములకు సహాయ బడునట్లే యుండవలెను గాని నెఱవు విఱుపులను ఎక్కువచూపి భావమునకు అడ్డునవిగాచేయరాదు.

మచ్చుకు కొన్ని కీర్తనలు

చక్కని రాజమార్గము ఆది (త్యాళ) ఖరహరప్రియన్

సరిగమ పదానిస సనిదప మగారిస

ఇందులో గా గాక మిగిలిన దీర్ఘస్వరములు శుద్ధములుగానివి.

!!! రి గరిసా !!! నిదదా నిసరి రి సని !!! సరి

చక్కనిరా జఅఅ మార్గము ఉండ గఆ

రిగమప రిగమపద నిదానినిద పాదనిదని పాదమమరిన

సందుల దుఉఉర నేఏఏఏల ఓఒఒఒ మనఅస

అని 1-15 సంగతులతో పాటు సందుల దూరనేలమనస అని సాహిత్యము పాడవలెను.

పాదనిద మాపమాప పాదపాద దనిదప దపమగా

చక్కని పా లు ఉ ఉ

1 పాదనిద దానిదానిసా దానిసా

మీ గడ యుండ గ

రిగరి సారిససని సనిదా దనిసానిసరి సనిరిసనిద

ఛీయనుగం గఅఅ అ సాగర

పాదస మాపమ రిగా గారిరి

మే ఎ ఎ ఏ ఏ ఏ ఏ ఏ తే

అనిపాడి తర్వాత 1-2,-3, సంగతులు పాడవలెను.

పాదనిదా పమగపమరి రిగమాప గాగామాపమమారి గగంరి

కం టికి సుం దర తరమగు రూ పమె

గరిరిస రిపమామా పాదప మాపదా దపపమమ గగరి గరిరి ససనిసా
ముక్కం టి నో టా చె లగె
రిగమప రిగమప దానీనిదరా
నామమే త్యాగరాజు
దానిద పాదా సదనిదనీ నిదదపమా పాదనీదనిస దనిసానిసా
ఇంట నే జా గుగా నెల కొన్న దైవమేఇటు
రిగరి రిసరిస సనిదా దానిసానిదా నిదాసాదా పాదపమస
వంది శ్రీ సాకేత రాముని భ క్తి అను ॥చక్కనిరాజ॥

* * * *

శోభిల్లు స ప్తస్వర మాజగన్మోహిని రూపకం
సగామపని ససనీ పమగరిసా యగున్
ప॥ గా ।।। గరి రిసనీ సాగామప
శో భి ల్లు స ప్త స్వ ర
సనిసరి సాని పపమ గమపని సనిమమ గరి సని
సుం ం దరుల భజ జింంప వె మఅ నఅ సఅ
1-5 స్వరములతోపాటు సుందరుల భజింపవేమనసా
అని పాడవలెను.

అ॥ మపసా మసనీ పనిసాని పగా
ధరఋ క్వా మఅఅ దులలో
మగమప మగారి సాని గమాపమ పమగమ
వర రఅ గాయ త్రి హృదయమున
మపనీ పనిసా సనిరిస
సురభూ సుర మానసమున
మగరిసని సని సని సనిగమ పమగరి సగమాసనీ
శుభ త్యా గఅ రఅ జఅ నుత తా

* * * *

పరలోకభయమాది, తాళము మందర రాగము
సరిగామాపనీససయు నీపమాగరీసయు
అ॥ పనిసామ గమగా గరిసారి గామ
పరలోక భయఅ ములేక భవ

సా ని పా మ గ మ గా వ మ గ రి సా
పా శ బ ద్ధు అ య్యే ద రు
అ॥ ప ని సా రి సా రి రి రి రి స రి స
కరి వాజి శృంగారారామ శిబిక
రి సా ని ప నీ ని సా ని స ని పా మ గా మ
ఆదు లెల్ల మనకె గల్గె నని
ప ప పా ప మ గ మా స మ గ రీ సారిసాసా
కొన్న కాంతలను కొన్న బిడ్డలను
పమసారిసా రిసాసారిసా సా సరిగరి గమపామసారి
వన్నె చీరలను వాన గుడిసెలను
ప ని సా రి రి రి రి రి స రి
తిన్నగా కని దేవలోక మని
దా సా నీ సనీ పానిసని పామగామ
త అన్న కొను టలో త్యాగరాజనుత ॥వ॥

ఇట్లే సింహేంద్రమధ్యమము త్రిపుట

నీదు చరణములే నిరతమును రామ నమ్మితిని (అనిపాడి)
1-4 సంగతులుపాడి పిదప
వేదవేదాంత విది తుండయివెలయుశ్రీ సర్వేశ రామ
పాపకర్మపు తనువురా ఇందు బాధచెందగజాలరా
ఏపగిదినైన నన్నేలుకో త్యాగరాజనుత

వాగ్గేయ కారులు మొదట కీర్తనకు అర్థము తెలిసికొని పిదప అర్థము చెడనట్లు విడదీసికొని పాడవలెను. వాగ్గేయకారులిది దృష్టిలో నుంచికొన్నచో సులభముగానే పాడగలరు. ఆసామర్థ్యమువారిలో నున్నది. ఇది పెద్దవిషయము కాదు కాని అర్థము తమకు విను వారికి కలుగవలెనను దృష్టితో నున్నచో వారికిది పెద్దసమస్యకాదు. కనుక వాగ్గేయకారులు దీనిని గుర్తుంచుకొని తమకు నాదానందముతో పాటు సాహిత్య భావము తన్మయత కలుగునట్లు పాడి వారు తన్మయత్వముపొంది తమ జీవితములను తిన్ననిమార్గములలో నడపు

కొనుచు వ్యామోహము పడక యితరులను పడనీయక తన్మయత్వముగూర్చి సంగీత లక్ష్యముతో పాటు జీవిత లక్ష్యమును పొందుదురుగాక.

## ప్రబంధాధ్యాయము

గానము నిబద్ధము అని బద్ధము అని రెండువిధములు. ధాతు (గేయ) వుల చేతను బద్ధమైనది నిబద్ధము. ఆలాపము బంధహీనముగాన అనిబద్ధమనం బడును.

ప్రబంధములో నాలుగు ఖండిక లుండును. ప్రతిఖండికలో ఒకొక్కరాగము ఒక్కొక్క తాళము ఉండును. ఖండిక చివర పదము. రెండు ఖండికలు ఒకవగము ఉద్గ్రాహము. చివరి భాగము ధ్రువము. ఇందు ఆలాప ఆభోగములు ఉండవు. ఆభోగము లేక పోయినను గాత్ర నేత్ర నామములుండవచ్చును. ఇది ద్విధాతువు అనిర్యుక్తముగానుండును.

నిబద్ధమునకు ప్రబంధము వస్తువు రూపకము అని మూడు పేర్లు. ధాతువు (గేయము) ప్రబంధావయవము అది నాలుగు విధములు 1 ఉద్గ్రాహము (పల్లవి వంటిది) 2 మేలాపకము (అనుపల్లవి=ఉద్గ్రాహ ధ్రువములను కలుపు నటువంటివి) 3 ధ్రువము (=చరణము వంటిది) 4 ఆభోగము (అంతిమ భోగము) కొన్ని చోట్ల మేలాపకము ఆభోగములు ఉండవు. గేయము ద్విధాతువుగల త్రిధాతువు గను చతుర్ధాతువుగను ఉండును.

ప్రబంధమునకు అంగములు ఆరు. 1 స్వరము 2 బిరుదము 3 పదము 4 తేనకము 5 పాటము (చేతులతో కొట్టుట) 6 తాళము. స్వరములు=సప్తస్వరములు. బిరుదము నాయకాది వీర్యాది గుణవామము. అన్యావాచకము పదము. తేనకము = మంగళ వాచకము. ఓంతత్సత్ అను దానిలో తత్తేన =బహ్మచే లక్షితము తేనకము. పాటము = వాద్యాక్షరోక్తరూపము తాళము = ఆది తాళాదికము.

ప్రబంధ జాతులయిదు.

1 మేదిని ఆరంగములతో బద్ధమైనది. 2 ఆ నందిని అయిదంగములతో బద్ధమైనది. 3 దీపని నాలుగు అంగములతో బద్ధమైనది. 4 భావని మూడు

అంగములతో బద్ధమైనది 5 తారావళి రెండు అంగములతో బద్ధమైనది వీనినే శ్రుతి నీతి సేన కవిత చంపులని కొందఱందురు.

ప్రబంధము మరల అనిర్యుక్తము 2 నిర్యుక్తము అని రెండు విధములు. ఛందస్సు తాళములు మొదలగు నియమములు లేనిది అనిర్యుక్తము. ఛందస్సు తాళాది నియమిత మనిర్యుక్తము. ప్రబంధము మరల 1 సూడస్థములు 2 ఆళిసంశ్రయములు 3 విప్రకీర్ణములు అని మూడు రకములు. సూడము 1 ఏల 2 కరణము 3 ఢేంకి 4 వర్తనిక 5 ఝొంబడము 6 లంభము 7 రాసకము 8 ఏకతాళ అని యెనిమిది రకములు.

ఆళిసంశ్రయ 1 వర్ణము 2 వర్ణస్వరము 3 గద్యము 4 కైవాడము 5 అంక చారిణి 6 కందము 7 తురగలీల 8 గజలీల 9 ద్విపది 10 చక్రవాకము 11 క్రౌంచపదము 12 స్వరార్ధము 13 ధ్వని కుట్టని 14 ఆర్య 15 గాథ 16 ద్విపథకము 17 కలహంసకము 18 తోలుకము 19 ఘటము 20 వృత్తము 21 మాతృక 22 రాగ కదంబము 23 పంచతాళేశ్వరము 24 తాళార్ణవము.

ప్రకీర్ణములు. ముప్పైయారు (ఇందు 2వరకు మేది నీజాతి వికరణ సింహమూలకములును) 1 శ్రీరంగము 2 శ్రీవిలాసము 3 పంచభంగి 4 పంచాననము 5 ఉమాతిలకము 6 త్రిపది 7 చతుష్పది షట్పది 9 వస్తుసంజ్ఞము 10 విజయము 11 త్రిపథము 12 చతుర్ముఖము 13 సింహలీల 14 హంసలీల 15 దండకము 18 త్రిభంగి 19 హర విలాసకము 20 సుదర్శనము 21 స్వరాంకము 22 శ్రీవర్ధనము 23 హర్షవర్ధనము 24 వరము 25 చచ్చరి 26 చర్య 27 పద్ధడి 28 రాహడి 29 వీరశ్రీ 30 మంగళాచారము 31 ధావళము 32 మంగళము 33 ఓవి 34 లోలి 35 డోల్లరి 36 దంతి.

ఇవి ప్రబంధములో సూడస్థము ఆళిసంశ్రయము ప్రకీర్ణములు.

ఇంక సూడములోనివి

ఏల—దీనిలో పదునారు పాదములుండును. మొదటి పాదములో ఒకే ధాతువు (గేయములో) సాను ప్రాసమైన రెండుఖండములుండును. దీనిలో మాతు (వాక్) భేదము చేయవలెను. దీనిపేరు కామము ఖండద్వయము తరువాత అక్షర వర్జితమై గమకాలాప ప్రయోగము చేయవలెను. ఇది రెండవ పదము దీనిపేరు మన్మథ వంతము. దీని పిదప పల్లవములు అను పేరు గల మూడు

పాదము లుండును. ఈమూడు పాదములలో కాంతము జీతము అను పేరు గల ఒకటి రెండుపాదములు విలంబితమానములుగా పాడవలెను. మూడు మిత్రమను పేరు గల పదము. ద్రుతమానములో పాడవలెను. ఇది శివ పాదము. ద్రుతాది మానములు తాళాధ్యాయములో చెప్పబడెను. ఇట్లు ఉద్గ్రాహములో తుల్య ధాతువులు (=గేయము)గల పాదత్రయము పాడవలెను. మూడవ పాదములో కేవలము సంబోధన పదములతో గూడిన ప్రయోగము చేయవలెను గాని ఇట్లు మూడవ పాదములో పల్లవ పదము చేయరాదు దీనినే సోమేశ్వరాదులు మేలాపకమనిరి. ఇట్లు ఉద్గ్రాహమైన పిదప ధ్రువము స్తుత్యనాయకాది నామాంకితముగా చేయవలెను. ఇది మధ్యవిలంబిత పద త్రయముగలదై యుండవలెను. ఒకటి రెండు ఏకధాతువు గలవి. మూడు భిన్నధాతువుగా (విసదృశగేయముగా) నుండవలెను. ఇట్లు ధ్రువము మూడు పదములు గలది. విచిత్రవాసవ మృదువు అని వానిపేర్లు. దీని పిదప అభోగము. ఇందులో వాగ్గేయకారుని పేరు ఉండవలెను. దీనికి సుచిత్రక మని పేరు ఇది పదునారవది. ఇవి రెండుసార్లు పాడి ధ్రువములో పదమూడవదానికి మొదట(త్యాగము ముగింపు)న్యాసము చేయవలెను. గ్రహము బేసిగా చేయవలెను. ఇది ఏలా సామాన్య లక్షణము

ఏలలో 1ఉద్గ్రాహము 2ధ్రువము 3ఆభోగము ఉద్గ్రాహములో మూడుపాదములలోని మొదటి పాదములో

| | | |
|---|---|---|
| ఖండద్వయము | పాదములు | 2 |
| పల్లవ పదములు | పాదము | 3 |
| రెండవ పాదములో–పై విధముగా పదములు | | 5 |
| మూడవ పదములో పల్లవ పదములు లేవు గాన | | 2 |
| ధ్రువములో | పదములు | 1 |
| ఆ భోగములో | పదము | |
| | | 16 పదములు |

పై పదములకు 1కామ 2 మన్మథము 3 కాంత 4 జిత 5 మత్త 6 వికారి 7 మాంధావ 8 సుమతి 9 శో 10 సుశోభి 11 గీతర 12 ఉంచిత 13 విచిత్ర 14 వాసవ 15 మృదు 16 సుచిత్ర అని పేరు.

రాగము గణము రాగము తాళము వృత్తి రీతి ప్రీతి వర్ధని
నాదావతి భభభభభన టక్క మంఠ కైశికి పాంచాలి భారతి శృంగార
హంసావతి రరరరరస హిందోళ ద్వితీయ అరభటి లాటి చంద్రిక రౌద్ర
నందావతి తతతతతజ మాలవకైశికి -ప్రతితాళ-సాత్వతి -గౌడి ఇంద్రాణి వీర
భద్రావతి మమమమమయ కకుభ కంకాళ- భారతి- వైదర్భివారాహి భీభత్స
వీని సంకీర్ణములు చాల గలవు. అవి అప్రసిద్ధము.

వికృతములు-గణవికారములనుబట్టి

1 వాసవి 2 సంగాత 3 త్రేత 4 చతుర 5 బాణ
ఏకగణవికార ద్విగణవికార-త్రిగణవికార పంచగణవికార
1 వాసవి రామ 2 మనోరమ 3 ఉన్నత 4 శాంతి 5 నాగర
అని అయిదు విధములు. నాదావతిలో
మొదటి భగణము వికారము పొందినచో రామ
రెండవ భగణము వికారము పొందిన మనోరమ
మూడవ భగణము వికారము పొందిన ఉన్నత
నాల్గవ భగణము వికారము పొందిన శాంత
అయిదవ భగణము వికారము పొందిన నాగర
అగును. చివరిగణము వికారము పొందరాదు.
సంగత 1 రమణీయ (= అద్యద్వితీయభగణవికృత)
2 విషమ ( =అద్య తృతీయ భగణ వికృత) 3 సమ (= ఆద్యచతుర్థభగణ వికృత) 4 లక్ష్మి ( =అద్య పంచమ భగణ వికృత) 5 కౌముది ( =ద్వితీయ తృతీయ గణ వికృత) 6 కామోత్సవ ( =ద్వితీయ చతుర్థగణవికృత) 7 నందిని ( =ద్వితీయ పంచమ గణ వికృత) 8గౌరి (తృతీయ చతుర్థగణ వికృత) 9 సౌమ్య (= తృతీయ పంచమ గణ వికృత) 10 రతిదేహ (=తుర్యపంచమ గణవికృత) ఇట్లు సంగత పది విధములు.

త్రేత-1 మంగళ (=ప్రథమ ద్వితీయ గణవికృత) 2 రతిమంగళ (=ప్రథమ ద్వితీయ చతుర్థగణవికృత) 3 కళిక (=ప్రథమ చతుర్థి తృతీయ గణవికృత) 4 తనుమధ్య (=ప్రథమ చతుర్థతృతీయగణ వికృత) 5 వీరశ్రీ (=ప్రథమతృతీయ గణవికృత) 6 జయమంగళ (=ప్రథమచతుర్థ పంచమ

గణవికృత) 7 విజయ (=ద్వితీయ తృయ గణవికృత) 8 రత్నమాల (=ద్వితీయ పంచమ తృతీయ గణవికృత) 9 గురుమధ్య (=ద్వితీయచతుర్ధ పంచమ గణ వికృత) 10 రతిప్రభ =తృతీయ చతుర్ధ పంచమ గణ వికృత)

చతుర 1 ఉత్సవప్రియ (= ఆద్యగణము తరువాత నాల్గుగణముల వికారము వల్లనగును) 2 మహానంద [ =రెండుగణము తక్క మిగిలిన గణముల వికారమువల్ల] కుసుమావతి [= ఐదవగణము తక్క మిగిలిన గణముల వికారమువల్ల] బాణ–1పార్వతీప్రియ [ఆద్యగణముతక్క మిగిలిన అయిదు గణముల వికారమువల్ల నేర్పడును] చ గణవికారము వల్ల 31 వగణ వికారమువల్ల మొత్తము 93

అతరములు పదునైదు.

నాదావతిలో భగణద్వయస్థానమున జగణద్వయము ఉంచినచో సావిత్రి (సంగతా భేదముసగణద్వయము ఉంచిన పావని సంగతాభేదము] భగణమునకు బదులు సగణము రెండవ భగణమునకుబదులు రగణము ఉంచినచో వాత సావిత్రి [సంగతాభేదము] వాసవి–ఒక గణవికారముగల వాసవి భగణ వికారము గలిగియుండుటచే జగణవతియగునో అప్పుడు సావిత్రి. వాసవీ భేదము లో సగణవతియైనచో పావని అనువాసవి భేదము ద్విప్రకార.

హంసావతిలో గూడ సంగత త్రివిధము

1వ్యోమజ [ =తగణముంచినచో] 2 వారుణి [= యగణము ఉంచినచో] 3 వోమ వారుణి [= తగణముఉంచినచో] వాసవి ఏకగణ వికారవతియైనను తగణముంచినచో వ్యోమ. జయగణముంచినచో వారుణి. అవి ద్వివిధము. సంగతి 1వహ్నిజ 2 వారుణి 3 వహ్నివారుణి అని ప్రసిద్ధము. వాసవి ద్వి విధము. రగణముంచినచో వహ్నిజ యగణముంచినచో వారుణి రెండు గణములుంచినచో వహ్నివారుణి.

ఇదివరకటివి 93 ఇవి 15 మొత్తం 108 అగును.

ఇది గజైల

మాత్రైల

మాత్రైల మాత్రా గణములచే నేర్పడును. 1 రతిరేఖ, 2 కామరేఖ, 3 బాణలేఖ 4 చంద్రలేఖ అని అది నాలుగు విధములు.

రతిరేఖ-ఏలకు ఉద్గాహములో మూడు పాదములుండును. ఇది సామాన్య లక్షణము. మొదటి పాదము 11 మాత్రలు ద్వితీయ పాదములో 11 మాత్రలు మూడవ పాదములో 10 మాత్రలు

కామలేఖ- మొదటి పాదమున 22 మాత్రలు
రెండవ పాదమున 22 మాత్రలు
మూడవపాదమున 20 మాత్రలు

ఇట్లు పూర్వోక్త గణములచేతనే మాత్రాసంఖ్యపూర్తి.
బాణలేఖ-1పాదములో 33 మాత్రలు 2 పాద 33 మాత్రలు 3 పాద 30 ఇట్లు పూర్వోక్త మగణముల చేతనే మాత్రా సంఖ్య పూర్తి
చంద్రలేఖ- మిశ్రిత రతి గణకామ గణ బాణ గణములచే నాలుగు రెట్లు మాత్రలచే చంద్రలేఖ 1పాద 44 మాత్రలు 3 పాద 40 మాత్రలు

ఇందు మత్యాదులు నాలుగును మాత్రైలలే.

ఇందుమతి- 1పాద 5 ఛగణాలు 2 పాద 5 పగణములు చివర తగణము ఇట్లు ఖండద్వయము.

జ్యోతిష్మతి- 1 పాద 5 పగణములు 2 పాద పంచమాత్రాగణము ఇట్లు ఖండ ద్వయము.

నభస్వతి- 1చగణము చగణములు మూడు, 1 పగణము, చివర ఛగణము ఇట్లు ఖండ ద్వయము.

వసుమతి- ఒకదగణము 1 వగణము 1 చగణము 3 పగణములు 1ఛ గణము తగణము ఇట్లు ఖండద్వయము.

ఇవి నంది మతమున మాత్రైల

## ఇంక అర్జున మతమున మాత్రలు

నాదావతి- అయిదు చగణములు, చివర త్రిమాత్రకగణము పాదమున ఖండ ద్వయము. దీనిగణములలో గురువును రెండు లఘువులుగాఁ జేయవలెను.

హంసావతి- ఏడు ఛగణములు చివరలఘువులు రెండు లఘువులు చేయవలెను నగణాంతమున రగణములు గురువులు రెండేసి లఘువులు.

నందావతి- ఏడు ఛగణములు [జగణాంతములు] అయిన తగణములు చివర లఘువు.

భద్రావతి- ఎనిమిది ఛగణములు చివర త్రిమాత్రిక గణము గురువులు రెండేసి లఘువులుగా చేయవలెను.

## ఇతర మతమున మాత్రలు

నందిని- అనియత గణములతోఁగూడిన పూర్వోక్త రతిరేఖ నందిని అనబడును. నందినిలో ప్రథమ తృతీయ పాదములు వ్యత్యస్తముగా పాడవలెను.

చిత్రిణి- అనియత గణముతోగూడిన కామలేఖ చిత్రిణి. ప్రథమ తృతీయ పాదముల వ్యత్యస్తముగా పాడవలెను.

చిత్ర- బాణలేనిది చిత్ర

## ఇట్లుమాత్రలు ఇరువది

వర్ణైలు-గణమాత్రాది నియమములేక వర్ణసంఖ్యా నియమమున్నవి.

వర్ణైలలో ఆరక్షరములు గల పాదఖండము మొదలు 29 అక్షరములుగల పాదఖండము వరకు గల 24 వర్ణైలు గలవు.

మధుకరి-ఆరక్షరములుగల పాదఖండము గలది 7 అక్షరములుగలది సుస్వర 8 అక్షరములు గలది కరిణి. 9అక్షరములు గలది సురస 10 అక్షరములు గలది ప్రభంజని 11 అక్షరాలుగలది మదనవతి. 12 అక్షరాలుగలది శశిని. 13 అక్షరాలు గలది ప్రభావతి. 14 అక్షరాలుగలది మాలతి. 15 అక్షరములు గలది లలిత. 16 అక్షరాలు గలది భోగవతి 17 అక్షరాలు గలది కుసుమవతి 18 అక్షరాలుగలది కాంతిమతి. 19 అక్షరాలుగలది కుముది 20 అక్షరాలు

గలది కలిక 21 అక్షరాలు గలది కమల 22 అక్షరాలుగలది విమల 23 అక్షరాలు గలది నలిని 24 అక్షరాలు గలది కాళింది 25 అక్షరాలు గలది విపుల 26 అక్షరాలు గలది విద్యుల్లత 27 అక్షరాలుగలది విశాలి 28 అక్షరాలు గలది సరల 29 అక్షరాలుగలది తరల

ఇందులో 18 అక్షరములు మొదలుకొని 29 అక్షరముల వరకుగల 12ఏలలు మాత్రిలలతో నగును. కనుక వర్ణ మాత్రిలలు అని కొందఱు. వీనిలో మంఠద్వితీయ, కంకాల, ప్రతితాళములలో ఏదోయొకతాళము వేయవలెను. రాగాది నియమము లేదు.

దేశాఖ్యేలలు అయిదు విధములు దేశభాషా నామములను బట్టియయినవి.

కర్ణాటైల గౌడైల ఆంధ్రైల ద్రావిడైల మంఠ ద్వితీయ కంకాల ప్రతి తాళములతో పాడవలెను. వీనిలో మొదట మధ్య చివర అను ప్రాసలున్నచో నాదావతినామములు గలవగును.

నాదావతి ఆరు రకములు.

సులేఖ– బ్రహ్మయొక్క పూర్వముఖమునుండి పుట్టుక–శంభుగణాధిపుడు. మొదటి రెండు పాదములు అను ప్రాసయుక్తములు. ఆ రెండు పాదములకు చివర రెండు మగణములు మూడవ పాదము రతిగణముతోఁగూడినది ఎక్కువ. అదియుండైతే మధ్య అను ప్రాస గూడినదై నాలుగు కామగణములతో ఒకరతి గణము ఎక్కువగా నుండి కూడినది. అపుడా నాదావతి సులేఖ అనబడును.

కామలేఖ–బ్రహ్మయొక్క దక్షిణ ముఖమునుండి జన్మ. సావిత్రి దేవత విష్ణుడు గణాధిపుడు. ఇందు కామగణములు నాలుగుమొదటి రెండు పాదములందు మొదట మధ్యను అనుప్రాస. మూడవ పాదము ఆదిమధ్యావసానములందు అనుప్రాసయుక్తము. ఎనిమిది కామగణములతోఁగూడినదై నపుడు పూర్వపు హంసావతి కామలేఖ అనబడును.

సర్వలేఖ– బ్రహ్మపశ్చిమ ముఖమునుండి పుట్టినది. బ్రహ్మగణాధిపుడు గాయత్రి దేవత మూడుపాదములందు మొదట మధ్యమ అనుప్రాసప్రతి పాదములోను నాలుగు కామగణములు అపుడు పూర్వనందావతి స్వరలేఖ అనబడును.

భద్రలేఖ–బ్రహ్మయుత్తరముఖమునుండి పుట్టినది. గంధర్వుడు దేవత,గణేశుడు గణాధిపతి మొదటి రెండు పాదములలో ఆరుకామ గణములు చివరబాణగణము మూడవపాదమున ఎనిమిది కామగణములు మూడు పాదము దందును ఆది మధ్యావసానములందును అనుప్రాస ఉన్నపుడు పూర్వోక్త భద్రావతి భద్ర లేఖ అనమడును.

ఛందస్వతి–కర్ణాటైలలో మూడు పాదములలో అయిదు కామ గణములు ఒక రతిగణము చివర మరలకామగణము అపుడవి ఛందస్వతులనబడును. పూర్వోక్త గణములు తక్కువగానున్నను హెచ్చుగానున్నను ఏలాభాసలనబడును. శిఖాపదము–ఒకపాదమునకు లేక రెండుపాదములకు మూడుపదములకుగాని చివర అన్యపాదములు రెండింటికి అగ్రపూర్తికై మూడవపాదమున ప్రమాణ పదము చేయించ బడినచో శిఖా పదమనంబడును. అదైతే మూడవ పాద మున ప్రయోగించుటవలన తరువాత మేలాప కాదులు మొదట చేయవలెను.

ఇవి కర్ణాటైలలు

దేశాఖ్యేల–లాటైలయందు ప్రాంతమందు అను ప్రాసము బహురసములు.

గౌడైలయందు గమకాను ప్రాసలుండవు. ఒకటి రసము. ఆంధ్రైల యందు రసములు భావములు ఎక్కువ. అను ప్రాసలేదు. ఇది వరలో చెప్పిన ఏలలలో ఆయాలక్షణములు గలనాలుగవ పాదము నిబంధించినచో ఇవి ఛంధస్వతులనబడును.

వస్త్వేల–రెండుపాదములు అనుప్రాసలేనివి. మూడవ పాదము అనుప్రాసముగలది. ధ్రువాభోగములుకూడ అను పాసయుక్తములు. అన్నిటి యందు ముందు చెప్పంబోవు నాలుగు యతులు (=యతి=పదమువిడుట) వేఱువేఱుగా నుండును. అదివస్త్వేల.

శుద్ధేలలు నాలుగు వికృత్రైలలు 108 మాత్రైలలు 20 వర్ణేలలు 24. వానిలో మాత్రైలలు 12 కర్ణాటైలలు 6 ఇతర దేశాఖ్యైలలు మొత్తము 178 ఏలలు. చందస్వతులును ఇన్నే కలిపి మొత్తము 356 ఏలలు. సంకీర్ణములు అనంత ములగును గాన శార్ఙ్గదేవుండింక లెక్కింపలేదు.

## కరణము

సూడములోని కరణము చెప్పబడుచున్నది. ఉద్గ్రాహ ధ్రువములుండి అవి పదములచే సాంద్రస్వర బద్ధములందు ఆభోగము గలిగి గాతృనేతృ నామములు గలిగి ఇష్టస్వరమందు గ్రహము అంశము రాగతాళము ద్రుతములయి ఉన్నదికరణము. ఇది సామాన్య లక్షణము.

## కరణము

కరణము– 1 స్వరకరణము 2 పాటకరణము 3 బంధకరణము 4పదకరణము 5 తేనకరణము 6 బిరుద కరణము 7 చిత్రకరణము 8 మిశ్రకరణము అని యెనిమిదిరకములు

## స్వరకరణము

ఉద్గ్రాహము ధ్రువమును సాంద్రములు నిబడములునగు స్వరములచే బద్ధములు కావలయును. ఆభోగము పదములచేఁగూర్పబడెను. ఇందుగాతృనాయకాదుల నామములుండవలెను. ఇష్టమైన స్వరమందు గ్రహము అంశ స్వరమందు న్యాసము. రాసమను తాళము ద్రుతలయ ఇది స్వరకరణము ఇట్లే పాటకరణాదులు విధింపదగును. వానిలో స్వరభేదముండును.

## పాటకరణము

హస్తపాట సహితములైన స్వరములచే నిబంధింపఁబడునది పాట కరణము. మొదట స్వరములు పిదప హస్తపాటములు ఒక రకము. క్రమపాట కరణము మొదట పాటకరణము పిదప స్వరములనునది రెండవరకము ఇది వ్యత్యాస పాటకరణము

బంధకరణము–: స్వరములచే మురజ పాటములచే నిబద్ధము బంధకరణము.
పదకరణము:– స్వరములచే పదములనిబంధింపఁబడునది.
బిరుద కరణము:– స్వరములు బిరుదముకూడ కూర్పబడినది.
తేనకకరణము:– స్వరములు తేనకములు కూర్చునది.
చిత్రకరణము:– స్వరములుహస్తపాటములు మురజాక్షరములు గలది.
మిశ్రకరణము:– స్వరములు హస్తపాటములు తేనకములు గలది ఇవి మరల ఒక్కొక్కటి మూడేసి రకములు.

మంగళారంభము:- ఉద్గ్రాహము మొదట రెండుసారులు పిదవ ధ్రువాభోగములు ఒకసారి పాడి మరల ధ్రువోద్గ్రాహములు చివర పాడవలెను.

ఆనందవర్ధనము- ఉద్గ్రాహము మంగళారంభమువలె ఒకసారిపాడి పిదవ ధ్రువము పిదప ధ్రువములో చివరి సగము పిదప ఆభోగధ్రువహములు ఒకొక్కసారి పాడవలెను.

కీర్తిలహరి:-ధ్రువములోని సగమునకు బదులు ఉద్గ్రాహములోని రెండవ సగము పాడవలెను. మిగిలినది ఆనందవర్ధనమువలె.

ఇదికరణము

డేంకి-ఉద్గ్రాహములోని పూర్వార్ధము రెండుసార్లు పాడవలెను. పిదవ గమక సందర్భముగల మేలాపకము చేయవచ్చును మానవచ్చును. ఆరెండు ఉద్గ్రాహ మేలాపకములు తాళములు లేకుండ కంకాళతాళములో గాని విలంబ ళముగాఁజేయవలయును. పిదవ విలంబితముకాక మిగిలిన లయతో, కంకాళ తాళముతో ధ్రువాభోగము చేయవలెను. పిదవ ఖండ త్రయముగల ధ్రువము. ఆఖండములలో సమధాతువులుగా సమగేయములుగా పాడవలెను. మూడవ ఖండము వానికంటె ఉచ్ఛమానముతో చేయవలెను. ఈ ధ్రువము రెండుసార్లు పాడవలెను. పిదవ ఆభోగము ఒకసారి. మరలను ధ్రువముపాడి సమాప్తిచేయవలయును ఇది డేంకి. ఆఢెంకి 1ముక్తావళి 2వృత్త బంధి 3యుగ్మిని 4 వృత్తమాల అని నాలుగు రకములు. ఛందస్సు లేనిది ముక్తావళి, ఒకేవృత్తబంధిని వృత్తద్వయము గలది యుగ్మిని. బహు వృత్తములు గలది వృత్తబంధి న్యాదులు మరల మూడురకములు 1 వర్ణిక (వర్ణజగణవృత్తములు గలది) 2గణిక (గణజన్యవృత్తములు గలది) 3మాత్రిక మాత్రాజన్యవృత్తములు గలది మరి ఇట్లు పదివిధములైన యది మరల మూడువిధములు. 1 సమాలంకరణ= (ఉపమాదులు గలది) 2 విషమాలంకరణ (=త్ర్యాది సంఖ్యా యుక్త విషమాలంకారములు గలది) 3చిత్రాలంకృతి (సమవిషమాలంకారములుగలది) ఇట్లుమొత్తం 30

ఇదిడెంకి

* * *

## ౹౦కవర్తని

వర్తని-స్వరకరణమునకు వలె వర్తని లక్షణము తెలియునది ఇది విశేషము. రాసకతాళము కంటె తక్కిన తాళము. విలంబితము ఉద్గ్రాహముల పాట రెండుసార్లు. ధ్రువాభోగములు ఒకసారి ధ్రువమునందున్యాసము.

వివర్తని—వర్తన విశేషమే విరర్తని కంకాళతాళములోగాని ప్రతిపాళములో గాని రచించినచో వర్తనియె వివర్తని యగును.

డోంబడము-ఉద్గ్రాహములోని పూర్వార్ధము రెండుసార్లు. ఉత్తరార్ధము ఒకసారి పిదప గమకముగల మేలాపకము. అదియైనను వికల్పము పిదప ధ్రువము రెండుసార్లు పిదప ఒకసారి ఆభోగము పాడి ధ్రువములోన మాప్తి చేసినచో డోంబడము. దానిలో నిస్సారుకము మొదలు ఏకతాళివరకు పది తాళములు చేయవచ్చును. కాని యుదాహరణములు గనిపించుటలేదుగాన అది చేయరాదు. అది రెండువిధములు తారజము అతారజము. అని ఉద్గ్రాహధ్రువ మేలాపకా భోగములందు తారధ్వనియుంచుటను బట్టి అది నాలుగు విధములు. తారధ్వని లేనిది అతారజము. ఇట్లు మొత్తము అయిదురకములు. ఇవి త్రిధాతువులు చతుర్ధాతువులు అని రెండు విధములు. ఈ తొమ్మిది ప్రభూత గమకములు స్తోకగమకములు అని 2విధములు. ఇవి ప్రాయోగికములు. 1నాల్గుగణములుగలది 2క్రమాఖ్యము(అయిదుగణములు గలది) 3క్రమ విలాసము(ఆరు గణములు గలది) 4చిత్రము (ఏడుగణములుగలది) 5 విచిత్రలీల (ఎనిమిది గణములు గలది) అని అయిదు విధములు. ఇట్లు మొత్తము 90 మాతృకాది భేదములు అప్రసిద్ధములుగాన చెప్పబడలేదు. ఇవన్నియు ఉపమారూపక శ్లేషాలంకారములుగూడిన వైనచో అపుడు బ్రహ్మ అను పేరుగల ఝోంబడమగు వీరము రసము. స్త్రీల విలాసయున్నచో విష్ణువు, వీరమున్నచో చక్రేశ్వరులు భీభత్సమున్నచో చండికేశ్వరుడు అద్భుతమున నరసింహము భయానకము భైరవము. హాస్యశృంగారములందు పుష్పసారము, రౌద్రమందు ప్రచండాంశువు శాంతమున నందీశము. ఇట్లు 13 తోగుణించినచో 90 $\times$ 13=1170 అగును గద్య పద్యోభయ భేదముచే నివి 3510 అగును.

ఇది ఝోంబడము

* * *

లంభకము:–ఉద్గ్రాహము అంతయు రెండుసార్లు గాని ఒకసారిగాని, ధ్రువము ఏకఖండముగాఁగాని ద్విఖండముగాఁగాని. ఇట్లే ఆభోగముకూడా ఒకసారి గాని రెండు సార్లుగాని చేయఁబడి ధ్రువమందు సమాప్తియున్నచో లంభకమగును. ఈలంభకమందును ఝోంబడమందును ఖండతాళము తరువాత ఉద్గ్రాహ సమానమైన భాగము ప్రబంధావయవము చేయవలెను. తరువాత ధ్రువము ఆభోగము, మరల ధ్రువముగాని పాడవలెను.

పూర్వోక్త లంభము యొక్క ఉద్గ్రాహమును తాళములేకుండ నిబంధించినచో ఆలాపలంభకమగును. ధ్రువస్థానమున అన్యధాతుకముగా విసదృశ గేయము, ఉద్గ్రాహము నిబంధింపబడినచో ప్రలంభము, మతాంతరమున చెప్పబడిన భాగముగ నిబంధించినచో భాగలంభకము. భిన్నమైన యుద్గ్రాహములతో ధ్రువములను మూడుసార్లు గాని నాలుగు సార్లుగాని అయిదుసార్లు గాని పాడినచో పదలంభమనబడును. ఉద్గ్రాహముగాని ధ్రువముగాని భిన్నమైనచో ఉపలంభము. పదలంభానులంభోపలంభములు మూడును ఆభోగశూన్యములై ధ్రువాభోగములు లేకుండ ఉద్గ్రాహములు ఎక్కువగా నున్నచో అది విలంభము. ఈ ఎనిమిది లంభకములు ముందు చెప్పబోవు సాలగసూడస్థ తాళములతోఁ గూడినట్లు చేయవలెను. ఇవి ఎనిమిది లంబకములు.

రాసకము:–గమకస్థానములులేని ఝోంబడలక్షణము. రాసతాళముతో పాడినచో రాసకమగును. రాస వలయము–గణబద్ధము, వర్ణ నిబద్ధము హంస తిలకము మాత్రాబద్ధము రతి రంగకము. ఛగణము ఎక్కువగా నున్నచో మదనావతారము. ఆరక్షరములు గల చరణము మొదలు కొని 30 అక్షరముల వరకు గల చరణము వరకు ఒకొక్క అక్షరము హెచ్చు చేసినచో 25 రాసము లగును. ఒకటి ఆరు, ఇంకొకటి ఏడు ఇంకొకటి ఎనిమిది అక్షరములు గలది ఇట్లు 30 అక్షరములవరకు తెలియునది అట్లే ఎనిమిది మాత్రలుగ చరణము మొదలుకొని అరవై మాత్రలుగల చరణము వఱకు ఒక్కొక్క మాత్ర చొప్పున పెంచినచో అవి 53 మాత్రలో మాత్రాగణ భేదములు గల రాసములగును.

ఇది రాసక ప్రబంధము

ఏకతాళి–ఉద్గ్రాహమును రెండుసార్లు పాడవలెను. అభోగ ధ్రువములు సగము వరకు ఒకసారి పాడి అభోగధ్రువములకంటె వేరుచోట సమాప్తి ఏకతాళముగ చేసినచో ఏకతాళిక ఇందు ఆలాపమాత్రముచేతనే అని కొందఱి మతము

ఇదిసూడక్రమము

ఆళిక్రమములోని ప్రబంధము

వర్ణప్రబంధము–వర్ణతాళము (త్ర్యశమిశ్ర చతురశ్ర) అను తాళముతోకర్ణాట భాషచే బిరుదములచే ఉద్గ్రాహధ్రువములు నిబద్ధమానము లయి వర్ణమనంబడును. ఇట్లుపదములచే ఆ భోగము కూర్పవలెను.

వర్ణస్వరము–స్వరములచే పాటములచే పదములచే తేనములచేతను రచింపం బడి స్వాభిల షితక్రమముగాన్యాసముచేయుటవర్ణస్వరము. అది నాలుగు విధములు. స్వరములు మొదట నిబంధించుట నిబంధిచుటచే ఒకటి, పాటముల మొదటకూర్చుటచే రెండవది. పదములు మొదటకూర్చుటచే మూడవది. తేనకములు మొదటకూర్చిన నాల్గవ రకము అగును.

గద్యము–ఛందస్సులేనిపదసమూహముగద్యము. అది ఆరు విధములు. 1 ఉత్కలిక=(వీరమున పాడదగు, రక్తవర్ణరుద్ర దేవతాళముగౌడియరీతి, ఆరభటి వృత్తిగలది) ద్రుతగతి బహులఘువులు.

చూర్ణకము–1శాంతరసమున సీతవర్ణము బ్రహ్మదేవత, వైదర్భిరీతి సాత్వతి వృత్తిగలది)విలంబితగతి, అల్పలఘువులు.

లలితము–(సీతవర్ణము, మదనుడు దేవత, శృంగార రసము- కైశికి వృత్తి, పాంచాలిరీతి) మధ్యగతి, సమలఘువులు.

వృత్తగంధి– 1 శాంతమురసము, పీతవర్ణము మునిదేవత, పాంచాలిరీతి, భారతి వృత్తి పద్యభాగ మిశ్రితము) ద్రుతమధ్యగతి పృధక్‌స్థిత లఘువులు

ఖండము–గణేశుడు దేవత సాత్త్వతి వృత్తిశ్వేతవర్ణము హాస్యము. తో ఆరంభము. వైదర్భిరీతి, ద్రుతవిలంబితగతి, పృథక స్థిత గురువులు

చిత్రము– (శృంగారము రసము విష్ణువు దేవత, కైశికివృత్తి వైదర్భిరీతి) లఘుగురుమిశ్రితము, లఘుగురుభేదములచే 6 × 6=36 భేదములు. వేఱి మిశ్రమము ఆకూడఅని కొందఱుచెప్పిరి అన్ని కలిసినది వేఱి ఈచూర్ణక

వృత్తగంధులున్నది మిశ్రము. ఈ గద్యలన్నిటి యందు ఓంకారము తాళరహితముగా పంచదశగమకయుతముగా స్థాయ్యాది సకల వర్ణయుతముగా మధ్య మధ్య పద్యావసానముల స్వరయుతముతగా రువాత ప్రభంధనామాంకితముగా పదద్వయముపాడి విలంబిత ప్రయోగముగా గమకముగా పాడబడును. పిదప సతాళముగా వాగ్గేయకారుని వర్ణ్యనామము విలంబితముగా నాయకుల నామము అవి లంబితముగా పాడి మరల విలంబితముగా సమాప్తి చేయుట గద్యము అనబడును.

కైవాడము– ఉద్గ్రాహధ్రువములు పాటములచేఁ జేయవలెసిన ఉద్గ్రాహము నందు సమాప్తి అదిరెండు విధములు. సార్ధక పాటములచే నొకటి అనర్ధములచే నొకటి మరలఅది శుద్ధము మిశ్రమునని రెండు రకములు. కేవల పాటములచే శుద్ధము పద స్వరాది మిశ్రమములచే మిశ్రము అంక చారిణి–బిరుదములు ఏదో యొక తాళముచే నిబంధింపబడినది. ఆభోగమున వర్ణ్యనాయకుని పేరుండవలెను. అది వాసవి మొదలుగా ఆరు విధములు.

1 వాసవి–వాసవి మొదలైన యైదులోను ఏకతాళ నియమము. అష్ట బిరుదములు ఏకతాళముచే పాడఁబడునవి.

2 కళిక–రెండు తాళములచే పదునారు బిరుదములు పాడఁబడునది
3 వృత్త–మూడు తాళములచేము పైరెండు బిరుదములుపాడబడినది
4 వీరవతి–నాలుగు తాళములచే 52 బిరుదములు పాడబడునది.
5 వేదోత్తర–అయిదు తాళములచే 104 బిరుదములు పాడునది
6 జాతిమతి–తాళబిరుదములు లేనిది.

కందము–కర్ణాటాది దేశభాషా పదములతో పాటములతో వాద్యాక్షరములతో బిరుదములతోగూడి తాళము లేకుండ ఆర్యాగీతియను ఛందస్సునందు వీర రసమున గూర్చబడినది కందమనబడును. 1 పాదమునకు ఏడు గణములు ఒక గురువుతో కలిపి ఉండవలెను. విషమ పాదమున జగణముండరాదు. ఆరవ గణము నలముగాని ఉండవలెను ఇది ఆర్య ప్రథమ దళము రెండు దళములనున్నచో యతి సహితమైనది. ఆ కందము 61 రకములు.

30 గురువులున్నది వ వనము. 29 గురువులున్నది రవి 28 గురువులున్నది ధనదము, 27 ఉన్నది హవ్యవాహనము 26 ఉన్నది సురనాదము 25 ఉన్నది సముద్రము 24 ఉన్నది వరుణము 23 ఉన్నది శశి. 22 ఉన్నది శైలము. 21 ఉన్నది మధువు. 20 ఉన్నది మాధవము 19 ఉన్నది మకర ధ్వజము. 18 ఉన్నది జయంతము 17 ఉన్నది మధుపము 16 ఉన్నది శుకము 15 ఉన్నది సారసము 14 ఉన్నది కేకి 13 ఉన్నది హరి 12 ఉన్నది హరిణము 11 ఉన్నది హస్తి 10 ఉన్నదికాదంబము 9 ఉన్నది కూర్మకము 8 ఉన్నది నయము 7 ఉన్నది వినయము 6 ఉన్నది విక్రమము 5 ఉన్నది ఉత్సాహము 4 ఉన్నది ధర్మము 3 ఉన్నది అర్థము 2 ఉన్నది కామము.

తురగలీల– హయలీల అనునది తాళము గలది తురగలీల. అది పద్యజ గద్యజ అని రెండు రకములు. అందు పద్యజ నాలుగు రకములు. పూర్వార్ధమే తాళయుక్తమైనచో ఒకరకము ఉత్తరార్ధమే తాళయుక్తమైనచో ఒక రకము. పూర్వార్థోత్తరార్ధములు తాళయుక్తమైనచో ఒకరకము. ఇవన్నియు ఆర్యా ఛందస్సులో ఉండవలెను.

నాల్గవది తురగలీల– మొదట సగము స్వరములతోను, పరార్ధము సమాన బిరుదములతోను రెండు సగములు తాళముతో గలిగినచో నాల్గవది తురగలీల. ఇట్లుపద్యజ ఎనిమిది రకములు గద్యజ ఒకటి ఇట్లు తొమ్మిది.

గజలీల– ఛందస్సు లేకుండ గజలీల తాళము గలది మిగతా లక్షణము హయలీలవలె గద్యపద్యజాది లక్షణములు వెనుకటి వలెనె.

ద్విపది–కరుణాఖ్య తాళము గలది ద్విపది అది నాలుగు రకములు 1శుద్ధ ఒక ఛగణము 1జగణము 5 భగణములు జగణము ఇది ఒకపాదము ఇట్లు నాలుగు పాదములున్నచో ద్విపది. కొందరి మతమున సగములో చివరస్వరములు వేయవలెను.

ఖండ– ద్విపది అర్ధ భాగముతో ఖండ అగును. ఇందు రెండు ఖండములే యుండును.

మాత్రాద్విపది- 1భగణము 1జగణము 5 భగణములు జగణస్థానమున గురువు చివర గురువు సంపూర్ణ శుద్ధ ద్విపదికి చివర ఒకేగురువు ఎక్కువగా ఉన్నచో నగును. మరల ద్విపదినాలుగు విధములు. మానవి భగణము 2 తగణము లు పాదము. ఇట్లు నాలుగు పాదములున్నచో అగును. 2 చంద్రిక 2 వగణములు 1తగణము చివర లఘు గురువు పాదము ఇట్లు నాలుగు పాదము లున్నచో నగును.

3ధృతి-1భగణము నాల్గుమాత్రలుగల గణములు మూడు ఇది ఒక పాదము. ఇట్లు నాలుగు పాదములున్నచో నగును. 4తార-1భగణము 4యగణములు చివర గురువులు ఇది ఒక పాదము. ఇట్లు నాలుగు పాదములున్నచో నగును.

చక్రవాళము

పూర్వ పూర్వాక్షరముల ప్రాంతమందున్న వర్ణ సమూహము ఉత్తరోత్తరవర్ణ సమూహమునకు ఆద్యమైనచో చక్రవాళమగును.

అదిగద్యజము పద్యజము అని రెండు విధములు.

క్రౌంచ పదము అను ఛందస్సు (5గణములు 5 గణ 7 గణములకు యతి భ, మ, స, భ, నగణములు 4 గురువు ప్రతి తాళముతో (1లఘువుద్రుతము) పాడిన క్రౌంచపదమగు, స్వరములపదముతో ఉద్గాహములతో ధ్రువము స్వరములతో న్యాసము. ఛందోహీనముగాఁగూడ నుండవచ్చును. ఉదా:-యాక పిలాక్షి పింగళ కేశీ కలిరుచి రనుదినమను నయకఠినా

స్వరార్థము- సరిగమాది స్వరములతోనే స్వాభిలషితార్థము నిబద్ధమైనచో స్వరార్థము, 1శుద్ధము 2మిశ్రము, గ్రహమున న్యాసమున శుద్ధస్వరములైన శుద్ధము. గ్రహము న్యాసమున శుద్ధవికృతములచే మిశ్రము, మరల ఏకస్వర, ద్విస్వర, త్రిస్వర, చతుస్వర పంచస్వర షట్స్వర, సప్తస్వరము అని ఏడు విధములు.

ధ్వనికుట్టని:- ధ్రువము ఉద్గాహము భిన్న తాళములుగా నుండవలెను. మంఠకం కాళ తాళములు మాత్రము చేయరాదు. సమమాత్రలలోయతి

మేలాపకముండరాదు. భిన్న తాళ ద్వయములో ఢేంకి వలెనున్న చో అది ధ్వని కుట్టని

ఆర్య– మొదటి దళము చివరగాని పాదాంతమునఁగాని స్వరములను ఉంచి మొదటి దళమును పాడవలెను. రెండవ దళమును అన్యగీతి సదృశ ధాతువు గల దానిని సగము చొప్పున ఒకసారి పాడినచో అది అర్ధగీతి అనఁబడుచు చున్నది. మొదటి సగము ఉద్గ్రాహము రెండవ సగము ధ్రువము. ఆ భోగములో గాతృ నేతృనామము. ఇట్లు ఉద్గ్రాహ న్యాసములు గలది ఆర్య, లక్ష్మి మొదలైనవి దాని భేదములు.

లక్ష్మి– ఆరవగణముకంటె అన్నిగణములందుఁగల సర్వగురువులచేత లక్ష్మి అగును. ఇతరములు ఏకైక గురు భంగములచేత అనగా లఘుద్వయవృద్ధి చేతఁదెలియవలెను. ఏక గురు భంగముచేవృద్ధి గురు ద్వయభంగముచే లీల మొదలైనవి. ఇట్లె పంచవింశతి గురు భంగముచే వధు 1లక్ష్మి 2 వృద్ధి 3 బుద్ధి 4 లీల 5 లజ్జ అక్షమ 7 దీర్ఘ 8 గౌరి 9 వాజి 10 జ్యోత్స్న 11 ఛాయ 12 కాంతిక 13 మహి 15 కీర్తి 16 మనోరమ 17 రోహిణి 16 విశాల 19 వసుధ 20 శివ 21 హరి 22 చక్ర 23 సారసి 24 కురరి 25 హంస 26 వధువు. ఆర్యకు చతుర్మాత్రికగణములు ఏడు. ఒకగురువు ఆరవగణమున లఘువులో చే నలము. అనగా జగణము గాని నలము గాని ఉండవలెను. ఇట్లు రెండవ దాని యందును

గాథ–ఆర్యయే ప్రాకృత పదమును విషయముఁగాఁ జేసికొన్నచో గాథ అగును. అదిమూడు పాదములున్నచో త్రిపది. ఆరుపాదములున్నచో షట్పది అగునని కొందఱు.

ద్విపథకము– ద్విపథక ఛందస్సు చే నిబద్ధమైనది ద్విపథము. స్వరములందు ముగింపు గలది స్వరమున్తకము. అది తాళముతో గాని, తాళము లేకుండ గాని చేయవలెను. అదిస్వరములతోగా నిబంధించినచో ఒక్కొక్కరకము.

ప్రయోగ గమకములతో గూర్చినచో ఇంకొకరకము. రెండింటితో గూడినచో ఇంకొకరకము, రెండులేనిచో ఇంకొక రకము అగును. ఇట్లు నాల్గు రకములు అది భాషావిశేషముచే ఇతరనామములను పొందును. ఇదే ప్రాకృతమున దోహ అనబడును. ఒకటి మూడుపాదములలో 13 మాత్రలును రెండు నాల్గు పాదముల లో 12 మాత్రలున్నచో సారసము. బేసిపాదములలో 12 మాత్రలున్నచో భ్రమరము. బేసిపాదములలో 15, సరిపాదములలో 13 ఉన్నచో హంసము బేసిలో 13 సరిలో 14 మాత్రలున్నచో కురరము. బేసిలో 13 కళలు సరిలో 15 మాత్రలు ఉన్నచో కుంజరము. బేసిలో 15 కళలు సరిలో13 మాత్రలున్న చో తిలకము బేసిలో 13 కళలు సరిలో 16 కళలున్నచో హంసక్రీడ. పూర్వోక్త దోహలలో పంచ లఘునిర్మితములుగాని షడాది లఘు నిర్మితములుగాని శిఖ లున్నచో ఆ దోహను కొందఱు శిఖద్విపథ మని కొందఱు మయూరమనియు అందురు. వీనిలో వ్యత్యయముగా చేసినచో చాలభేదములు గలుగును.

కలహంసము— కలహంస ఛందస్సు చివర స్వరాశ్రితమై పాదాదులుంచినచో కలహంసము. స్వరములతో ముగింపు ఝంపాది తాళములతో పాడవలెను. ఆదివర్గజము (వర్గగణనిర్మితము) మాత్రకము (మాత్రాగణనిర్మితము) అని రెండు రకములు. గద్యలోగూర్చినచో మొదట స్వరములను పిదప పదములు ఉంచవలెను.

తోటకము— తోటక ఛందస్సు గలది తోటకము. చివర స్వరము లుండవలెను. తోటకవృత్త నామక ఛందో విశేషముండ వలెను.

ఘటము—తేనకములతో సగము ద్విపదితో సగము చేసినచో ఘటమనబడును.
వృత్తము—ఏదో ఛందస్సులో సంక్లిష్టమైన తాళముతో పాడినది వృత్తము. చివర స్వరములనుంచవలెను. స్వరములులేకుండ గూడ పాడవచ్చునని కొందఱు.

మాతృక—52 అక్షరములు వరుసగా ఒకొక్క అక్షరముతో మొదలు పెట్టి పాడిన చో మాతృక అగును. అది దివ్య మానుషి దివ్య మానిషి అని మూడు విధ ములు. సంస్కృతములో చచ్చత్పుటాది తాళములతో పాడబడునది దివ్య దేశ భాషలలో దేశీ తాళములతో పాడబడునది మానుషి మిశ్ర గద్యలో గూర్చి నది అనిబద్ధ పద్యములతో గూర్చినది నిబద్ధ.

రాగకదంబము—ఇది నంద్యావర్తకము స్వస్తికము అని రెండు విధములు. నాలుగు వృత్తములు నాలుగు తాళములతో గూడినది, అనేక భాగములతో గూర్చినది నంద్యావర్తము. ఇది తాళమాన ద్వయముచే తాళము. వృత్తి ద్వయముచేగాని ఉద్గ్రాహముచేగాని సమాప్తి చేయవలెను. కొందఱు రాగ కదంబకమును గద్యల చేతనే చేయవలెనందురు. కొందఱు ఒక తాళముచేఁ గూర్చవలెనందురు.

స్వస్తికము—పూర్వముతో ద్విగుణాష్టక వృత్తము అష్టతాళకము స్వస్తికలు షోడశ వృత్తము షోడశ తాళము గలది అబ్జపత్రము. అబ్జపత్రాంతర్గతము అబ్జగర్భము. ద్వాంత్రిశద్వృత్తము ద్వాత్రింశత్తాళము గలది భ్రమరాక్రేడితము.

పంచతాళేశ్వరము:— తాళహీనమైనచో ఆలాపము పిదప చచ్చత్పుట తాళముతో పంచ పదములు వేఱుగా పాడవలెను. ఆతాళముతోనే స్వరములు పాటములు చేయవలెను. చచ్చత్పుట ద్వయమానముతో పటహ సంభవములైన పాటాక్షరములచే అంతరము చేయవలెను. పిదప చచ్చత్పుటముతో పంచ పదములు చేయవలెను. పిదప వేఱుగా గేయములు వెనుకటి వలెనే ఆ చచ్చత్పుట పాటద్వయముతో హుడుక్క పాటములతో అంతరము చేయవలెను. పిదప షట్పితాపుత్రతాళముతో పంచ పదములు వేఱుగా రెండుసార్లు పాడవలెను. పిదపషట్పితా పుత్రతాళమున ద్వయముచే శంఖ పాటములచే అంతరము చేయవలెను. పిదప సంపక్వేష్టక తాళముతో కాంస్యతాళ పాటములచే అంతరము పిదప ఉద్ఘట్టముతో షట్పదములు స్వరములు పాటములు అంతరమును పూర్వము వలె మానద్వయముచేత పిదప అవిలంబితమానముచేత ఆభోగములో పూర్వమానము ప్రబంధనామముచే చేయవలెను. పిదప నాయకుని పేరు పిదప కళ్యాణము ఆశీర్వచన్సులు. పిదప వాక్యరూపముగా మేలాపకమున బహుళ ప్రయోగమున న్యాసము. అది రెండు విధములు. వీర రసమున వీరావతరము శృంగారమున శృంగార తిలకము. అపంచతాలేశ్వరగీతము పాడబడగా, సర్వదేవతాప్రీతి ఫలము.

తాళార్ణవము—అనేక తాళములచే నిబంధింపఁబడినది తాళార్ణవము.

ఇది ఆశ్రికమప్రబంధములు

———

## ఇంక విప్రకీర్ణములు

శ్రీరంగము— నాలుగు రాగములతో నాలుగు గీతములతో విరచింపఁబడినది శ్రీ రంగము. దానిచివర పదములతోఁగూడినది చేయవలెను. ఉద్గ్రాహాది విభాగము ప్రబంధాది నామాంకము రాగ కదంబమువలె.

శ్రీవిలాసము— అయిదు తాళములతో అయిదు రాగములతో చివర స్వరములతో గూడినది శ్రీవిలాసము. మిగిలినది శ్రీరంగమువలె.

పంచభంగి— రెండు రాగములతో రెండు తాళములతోను గూర్చబడి చివర తేన=వానిచేత రాజుచేత దేవునిచేతను అని చెప్పు తేనపదములతో గూడినది పంచభంగి.

పంచాననము—పంచ భంగివలెనుండి చివర పాటములతో గూడినది. ఉమాతిలకము—మూడు తాళములతో మూడురాగములతో గూడినది ఉమాతిలకము. ఈ అయిదు సర్వాంగయుక్తములు.

త్రిపది— మొదటి రెండు చరణములు గణద్వయ యుతములు. మూడవది నాలుగు గణములు గలది. నాల్గవది మూడుగణములు గలది. వానిలో ఎనిమిది రతి గణములు. ఆరవది పదవది ఇతరములు కామగణయుతము. అందు మొదటి రెండు పాదములు పాడి పిదప మూడవపాదము కొంచెము తక్కువగాను సమగ్రముగాను రెండుసార్లు పాడవలెను. పిదప నాల్గవ పాదముపాడి కర్ణాట భాషతో గూర్పబడి తాళము లేనిదైనచో త్రిపదిఅగును

చతుష్పది— సరిపాదములతో రెకడునాల్గు పాదములలో 16 మాత్రలు. ఒకటి మూడుపాదములలో 15 మాత్రలు, రెండు పాదములందును భిన్న యమకములు చేసినచో చతుష్పది. దీనిలో స్వరతేనకయుత న్యాసము.

షట్పది—ఆరవపాదము మూడవపాదము త్రిగణములు గలిగి ఒకటి రెండు నాలుగైదు పాదములు వేఱుగా ప్రత్యేకముగా రెండేసి గణములు ఉండవలెను. ఆరవ మూడవ పాదములలో బాణగణములు. మిగిలిన పాదములలో కామ గణములు ఉండవలెను. అది కర్ణాటభాషలోఁ గూర్చినచో షట్పది అగును.

వస్తువు— 1, 3, 5 పాదములలో 15 మాత్రలు, 2, 4 పాదములలో 12 మాత్రలు, మొదటి సగములో స్వరములు పాటములు. రెండవ సగములో

స్వరములు తేనకములు. పిదప ఇదివరలో చెప్పిన దోహ, తేనకములతో సమాప్తి చేయవలెను. ఇది వస్తువు.

విజయము— తేనకములు స్వరములు పాటములు పదములు విజయ తాళము గలిగి తేనకములతో ముగింపు అయినచో విజయము.

త్రిపథము— పాటములతో బిరుదములతోస్వరత్రయముతో పాదములో పాడబడినచో అది త్రిపదము.

చతుర్ముఖము— స్థాయి వర్ణమందు స్వరములతో ఒక పాదము, ఆరోహి వర్ణమందు పాటములతో రెండవ పాదము. సంచారి వర్ణములో తేనకములతో నాల్గవ పాదము గ్రహముతో సమాప్తి అది చతుర్ముఖము.

సింహలీల— సింహలీల తాళముతో స్వర పాటాదులతోఁ గూడినది.

హంసలీల— హంసలీల తాళముతో పదములతో ఒక పాదము పాటలతో రెండవ పాదము గూర్చినది.

దండకము— దండక ఛందస్సుతో పదములతో స్వరములతోను దండకము చేయవలెను. (రెండు సగణములు ఏడు రగణములు గలది) చండ వృష్టి ప్రపాత ప్రచితాదులు దండక భేదములు, పదములతో గూర్చిన దండక పూర్వార్ధము ఉద్గ్రాహము. స్వరములతో నిర్మింపఁబడిన ఉత్తరార్ధము ధ్రువము పదాంతరములచే ఆభోగము. అందుచే ఇది త్రిధాతువు. ఛందో నియమముచే నిర్యుక్తము. స్వర పద తాళ బద్ధమగుటచే త్ర్యంగము. భావనీ జాతి గలది.

ఝుంపటము— ఝుంపట ఛందస్సుతో క్రిడా తాళముతో పాడబడునది.

కందుకము–పదములతో మొదటి పాదము, పాటలతో రెండవది బిరుదములతో మూడవది ఉద్గ్రాహాది భేదము పూర్వము వలె తాళాది నియమము లేనిది. స్వర తేనకములు లేక పోవుటచే చతురంగము దపనీ జాతి గలది. సింహలీలాదులు అయిదింటి యందు వ్యాసము చేయవలెను.

1 త్రిభంగి తాళముతో పాడబడునది. 2 త్రిభంగి ఛందస్సుతో పాడబడునది. 3 తాళముల రాగములతోను పాడబడునది. 4 మూడు ఛందస్సు గలది. ముగ్గురు దేవతల స్తుతి గలది.

హారవిలాసము— 1ఖండము బిరుదములతో గూడిన పదములతోను 2వ ఖండము పాటములతోను 3వ ఖండము తేనకములతో పాడబడునది. మొదటి ఖండము ఉద్గ్రాహము. రెండు మూడు ఖండములు ధ్రువములు. పదాంతరములచే ఆ భోగము. ఇది త్రిధాతువు తాళాదినియమము లేవుగాన అనిర్యుక్తము. స్వరములు లేవు కనుక పంచాంగము. ఆనందినీజాతిగలది.

సుదర్శనము—పదములతో బిరుదములతో తేనకములతో పాడునది.

స్వరాంకము—పదములతో ఒక తాళముతో ఉద్గ్రాహము స్వరములచే తాళద్వయముచే ధ్రువము. బిరుదములచే తాళత్రయముచే ఆభోగము. స్వరములచే ముగింపు ఇది స్వరాంకము.

శ్రీవర్ధనము—బిరుదపాటములచేత ఉద్గ్రాహము, పదస్వరములచేత ధ్రువము తాళావృత్తి ద్వయముచే న్యాసము గలది.

హర్షవర్ధనము—పద బిరుదస్వరపాటకములచేత హర్షవర్ధనము.

వదనము—1ఛగణము రెండు వగణములు దగణములు ఈస్వరములతో పాటములతో మధ్య దేశము గలది వదనము. అదే ఛగణ చగణ దగణ తగణములతో గూడినది ఉపవదనము. అట్లే స్వరపాటరచితము ఛగణద్వయముతో దగణ చగణ తగణములతో గూడినచో వస్తువదనము.

చచ్చరి—రాగము హిందోళము (విరామాంతద్రుత ద్వంద్వా న్యష్టౌలఘు చ చచ్చరీ) చచ్చరీతాళము 16 మాత్రలు. చాలపాదములు. వానిలో రెండు పాదములు అనుప్రాస గలవి. ప్రాకృతములైన పదములచే చేయబడినది. వసంతోత్సవమున పాడవలెను. చచ్చరీ ఛందస్సుతో పాడవలెనని కొందఱు. క్రీడాతాళమున నని కొందఱు ధత్తానత్యాది ఛందస్సులతో పాడవచ్చును. అపుడా ఛందస్సునుబట్టి ఆయాపేర్లు కలుగును.

చర్య— పద్ధడి మొదలైన ఛందస్సులు గలిగి పాదాంతమున అనుప్రాస గలిగి ఆధ్యాత్మ వాచక పదములతో గూర్చినది చర్య. అది ద్వితీయాది తాళములతో నుండవలెను. ఛందస్సు పూర్తియైనచో పూర్ణము. అపూర్తియైనచో అపూర్ణము. మరల అది రెండు విధములు. సర్వపాదము అవృత్తమైనచో సమధ్రువ, ధ్రువము అవృత్తమైనచో విషమధ్రువ.

పద్ధడి- రెండు నాల్గు పాదముల చివర అను ప్రాస యుండి పద్ధడి ఛందస్సు తో పాటాంతములచే స్వరసహిత బిరుదములచే చేయబడినది పద్ధడి.

రాహడి- చాలపాదములచే సంగ్రామమును వర్ణించినచో రాహడి.

వీరశ్రీ- పదములచే ఉద్గ్రాహము, బిరుదములచే ధ్రువము, ఆభోగము వేరు చేయవలెను. ఇది త్రిధాతువు. తాళాదులు లేవుగాన అనిర్యుక్తము. పద తాళబిరుద బద్ధముగాన త్ర్యంగము భావనీజాతిగలది.

మంగళాచారము- కైశికీ రాగములో నిస్సారుతాళముతో స్వర సహితముగా పాడబడునది మంగళా చారము. అది గద్యజము పద్యజము గద్య పద్యజము అని త్రివిధము.

ధవళము- ఇది 1 కీర్తి ధవళము (నాల్గుగణములున్నచో) 2 విజయధవళము (6 గణములున్నచో) 3 విక్రమధవళము (ఎనిమిది గణములున్నచో నగును.

ఒకటి మూడు పాదములలో ఛగణయుగము రెండునాల్గు పాదములలో తగణము, దగణము గాని ఎక్కువ. అపుడు కీర్తిధవళము ఒకటి నాల్గు ఆరు రెండు పాదములలో రెండేసి దగణములు మూడు అయిదు పాదములు ఛగణ ముతో గాని, వగణముతోగాని అధికము. అపుడు విజయ ధవళము. మొదటి పాదములో చగణ త్రయము దగణమును ఏడవపాదములో ఆశీర్వాదములతో పాడవలెను. యదృచ్ఛచేగాని లోకప్రసిద్ధిని బట్టిగాని పాడవలెను.

మంగళము- కైశికీరాగములోగాని బొట్ట రాగములోగాని కళ్యాణ వాచక పదములతో విలంబితలయతో మంగళము పాడవలెను. మంగళనామక ఛం దస్సుతోగాని పాడవలెను.

ఇవి 36 ప్రకీర్ణ ప్రబంధములు

* * *

ఓవి- దేశభాషచే అనుప్రాసచేతను ఖండత్రయముతోగూడ చివర ఓవి పదము పాడినచో ఓవి అగును. దీనికిని చరణావృత్తి భేదము చేత పదమున ఆది మద్యావ పానములందు అనుప్రాస భేదములచేతను చాలా భేదములు అగును ఇవియు బహుఛందస్సులతో పాడవలెను.

లోలి-ఓవి పదమునకులోలి పదము వేసినచో లోలి అగును.
ఢోల్లరి- పూర్వము చెప్పబడిన దోహదమందు ప్రాంతమున ఢోల్లరి పదము పాడినచో ఢోల్లరి అగును. అది లాట భాషచే పాడవలెను.
దంతి- అను ప్రాస ప్రాయముగా ఖండత్రయమునకు ప్రాంతమున దంతీ పదమున్నచో దంతి. ఏపదములలో ఆభోగము చెప్పబడలేదో అక్కడ పదములచే ఆభోగము తెలియ వగును. ఓవి మొదలగు నాల్గింటిలో ఆభోగములేదు.
సాలగసూడము- సూడము 1 శుద్ధము 2 ఛాయాలగము అని రెండువిధములు ఏలాదులు శుద్ధములు, ధ్రువాదులు సాలగములు సాలగము=ఛాయాలగము ఛాయాలగములు శుద్ధసాదృశ్యమును బట్టి శుద్ధములని భరతాదులనిరి. శ్రుత ప్రకరణము మొదలుకొని అంతర భాషవరకు చెప్పబడిన ప్రకరణమువలె తాళాధ్యయములో చెప్పబోవు 14 గీతములు ఇవి శుద్ధము. దీనితో ఏలాదులకు సాదృశ్యము అనియతత్వము సమ్యక్ప్రయోగములో ఫలము అసమ్యక్ప్రయోగములో దోషము అని తెలియనగును. ధ్రువమంఠప్రతి మంఠ నిఃసారు కొడ్డ తాళరాస ఏకతాళిగీతములతో సాలగ సూడ ప్రబంధము లగును
ధ్రువము- మొదట సదృశగేయ ఖండద్వయ యుక్తమైన ఉద్గ్రాహము చేయవలెను. పిదప కొంచెము ఉచ్చమైన అంతరాఖ్యము, ఈమూడును రెండుసార్లు పాడవలెను. పిదప ఖండద్వయ యుక్తమైన ఆభోగము. దాని మొదటి రెండు ఖండములు ఏక ధాతుకములు. సదృశగేయ ఖండద్వయ యుక్తము, రెండవఖండము ఇంకను ఉచ్చముగా పాడవలెను. ఈ ఆభోగము స్తుత్యనాయక నామముతో గూడినట్లు చేయవలెను. ఒక చోట కొందఱ మతమున ఆది ఉచ్చైక ఖండము పాడవలెను. ఉద్గ్రాహము యొక్క మొదటి ఖండమునందును సమాప్తి. అది ధ్రువము.

జయంతాది షోడశ ధ్రువలు

పదకొండు అక్షరముల ఖండము మొదలు 26 అక్షరముల ఖండము వరకు ఒక్కొక్క అక్షరము పెంచుటచే జయంతము మొదలు లలితము వరకు పదునారు ధ్రువలగును.

జయంతధ్రువ-ఆది తాళముతో ఏకాదశాక్షరముల ఖండము. శృంగారము ననేతృశ్రోతృగాతల కాయుశ్రీవర్ధనము. శేఖరము-నిఃసారు తాళముతో ద్వాదశాక్షర ఖండము వీరమున బుధ సౌభాగ్యదము.

ఉత్సాహము- ప్రతిమంఠతాళముతో త్రయోదశాక్షర ఖండము హాస్యమున వంశవృద్ధికరము.

మధురము-హయలీలాతాళముతో చతుర్దశాక్షర ఖండమున భోగదము.

నిర్మలము-క్రీడాతాళముతో పంచదశాక్షర ఖండము శృంగారమున నగు.

కుంతలము-లఘు శేఖర తాళముతో షోడశాక్షర ఖండము అభీష్టదము అద్భుతమున. నగు

కామలము-ఝుంపాతాళముతో సప్తాదశాక్షర ఖండము విప్రలంభమున-సిద్ధిదము.

చారము- నిఃసారు తాళముతో అష్టాదశాక్షర ఖండము వీరమున హర్షప్రదము

నందనము-ఏకతాళితో 19అక్షరములఖండము వీరశృంగారముల ఇష్టసిద్ధిదము

చంద్రశేఖరము- ప్రతిమంఠతాళముతో 20 అక్షరముల ఖండము వీరమున అభీష్టదము.

కామోదము- ప్రతి మంఠతాళముతో 21 అక్షరముల ఖండము హాస్యమున విజయకరము

కందర్పము- ఆదితాళముతో 23 అక్షరముల ఖండము. హాస్యశృంగార కరుణములందు భోగదము సదాశివసమ్మతము

జయమంగళము-క్రీడాతాళముతో 24 అక్షరముల ఖండము శృంగారవీరముల

తిలకము- ఏకతాళితో 25 అక్షరముల ఖండము జయోత్సాహ ప్రదము.

లలితము- ప్రతిమఠ తాళముతో 26 అక్షరముల ఖండము వీరశృంగారము సర్వసిద్ధికరము.

మఠము- ఉద్గ్రాహ ఖండమున రెండు యతులు. ఒక యతియైనను సరే పిదప ధ్రువ రెండుసార్లు పాడవలెను. పిదప ధ్రువ పాడినను సరే పాడకున్ననుసరే పక్షమున దానిని పాడి ధ్రువము పాడ వలెను, పిదప ఆభోగము ధ్రువలో ముగింపు. ఇట్లు మంఠతాళమున పాడునది. మంఠమనబడును.

అది ఆరు విధములు.

జయ ప్రియము-జగణ రూపమంతముతో పాడబడునది. వీరరసము. భగణముతో మంగళము. శృంగారరసము. సగణముతో సుందరము. రగణముతో వల్లభము. నగణతో ముగింపైనచో కలాపము. ద్రుతద్వంద్వముతో ముగించిన ధ్రువ చివర లఘువున్నచో కమలము.

ప్రతి మంఠము-ప్రతిమంఠ తాళముతో పాడబడునది ప్రతి మంఠము. అది నాలుగు రకములు.

అమరము-ఒక గురువుతో పాడబడునది శృంగారము

తారము-విరామము చివర ధ్రువ తరువాత లఘువుల ద్వయముతో పాడబడునది.

విచారము- విరామాంతలఘుత్రయముతో పాడబడునది.
కుందము-విరామ మధ్యగా లఘుత్రయముతో పాడునది.
నిః సారుకము- నిఃసారుకతాళముతో రచింప బడునది నిఃసారుకము. అది ఆరురకములు.

1 వైకుందము-ద్రుతద్వయ లఘుద్వయములచేతగూర్చునది.
2 ఆనందము-విరామాంతమున ద్రుతద్వయముచేత గూర్చునది దీనిని రూపకమందురు.
3 కాంతారము-లఘుగురువులచేత నగును,
4 సమరము- విరామాంతలఘుద్వయముచేత నగును. దీనిని జంబునాలమందురు.
5 వాంఛితము-లఘుత్రయ ద్రుతద్వయముచేత పాడబడునది.
6 విశాలము-లఘుద్రుతద్వయలఘువులచేత పాడబడునది.
అడ్డతాళము-అడ్డితమను తాళముతో పాడబడునది అడ్డతాళము. అది ఆరు రకములు.

1 నిశ్శంకము-లఘుగురువుల తర్వాత ద్రుత ద్వయముతో పాడబడునది.
2 శంకము-లఘుతర్వాత ద్రుతద్వయముతో పాడ బడునది.
3 శీలము-విరామాంతముతో ద్రుతద్వయము పిదప
4 వారము-ద్రుతద్వయము తరువాత లఘుగురువులతో పాడునది.

5
6 మకరందము-ద్రుతద్వయము పిదప గురువుతో పాడునది.
విజయము- ద్రుతద్వయము పిదప లఘువుతో పాడునది.
రాపకము- రాసతాళముతో పాడునది. అదినాలుగురకములు.
1 వినోదము-ద్రువ పదమునకు చివర ఆలాపము కూర్చినచో నగును.
2 వరదము-ద్రువమధ్య ఆలాపమున్నచోనగును.
3 నందము-ఖండ ద్వయయుక్తమైన యుద్గ్రాహమునకు మొదటి ఖండము ఆలాప నిర్మితమైనచో నగును.

4 కంబుజము- ధ్రువమునకు మొదలు ఆలాపమున్నచో నగును.
అన్ని రాసకములలోను ఉద్గ్రాహముద్వి ఖండముగా చేయవలెను.
ఏకతాళి-ఏకతాళినామ కతాళముతో గూర్చునది. అదిమూడురకములు,
1రమ-ఒకయతి గల ఉద్గ్రాహము అంతరము అక్షరనిర్మితమైనచో రమ అగును. అది శ్రీనిగూర్చును.

2 చంద్రిక- ద్విఖండములుగల ఉద్గ్రాహము. అంతరము ఆలాపము రచిత మైనచో నగును.

3 విపుల-ఉద్గ్రాహమునకు ముందుఆలాపము చేసినచో విపుల. అక్షర వర్జిత గమకాల స్థియే ఆలాపము దానినే ప్రయోగమందురు.

రూపకము-ముందు చెప్పబోవు గుణములు గలిగి దోషములు లేని రూప పంచకము ఉత్తమము, నూతన రాగముతో ధాతుమత్త్వాదులైన తానములచే రూపకము నూతన మగును. రూపకాంశభేదముచే ధాతువు నూతనమగును. రసాలంకార భేదముచే మాతువు నూతన మగును. లయగ్రహ భేదముచేత తాళము నూతనమగును. తాళము విశ్రామము యొక్క సామ్యముచే విశ్రామముచే గాని లయ నూతన మగును. క్రొత్త వగుఛందోగణ గ్రహన్యాస ప్రబంధావయుములచే రచన నూతన మగును.

జోడు వాపర పర్యాయమగు రచననూతనమగును.
ఈ యుత్తమరూపకము మూడు విధములు.

1 పరివృత్తము- పూర్వసిద్ధమైన స్వస్థానకమమున నూత్న రాగముతో గాని చేయబడునది పరివృత్తము. రూపకమున స్థానము పూర్వము. అస్థాయి యందెరాగతాళ పరివర్తముతో స్వస్థానా వృత్తి ఉన్నచో అది పరివర్తనము
2 పటాంతరము- మాతు స్థాయుపై చిత్ర్యమువల్ల గుణాదారమైనది. పటాంతరము తనకంటె అన్యమైన ధాతువుతో పాడబడునది.

భంజని–దానికంటె అన్యధాతువుగలదిగాన భంజనీ సంశ్రితమగును. అధమ రూపకము 1ఖల్లొత్తారము 2 అనుసారము అని రెండు రకములు.

[1] ఖల్లోత్తాలము-రూపకాంతర మందున్నస్థాయిమాత్రాంతరమున నివేశించినచో ఖల్లోత్తారము.

అనుసారము–ఆదేకొంత ధాతువిలక్షణమున్నచో అనుసారము.

ఇది పంచ విధరూపకలక్షణము.

గీతగుణములు పది.

1వ్యక్తము 2 పూర్ణము 3 ప్రసన్నము 4 సుకుమారము 5 అలంకృతము 6 సమము 7 సురక్తము 8 శ్లక్ష్ణము 9 వికృష్టము 10 మధురము.

గీతదోషములు పది.

లోక శాస్త్రదుష్టము 2 దుష్టము 3 శ్రుతివిరోధి 4 కాల విరోధి [redacted] క్తము 6 కళాబాహ్యము 7 గతక్రమము 8 అపార్థకము 9 గ్రామ్యము 10 సందిగ్ధము

## నేడు వాడుకలోఁగల ప్రబంధములు

1 కీర్తనలు లేక కృతులు

ఇవి కన్నడ, తెలుగు తమిళ సంస్కృత భాషలలో నున్నవి, వీనిలో ఇష్టదేవతలనుగూర్చిన వర్ణనలుండును, వీనికి ధ్రువ, అంతర, భోగములకు అంగములు గలవు. వీనిని మనము వేరు పేర్లతో పిలుచు చున్నాము. ధ్రువ అనగా పల్లవి, అంతర అనఁగా అనుపల్లవి. ఆభోగము అనఁగా చరణము అని అనుచున్నాము కొన్ని కీర్తనలతో అనుపల్లవి యుండదు. ఇవికన్నడ రాగములలో నున్నవి. పదము బిరుదము అను రెండు అంగములే ఉండును. ఇటువంటివి పురందరదాసు పదములలో గలవు.

పల్లవి అనుపల్లవి చరణముల సంప్రదాయములను పురందరదాసు రామ దాసు త్యాగరాజు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు శ్యామశాస్త్రి స్వాతి తిరువాళ్ళు పట్టణంసుబ్రహ్మణ్యము మొదలగు వారుప్రవర్తింపజేసిరి.

2 గీతములు–

ఇవి సాలగడ ప్రబంధమును అనుసరించి వానిరాగ తాళములలో రచింప బడినవి.

వీనిలో స్వరము పదము బిరుదము అనుమూడు అంగములు కలవు. ఇవిఆరంభదశలో రాగపరిచయమునకై నేర్పబడుచున్నవి

3 వర్ణములు—

ఇవిమూడు వందలయేండ్లకుపూర్వము రచింపబడినవి. రాగమునకు యోగ్యముగా ఆరోహి అవరోహి సంచారి స్థాయిలలో రాగమును తెలుపుటకు ఉపయోగించునట్లుపర్ణింపబడినవి. కాన వర్ణములనబడెను. ఉద్గ్రాహము అభోగము అని రెండు అవయవములు పదము స్వరము బిరుదము అనునంగములును ఉండును. ప్రతియవయవములోను పదము, పదముతరువాత చిట్టస్వరము వానికి సంబంధించినదియుండును వీనిని వెంకటమఖి సుబ్బరామదీక్షతులు వీణ కుప్పయ్యరు కులశేఖరులు పల్లవి గోపాలయ్యరు మొదలగు వారు రచించిరి.

వర్ణములు తానవర్ణములు, పదవర్ణములు అని రెండు రకములు తాన వర్ణములు రాగప్రధానములు. పదవర్ణములో నృత్యములు ఉపయోగింపబడును

3 పదములు

వీనిలో ఎక్కువగా నీతి, భక్తి, శృంగారములు ప్రధానముగానుండును వీనిలో పల్లవి అనుపల్లవి చరణములుండును చిట్ట స్వరములు జాతులు చేర్పబడును. వీనిని క్షేత్రయ్య సుబ్బరామయ్యరు ముత్తుతాండవరు చిన్నయ్య పొన్నయ్య మొదలగువారు రచించిరి.

ఇవి విశేషించి నృత్యములో ఉపయోగింపబడును.

4 జావళులు—

ఇవి ముఖ్యముగా శృంగారరసయుక్తములు. వీనిగతి మధ్యము ద్రుతములలో నుండును.

దరువు—పదమువలెనే శృంగార రసములో నువయుక్తము. ఒకచరణముతో పాడబడును కొన్నిటికి రెండు మూడు ఉండును.

5 చిందు—

ఇవి మధ్యద్రుతగతులలో నుండును. వీనిలో కావడిచిందు, నోడిచిందు ఊడ చిందు వలిసై చిందు మొదలగునవి కలవు ఇవిశృంగార ప్రధానములు

తిల్లాన, ఇది అన్యదేశీయములైన తిరి తిల్లానా అనుగ్రామ్యపాటములలో దేశీయ రాగాలలో వర్ణక్రమముతో తాళబద్ధమై యుండును

మంగళము-చివర మంగళముతో ముగింతురు.

ఇది

ప్రబంధాధ్యాయము.

* * *